అపరాధ పరిశోధన అనుబంధం—109

# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## భారతనారీ జిందాబాద్

రచన : వసుంధర

## దారిదోపిడీ

రచన : వాణిశ్రీ

## మరణ శాసనం

రచన : సికిందర్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—109
జనవరి, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# భారతనారీ జిందాబాద్!

వసుంధర

అప్పుడే సినిమా వదిలారు. జనం గుంపులు గుంపులుగా బయటకు వస్తున్నారు.

"జన్మలో మళ్ళీ సినిమా చూడకూడదు—" అన్నాడు శాస్త్రి.

"ముఖ్యంగా తెలుగు సినిమా...." అన్నాడు శర్మ.

"అందులోనూ హిట్ పిక్చర్..." అన్నాడు శాస్త్రి.

"అప్పటికీ ఒకటా, రెండా.... నూటయాభై రోజులు ఆగాం — ఇంకా జనం విపరీతంగా మెచ్చేసుకుంటూ తండోపతండాలుగా చూసేస్తూంటే — మనం మాత్రం మానవమాత్రులం కాదా—అందుకే సినిమా బాగుంటుందని పొరబడ్డాం—...."

"అందుకే జన్మలో మళ్ళీ తెలుగు హిట్ పిక్చర్ చూడకూడదు...."

శర్మ అనుమానంగా—"అవునూ—నెల్లాళ్ళ క్రితం కూడా మనమిలాగే అనుకున్నామేమో—" అన్నాడు.

# 4

"నెల్లాళ్ళ క్రితం కాదు—వారం రోజుల క్రితం—" శాస్త్రి సవరించాడు.

"ఛీ ఛీ—మనకు బొత్తిగా మాట నిలకడలేకుండా పోయింది—" శర్మ బాధపడ్డాడు.

"ఏం చేస్తాం? ఒకే సమయంలో రెండు హిట్ పిక్చర్లాడుతూంటే ఎవరికైనా మాట నిలకడ లేకుండా పోతుంది—...." అన్నాడు శాస్త్రి.

"అలాంటప్పుడు జన్మల గురించి మాట్లాడకూడదు. మళ్ళీ పదిరోజులదాకా అనో....వారం రోజులదాకా అనో—....సినిమా చూడమనుకోవాలి...."

"నా ప్రియమైన స్నేహితుడా—అలాగనుకున్నప్పుడు మర్నాడే సినిమా చూసేస్తాం...."

శర్మ నవ్వాడు — "నాకు తెలుసు. కానీ లక్ష రూపాయల అప్పు ఎగేసిన వాడికంటె పదిరూపాయలే ఎగేసిన వాడు పుణ్యాత్ముడు కదా!"

"నువ్వో విషయం మర్చిపోతున్నావు—" అన్నాడు శాస్త్రి—"హిట్ తెలుగు సినిమా చూసినవాడు చచ్చిన వాడితో సమానం. ఆ విధంగా ఒకో సినిమా చూసినపుడల్లా మనం చనిపోయి మరో జన్మ ఎత్తుతున్నాం. అందువల్ల ఈ జన్మకు మళ్ళీ సినిమా చూడమనుకోవటం వల్ల ఏ మాత్రమూ మాటతప్పే ప్రమాదంలేదు—...."

"ఆహా — ఇప్పటికి నా మనసు తేలికపడింది—" అన్నాడు శర్మ.

"నా కడుపు చాలాసేపట్నించి తేలికగా వుంది—" అన్నాడు శాస్త్రి.

"అవునూ—మన పర్సు కూడా తేలికగా ఉన్నట్లు గుర్తు—" అని శర్మ జేబులో చెయ్యిపెట్టి—"అరే—

అసలు జేబే తేలికై పోయిందే!" అన్నాడు.

ఎవడో శర్మ జేబులోంచి పర్సు కొట్టేశాడు.

"అంత అజాగ్రత్తగా ఎలా వున్నావు?" శాస్త్రి మందలించాడు.

"హిట్ తెలుగు సినిమా చూస్తున్నాకదా—మతి మతిలో లేదు...."

"ఇప్పుడేం చేయడం?" శాస్త్రి వాపోయాడు. అతడి కడుపు ఇంకా ఇంకా తేలికై పోతోంది.

"దారికాద్దాం...." అన్నాడు శర్మ.

"ఓపిక లేదు. పరుగెట్టడం మాట అటుంచి కనీసం నడిచే ఓపిక కూడా లేదు...." అన్నాడు శాస్త్రి.

"ఎలాగో నాలుగడుగులు వేశావంటే—అదిగో ఆ కనిపించే హోటల్లో భోజనం పెట్టిస్తాను—" అన్నాడు శర్మ.

"నిన్నే నమ్ముకుని ఆ నాలుగడుగులూ వేస్తాను-...." అన్నాడు శాస్త్రి.

ఇద్దరూ దగ్గర్లోని భోజన హోటలుకు వెళ్ళారు.

ప్రొప్రయిటరు వీళ్ళవంక ఎగాదిగా చూస్తూ-"ముందు కూపన్లు తీసుకోవాలి—" అన్నాడు.

"ఈ ప్రపంచంలో మనిషి మనిషిని అనుమానించటం కంటె అవమానం లేదు. అందుకనే మేము భోంచేశాకనే కూపన్లు తీసుకుంటాం—" అన్నాడు శర్మ.

"మీ సిద్ధాంతం నాకు నచ్చింది. మీరు నన్ను అనుమానించకుండా నా చేతికో వందరూపాయల నోటు ఇచ్చి లోపలకు వెళ్ళి భోంచేసి రండి. తిరిగిరాగానే చిల్లర మీకు ఇస్తాను—" అన్నాడు ప్రొప్రయిటరు.

"ఇన్నేళ్ళుగా హోటల్ నడుపుతూ ఓ పరమ సత్యం

గ్రహించనందుకు నిన్ను చూస్తే నాకు చాలా జాలిగా వుంది—" అన్నాడు శర్మ.

"ఏమిటా పరమ సత్యం?" అన్నాడు ప్రొప్రయిటరు.

"వంద రూపాయలనోటు జేబులో వున్నవాడెవడూ నీ హోటలుకు భోజనానికి రాడు—" అన్నాడు శర్మ.

ప్రొప్రయిటరు చలించకుండా - "జోకు చాలా బాగుంది. అయినా సరే కూపన్ లేకుండా మీకు నేను భోజనం పెట్టలేను—" అన్నాడు.

మిత్రులిద్దరూ బయటకు వచ్చారు.

"మన సెరిగిన వాళ్ళందరూ మనకంటె తెలివిమీరి పోతున్నారు. కారణమేమిటంటావ్?" అన్నాడు శర్మ.

"అవసరం...." అన్నాడు శాస్త్రి—"ఇంక నువ్వు నన్ను ప్రశ్నలు వేయకు. నీరసం వచ్చేస్తోంది. జవాబులు చెప్పలేను—"

"ఈ ఊళ్ళో హోటళ్ళకు కరువా—అదిగో ఆ కాఫీ, భోజన హోటలుకు వెడదాం—" అన్నాడు శర్మ.

వీళ్ళను చూస్తూనే ఆ ప్రొప్రయిటర్—"రేపొద్దుటికి కావలసిన పిండిలన్నీ రుబ్బటం అయిపోయింది. ఇంకో రోజు కనబడండి—" అన్నాడు.

"రోజులు మారిపోతున్నాయి-" శర్మ నిట్టూర్చాడు.

"ఎందుకూ అని అడక్కు. నీరసంగా వుంది. చెప్ప లేను—" అన్నాడు శాస్త్రి.

శర్మ అతడిని మరో హోటలుకు తీసుకెళ్ళాడు.

"మీరు రుబ్బిన పిండి సరిగ్గా పులవటంలేదు...." అన్నాడు ప్రొప్రయిటర్.

ఇంకో హోటలుకు వెడితే — "నేను ఎలక్ట్రికల్ రుబ్బురోళ్ళు కొని నాలుగు రోజులైంది—" అని

చెప్పాడు.

"ఇదేంటి గురూ—ఎక్కడికి వెళ్ళినా పిండి రుబ్బడం గురించే చెబుతున్నారు. మనం ఎన్ని హోటళ్ళలో పిండి రుబ్బామేమిటి?" అన్నాడు శర్మ.

"అబ్బా....నీరసం....నో క్వశ్చన్స్...."

"వెధవది. రోజులు దారుణంగా మారిపోతున్నాయి. పిండి రుబ్బడానికి సిద్ధపడ్డా హోటళ్ళలో భోజనం దొరకడంలేదు...." శర్మ నిట్టూర్చాడు.

"ఓ మాట చెప్పనా?" అన్నాడు శాస్త్రి.

"ఊం."

"అంతా మన మేలుకే అంటారు. వెనకటికి ఓ రాజు గారి వేలు తెగిపోతే అదే ఆయన ప్రాణాలు కాపాడిందట. మొత్తం కథ చెప్పే ఓపికలేదు కానీ—మనకు హోటల్ భోజనం దొరక్కపోవడమే మంచిది...." అన్నాడు శాస్త్రి—"వెధవది—హిట్ తెలుగు సినిమా చూసి హాల్లోంచి బయటకు వచ్చేక హోటల్ భోజనం ఏం సయిస్తుంది? మంచి ఇంటి భోజనం...."

"నీ అయిడియా బాగుంది. కానీ ఏ యింటికెళ్ళాలి?"

"అబ్బా—నీరసం—నో క్వశ్చన్ ...."

"అడ్డమైన వాగుడూ వాగుతున్నావు. నా ప్రశ్న వినేసరికి నీరసం వచ్చేస్తుందేం?" అన్నాడు శర్మ.

"అయ్యో....ఇది కూడా ప్రశ్నే...."

సరిగ్గా అప్పుడే వాళ్ళ పక్కన ఓ రిక్షా ఆగింది—"మంచి ఫామిలీ లేడీ సార్...."

## 2

శాస్త్రి చటుక్కున రిక్షా ఎక్కి కూర్చున్నాడు. శాస్త్రి వెనకనే శర్మ కూడా రిక్షా ఎక్కి—"మంచి

ఫామిలీ లేడీ అన్నావు కదూ!" అన్నాడు.

"అవునండి...." అన్నాడు రిక్షావాలా.

"నా స్నేహితుడు మంచి ఆకలిమీద వున్నాడు—" అన్నాడు శర్మ.

"ఆకలితో వున్నవాళ్ళను తృప్తిపర్చడానికి ఆయమ్మ తర్వాతేనండి...."

"మరి — డబ్బులడుగుతుందా?" అన్నాడు శర్మ కంగారుగా.

"బాగుందండి. యెవరైనా ఊరికే ఆకలితీరుస్తారా?"

శర్మ మరి కాస్త కంగారుగా—"ఇంట్లో ఎంతమంది వుంటున్నారు?" అన్నాడు.

"అబ్బే—ఆమె తప్ప ఇంకెవ్వరూ లేరండి...."

శర్మ తేలికగా నిట్టూర్చాడు. మళ్ళీ అతడికింకో అనుమానం వచ్చింది—"మేము వెళ్ళేసరికి భోజనం సిద్ధంగా వుంటుందా?"

"మీకా అనుమానమే అక్కర్లేదు. రాత్రివేళ ఏ టైములో వెళ్ళినా భోజనం తయారుగానే వుంటుంది—" అన్నాడు రిక్షావాలా.

"రాత్రి వేళ అంటున్నావు. మరి పగలు....?" అన్నాడు శర్మ.

"ఫామిలీ లేడీ అని చెప్పానుకదండీ-అక్కడ రాత్రి భోజనమే!"

"ఓహో—" అని ఊరుకున్నాడు శర్మ.

ఇంట్లో ఒక్కతే వుంటోంది. ముందు తమకు భోజనం పెడితే ఆ తర్వాత ఏదో చేసి మభ్యపెట్టవచ్చు. ఆడది....

రిక్షా ఓ ఇంటిముందు ఆగింది.

శర్మ రిక్షా దిగాడు. శాస్త్రిని దింపాడు.

"ఇదేనా ఇల్లు?" శర్మ అడిగాడు.

రిక్షావాలా వేలితో చూపిస్తూ—"అదే!" అన్నాడు.

చిన్న పెంకుటిల్లు అది.

"బాగుందోయ్—" అన్నాడు శర్మ. మిత్రులిద్దరూ ముందుకు నడిచారు.

"బాబూ-డబ్బు లివ్వండి—" అన్నాడు రిక్షావాలా.

"భోంచేసి రాగానే మళ్ళీ మా యింటికి తీసుకు వెళుదువుగాని. బయట కూర్చో. వచ్చేక డబ్బులిస్తాను" అన్నాడు శర్మ.

"అలా వద్దండి. డబ్బులిచ్చేసి వెళ్ళిపోండి—...." అన్నాడు రిక్షావాలా.

"డబ్బులిచ్చేస్తే—నువ్వు వెళ్ళిపోతావు... "

"నేను వెళ్ళిపోవాలండి....అందుకే డబ్బు లడుగుతున్నాను...."

"అయితే నూర్రూపాయల చిల్లరుందా?" అన్నాడు శర్మ.

"వుందండి...." అన్నాడు రిక్షావాలా తడుముకోకుండా.

శర్మ తడబడిపోయి—"నిజంగా వుందా?" అన్నాడు.

"ఉందండి—"

"నూర్రూపాయల చిల్లరున్నవాడివి నమ్మలన్నమాత్రం నమ్మలేవూ?" దీనంగా అన్నాడు శర్మ.

"నమ్మను కాబట్టే నా దగ్గర నూర్రూపాయల చిల్లరుంది...."

శర్మ క్షణం ఆలోచించి—నీకెంతివ్వాలి?" అన్నాడు.

"పదిరూపాయలు...."

"ఈ కాస్త దూరానికి పదిరూపాయలా?"

“నా దగ్గరలాంటి బేరాలుండవండి. బేరమాడే బుద్ధి వున్నవాళ్ళు—రిక్షా ఎక్కేముందు ఆడాలి....”

“సరే.... నేను వేసుకున్న చొక్కా ఖరీదు ఎంతో చెప్పగలవా?” అన్నాను శర్మ.

“ఎంతైతే నాకెందుకండీ—” అన్నాడు రిక్షావాలా.

“ఇది వందరూపాయలు చేస్తుంది. తెలుసా?”

రిక్షావాడు చిరాగ్గా చూసి — “అయితే నన్నేం చెయ్యమంటారు?” అన్నాడు.

“ఇది నీకెవ్వరైనా పాతిక రూపాయలకు ఇస్తారంటే నమ్ముతావా?”

“నమ్మను—”

“నేను నీకు దీన్ని పాతిక్కే అమ్మేస్తున్నాను. నాకో పదిహేనిలా ఇచ్చేయ్—”

రిక్షావాలా తెల్లబోయి — “బట్టలు చూసి మోస పోయాను. మీ దగ్గర డబ్బుల్లేవా?” అన్నాడు.

“మమ్మల్నెరిగున్న వాళ్ళెవరూ మా బట్టలు చూసి మోసపోరు. మా దగ్గర డబ్బులుంటే చొక్కా ఎందు కమ్ముకుంటాం?” అన్నాడు శర్మ.

“నాకు చొక్కా వద్దు. డబ్బులే కావాలి....” అన్నాడు రిక్షావాలా.

“నేను చొక్కాయే యిస్తాను. నూర్రూపాయల చిల్లర దగ్గరెట్టుకుని చొక్కా కొనుక్కోనంటావేం?” అంటూ దబాయించాడు శర్మ.

రిక్షావాలా కేకలు ప్రారంభించాడు.

“శర్మా—నాకు నీరసం పెరిగిపోతోంది-” అన్నాడు శాస్త్రి.

“సరే— ఇంక వీణ్ని కరుణించి లాభంలేదు—”

అంటూ శర్మ రిక్షావాలాను సమీపించి కాలరు గట్టిగా పట్టుకుని మెడ నరంమీద ఓ దెబ్బవేశాడు. అంతే—వాడు మూలుగుతూ పడిపోయాడు.

అప్పుడు శర్మ రిక్షా సీటు ఎత్తి చూశాడు. డబ్బాలో నూటపాతిక రూపాయలున్నాయి. అన్నీ తన జేబులో పెట్టుకున్నాడు. రిక్షావాలాను రిక్షాలో కూర్చోపెట్టాడు. రిక్షాను కాస్త రోడ్డుపక్కగా పెట్టాడు.

## 3

రిక్షావాలా చూపించిన చిన్న పెంకుటింటి తలుపు తట్టాడు. కొద్ది క్షణాల్లో ఆ ఇంటి తలుపు తెరుచుకుంది. సుమారు పాతికేళ్ళలోపు యువతి తలుపుతీసి-"లోపలకు రండి!" అంది.

శాస్త్రి, శర్మ—ఇద్దరూ లోపల ప్రవేశించారు.

"చాలా ఆకలిగా వుంది. భోజనం కావాలి—" అన్నాడు శర్మ.

"భోజనం మీముందు సిద్ధంగా వుంది-" అన్నదామె.

శాస్త్రి చుట్టూ చూశాడు.

"ఏదీ—ఎక్కడా కనిపించదేం?" అన్నాడు శర్మ.

"భోజనమంటే — నేనే! ఈ సమయంలో నన్ను మించిన భోజనం మీకెక్కడ దొరుకుతుంది?" అందా యువతి.

"ఓహ్—" అన్నాడు శర్మ. "వెధవ సినిమా చూసి మతి పోగొట్టుకున్నాం. ఆ రిక్షావాలా మాటలకప్పుడే అర్థం తెలియాల్సింది—" అనుకుని—"ఇంట్లో నువ్వు తప్ప వేరే భోజన మేమీ లేదా?" అన్నాడు.

అప్పుడామె అతణ్ని పరిశీలనగా చూసి—"వుంది—" అంది.

"ముందు అన్నం వడ్డించు. మిగతా మాటలు తర్వాత"
అన్నాడు శర్మ.

ఆమె వారిద్దరికీ ఆదరించి అన్నం పెట్టింది. ఇద్దరూ అవురావురుమంటూ భోంచేశారు.

"కన్న తల్లికంటె మిన్నగా ఆదరించావు. థాంక్స్" అన్నాడు శర్మ.

"నా ప్రాణం లేచి వచ్చింది. మళ్ళీ పునర్జన్మ ఎత్తినట్లుంది—" అన్నాడు శాస్త్రి.

"నీ చేతిలో అమృతముంది. ఈ భోజనానికి విలువ కట్టలేం—" అన్నాడు శర్మ.

"నా దగ్గరకు అన్నానికి వచ్చిన మొదటి మనుషులు మీరు—" అందా యువతి.

"అయితే మమ్మల్ని బాగా గుర్తుంచుకో — ఇంక సెలవు తీసుకుంటాం—"

"అప్పుడే వెళ్ళిపోతారా?" అందా యువతి.

"మా పని అయిపోయిందిగా..-" అన్నాడు శాస్త్రి.

"నాతో కాసేపు సరదాగా గడపాలని లేదూ—" అన్నదామె.

"లేదు. ఇంటికిపోయి నిద్రపోవాలని వుంది—" అన్నాడు శర్మ.

"అయితే మీరు నన్ను సరిగ్గా చూడలేదు—...." అందా యువతి. ఆమె వారిని ఆకర్షించడానికి ప్రయత్నించింది.

శర్మ ఇబ్బందిపడుతూ—"ఆకలితో వున్నప్పుడు అన్నం పెట్టావు. నీలో నేను తల్లిని చూశాను. దయుంచి ఇలా ప్రవర్తించకు—" అన్నాడు.

"నాకు డబ్బు కావాలి—" అన్నదామె.

"ఎంత?"

"మీ సంతోషాన్ని బట్టి ఎంతైనా ఇవ్వవచ్చు. కానీ వందరూపాయలకు తగ్గకూడదు...." అందా యువతి.

"అయ్యో—రెండు భోజనాలకు వందరూపాయలా? ఇది కన్నతల్లి లక్షణంకాదు-" అని వాపోయాడు శాస్త్రి.

"అందుకే నేను కన్నతల్లిని కావాలనుకోవటంలేదు" అందా యువతి తన వయ్యారాలను ఒలికిస్తూ, వంపు సొంపులను బాహాటంగా ప్రదర్శిస్తూ.

"మా దగ్గర డబ్బులేదు...."

"ఉంది....చూశాను...."

శర్మ అప్రయత్నంగా తన జేబువంక చూశాడు. పల్చని పోలీఎస్టర్ చొక్కా జేబులోంచి నోట్లు కనబడు తున్నాయి.

"కష్టజీవుల దగ్గర్నుంచి డబ్బు ఆశించటం నీకు న్యాయంకాదు—" అన్నాడతను.

"నువ్వు కష్టజీవివి కాదు—...." అన్నదామె.

"కానీ ఈ డబ్బు కష్టజీవిది...."

"ఎవరా జీవి? నీ మిత్రుడా?"

శర్మ ఆ డబ్బు ఎవరిదో తమకెలా వచ్చిందో చెప్పాడు.

తెల్లబోయిందామె. వీధిలోకి వెళ్ళి చూస్తే రిక్షా కన బడింది. వీళ్ళ కథను నమ్మక తప్పలేదు.

"పాపం—వాడు కష్టపడి సంపాదించిన డబ్బు మీరు తీసుకుంటారా?"

శర్మ నవ్వి—"వాడు కష్టపడి సంపాదించాడో లేదో నాకు తెలియదు. అయినా ఈ డబ్బు నాకక్కర్లేదు. స్పృహలోలేని మనిషి దగ్గర డబ్బుంటే ప్రమాదమని అందాకా నా దగ్గరుంచాను. వెళ్ళేటపడు మళ్ళీ వాడికే

యిచ్చిపోతాను...." అన్నాడు.

"మరి నా సంగతి?"

"నీ భోజనం మాకెప్పుడూ గుర్తుంటుంది. ప్రస్తుతానికి మా దగ్గర డబ్బులేదు. కానీ ప్రతిఫలంగా నువ్వేమడిగినా చెయ్యగలం...." అన్నాడు శాస్త్రి.

"అర్జంటుగా నాకు వందరూపాయలు కావాలి. లేకపోతే ఉదయం నా భర్త వచ్చి నా ప్రాణాలు తీస్తాడు...." అన్నదా యువతి.

ఆమె మాటలు మిత్రులిద్దరికీ ఆశ్చర్యాన్ని కలిగించాయి — "ఏమన్నావ్?" అన్నారిద్దరూ ఒకేసారి ఏక కంఠంతో.

ఆమె తన కథ చెప్పుతుంది.

ఆమె పేరు నీరజ. భర్త పేరు శ్యామలరావు. అతడికి ఎన్నో వ్యసనాలున్నాయి. పెళ్ళి చేసుకుని ఆమెను వ్యభిచారిణిగా మార్చాడు. రోజూ ఉదయం వచ్చేసరికి అతడికి ఆమె వందరూపాయలిచ్చుకోవాలి. లేకపోతే కొరడా దెబ్బలు....

"ఎప్పుడైనా కొట్టాడా?" శాస్త్రి అడిగాడు.

ఆమె చూపించింది. వీపుమీద మచ్చలున్నాయి.

"ఇది అమానుషం — వాడి అంతు చూస్తాను...." అన్నాడు శర్మ.

"అమానుషం వాడిది కాదు...." అంది నీరజ.

"మరి?"

"నిర్మలది...."

"నిర్మల ఎవరు?"

నీరజ కథ మొదలు పెట్టింది.

• • •

నిర్మల, నీరజ స్నేహితురాండ్రు.

నిర్మల కాలేజీకి కార్లో వస్తుంది. నీరజ నడిచి వస్తుంది.

నీరజకు సరైన నా అనేవాళ్ళు లేరు. ఆమె అనాథ అనిపించుకుండుకు వీల్లేకుండా బంధువులున్నారు.

నీరజ అందగత్తె. చాలా బాగుంటుందని చెప్పాలి. ఆమె ఆర్థిక పరిస్థితి అంతో యింతో తెలిసిన యువకులు చాలామంది ఆమెకు ప్రేమలేఖలు వ్రాశారు. కానీ ఆమె ఎన్నడూ ప్రిన్సిపాలుకు రిపోర్టివ్వలేదు. పేదదాని కోపం పెదవికి చేటు అని ఊరుకున్నదామె.

నీరజకు ఉత్తరాలు వ్రాసిన వారిలో ప్రసాద్ ఒకడు. ప్రసాద్ నిర్మలకు బావ. అతడొక రోజు స్వయంగా నిర్మలనే అడిగాడు—"మీ కాలేజీలో చదివే నీరజ అనే అమ్మాయికి నేను ప్రేమలేఖ వ్రాశాను. జవాబివ్వలేదేం?" అని.

నిర్మల అగ్గిమీదగుగ్గిలమై మొత్తం మగజాతిని దుయ్యబట్టింది.

"ప్రేమలేఖ వ్రాయడం తప్పా?" అన్నాడు ప్రసాద్.

"పరాయి ఆడదానికి వ్రాయటం తప్పే...." అంది నిర్మల.

అప్పుడు ప్రసాద్ తను నీరజను ప్రేమిస్తున్నాననీ—ఆమెకు అభ్యంతరం లేకపోతే తనామెను పెళ్ళిచేసుకుంటాననీ అన్నాడు.

"అయితే మరి నా సంగతేమిటి?"

"నీ పెళ్ళికేం బాధ—కో అంటే కోటిమంది...."

"బావా-నేను నిన్ను ప్రేమిస్తున్నానని తెలియదా?"

అంది నిర్మల.

"నీరజను చూసేవరకూ నేనూ నిన్ను ప్రేమించాను. కానీ ఇప్పుడు.." అని ఆర్కోకిలో ఆగిపోయాడు ప్రసాద్.

నిర్మల బాగా దెబ్బతింది. ఆ తర్వాత బిజినెస్ మానేజ్‌మెంట్లో ట్రయినింగ్ కని ప్రసాద్ అమెరికా వెళ్ళాడు. రెండేళ్ళ ట్రయినింగ్ అది.

నిర్మల నీరజతో స్నేహం చేసుకుంది. ఆమె పరిస్థితులు తెలుసుకుంది. ఫీజు కట్టడంలో, పుస్తకాలు కొనివ్వడంలో ఆమెకు సాయపడింది.

తర్వాత నిర్మల తన తండ్రికి నీరజ గురించీ, ప్రసాద్ తనతో అన్న మాటల గురించీ చెప్పింది. ఆయన కంగారు పడ్డాడు.

"ఇప్పుడేం చేయాలి?" అన్నాడాయన.

"బావ వచ్చేలోగా నీరజకు పెళ్ళయిపోవాలి—" అన్నది నిర్మల.

రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదువలేదు. నిర్మల తండ్రి శ్యామలరావునుపట్టాడు. నిర్మల శ్యామలరావు గుణగణాల గురించి నీరజకు అబద్ధాలు చెప్పింది. నిర్మల ప్రోత్సాహం మీదనే నీరజకు పెళ్ళయింది. నిర్మల ప్రోత్సాహంతో శ్యామలరావు నీరజను వ్యభిచారిణిని చేశాడు. నిర్మల బావ అమెరికానుంచి తిరిగివచ్చాడు.

నీరజ ప్రవర్తన మంచిదికాదనీ ఆ కారణంగానే ఆమె భర్త దుర్వ్యసనాలపాలైనాడనీ నిర్మల ప్రసాద్‌కు చెప్పింది. అన్నీ నమ్మాడు ప్రసాద్. ఎంతో కొంత అనుమానముంటే—ఓ రాత్రి నీరజ ఇంటికి వెళ్ళి సందేహ నివృత్తి కూడా చేసుకున్నాడతడు.

కేవలం తన స్వార్థంకోసం ఒక నిండు జీవితాన్ని

నాశనం చేసింది నిర్మల.

ప్రస్తుతం నీరజ భర్త — భార్యకు బేరాలు కుదిర్చి పెట్టడానికి ఓ రిక్షావాణ్ణి నియమించాడు.

*　　*　　*

"అంటే నీకీ జీవితం ఇష్టం లేదా?"

"ఏ ఆడదీ ఇలాంటి జీవితానికి ఇష్టపడదు—" అంది నీరజ.

"అయితే మేము నీకు సాయపడతాం. మాతో వచ్చేసేయి. గౌరవంగా బ్రతికే ఏర్పాటు చేస్తాం..." అన్నాడు శాస్త్రి.

"ఇంక గౌరవంగా బ్రతికే అవకాశం నాకు లేదు. శారీరకంగా మానసికంగా చెడిపోయాను నేను..." అంది నీరజ.

"పోనీ మేము నీకు ఎలా సాయపడగలమో చెప్పు.." అన్నాడు శర్మ.

"తిన్న భోజనానికి డబ్బివ్వలేనివాళ్ళు మీరు నాకేం సాయపడగలరు?" నిరసనగా అన్నదామె.

"మా శక్తియుక్తుల గురించి చెప్పుకోనటం బాగుండదు. చెప్పు. చేసి చూపిస్తాము...." అన్నాడు శాస్త్రి.

"అయితే నిర్మలను పట్టుకొచ్చి నాకు అప్పగించండి. ఒక్క ఇరవై నాలుగు గంటలు చాలు....తర్వాత మళ్ళీ నేను మీకు అప్పగిస్తాను...." అంది నీరజ.

"ఎందుకు?"

"పగ తీర్చుకోడానికి...."

"ఏం చేస్తావ్?"

"చెప్పను—...." అంది నీరజ.

"ఆమెను చంపాలనుకుంటున్నావా?"

"చంపను. శారీరకంగా హింసించను. అవయవలోపం కలిగించను. ఇరవై నాలుగు గంటలు నా ఆధీనంలో ఉంచుకుని మళ్ళీ క్షేమంగా మీకు అప్పగించేస్తాను...."

మిత్రులిద్దరికీ కుతూహలం పెరిగిపోయింది.

"మేము నిర్మలను తెచ్చి ఇరవై నాలుగు గంటలు నీకు అప్పగిస్తాము...." అన్నాడు శాస్త్రి.

"నాకా నమ్మకంలేదు. కానీ మీరు విజయం సాధిస్తే నేను చాలా సంతోషిస్తాను...." అంది నీరజ.

## 4

నిలువెత్తు ఇనుపగేటు.

దానిముందు సింహంలాంటి గూర్ఖా.

శాస్త్రి గేటునీ, గూర్ఖానీ ఓసారి పరీక్షగా చూసి—"ప్రసాద్‌బాబుగారున్నారా?" అన్నాడు.

"లేరు—" కటువుగా అన్నాడు గూర్ఖా.

"లోపలకు వెళ్ళొచ్చా?"

"ఎందుకు?" అన్నాడు గూర్ఖా.

"ఓసారి ఇల్లు చూడాలని వుంది—"

"చూడ్డానికి వీల్లేదు...."

"ఎందుకని?"

"తెలిసినవాళ్ళనే గానీ లోపలకు పంపడానికి వీల్లేదు."

"నాకు ప్రసాద్‌బాబు బాగా తెలుసు...."

"కానీ మీ రెవరో నాకు తెలియను...."

శర్మ నవ్వి—"నీకు తెలిసినవాళ్ళనే గానీ ప్రసాద్‌బాబుకు తెలిసినవాళ్ళని ఇంటిలోపలకు వెళ్ళనివ్వవా?" అన్నాడు.

"ప్రసాద్‌బాబుకు తెలిసినవాళ్ళందరూ నాకు

తెలుసు" అన్నాడు గూర్ఖా.

"అయితే నేను తెలియదని అంటావేం?"

"మీరు ప్రసాద్ బాబు ఎరిగున్నవారు కాదు కాబట్టి."

"గూర్ఖాలక్కూడా తెలివితేటలొచ్చేశాయి....."

బాధగా అన్నాడు శాస్త్రి.

సరిగ్గా అప్పుడే లోపల్నుంచి కారు ఒకటి వచ్చి ఆగింది. గూర్ఖా వినయంగా తలుపుతీశాడు.

కార్లో ముందు సీట్లో డ్రైవరున్నాడు. వెనుక సీట్లో ఓ యువతి వుంది.

"నమస్కారం నిర్మల గారూ!" అన్నాడు శర్మ చటుక్కున.

"ఎవరు మీరు?" అంది నిర్మల.

"అయ్యో—నన్ను గుర్తుపట్టలేదా?" అన్నాడు శర్మ బాధగా.

"చాలా అర్జంటు పనిమీద వచ్చాం—" అన్నాడు శాస్త్రి.

నిర్మల కారు దిగింది—"మీ పనేమిటో చెప్పండి—"

"మీతో అయిదు నిమిషాలు ఏకాంతంగా మాట్లాడాలి!" అన్నాడు శర్మ.

"ఇక్కడ చెప్పకూడదా?"

"చెబితే—మీకే నష్టం...." అన్నాడు శర్మ.

"కారు లోపలకు పోనిచ్చేదా అమ్మా—" అన్నాడు డ్రైవరు.

"ఊఁ" అంది నిర్మల.

"వద్దండి. ఏ పార్కుకైనా వెళ్ళి మాట్లాడుకోనటం మంచిది...." అన్నాడు శాస్త్రి.

నిర్మల తల ఊపింది.

శాస్త్రి, శర్మ ముందు సీట్లో కూర్చున్నారు. నిర్మల వెనుక సీట్లో కూర్చున్నది.

కారు కొద్ది నిమిషాల్లో ఓ పార్కు ముందర ఆగింది. ముగ్గురూ కార్లోంచి దిగారు. "డ్రైవర్ — నువ్విక్కడే వుండు—" అంది నిర్మల.

ముగ్గురూ పార్కులోకి వెళ్ళి ఓ చోట కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి...." అంది నిర్మల.

"మేము ప్రయివేటు డిటెక్టివులం...." అన్నాడు శాస్త్రి.

"బల్లకట్టు లేదుకానీ మా గురించి చాలా మందికి తెలుసు—" అన్నాడు శర్మ.

"అయితే?" అంది నిర్మల.

"ఇది చాలా ముఖ్య విశేషం...." అన్నాడు శాస్త్రి.

నిర్మల కుతూహలంగా చెవులు రిక్కించింది.

"మీ భర్త ప్రసాద్ మీ ప్రవర్తనను అనుమానిస్తున్నారు—" అన్నాడు శాస్త్రి.

నిర్మల ఉలిక్కిపడి—"మీకెలా తెలుసు?" అంది.

"ఆయన మిమ్మల్ని నీడలా వెన్నంటమని మమ్మల్ని నియమించారు...."

నిర్మల తెల్లబోయింది.

గత రెండు దినాలుగా నిర్మల ఎక్కడెక్కడికి వెళ్ళి ఏమేం చేసిందో వివరంగా చెప్పాడు శర్మ.

"అంటే మీరు రోజూ నన్ను వెంటాడుతున్నారా?"

"రోజూ కాదు—గత రెండు దినాలుగా...."

"వెంటాడి మీరేం తెలుసుకున్నారు?"

"ఏమీ తెలుసుకోలేకపోయాం!" అన్నాడు శర్మ.

నిర్మల తృప్తిగా నిట్టూర్చి-"ఆ విషయం నా భర్తకు

చెప్పారా?" అంది.

"చెప్పాం—కానీ...." అన్నాడు శర్మ.

"ఊఁ కానీ...." అంది నిర్మల ఆత్రుతగా.

"ఆయనకు కావలసింది అదికాదు...."

"మరేమిటి?"

"మీరు నిర్దోషిగా నిరూపించబడాలని ఆయన అనుకోవటంలేదు. మీ దోషాన్ని నిరూపించే సరైన సాక్ష్యాన్ని సంపాదిస్తే అయిదువేలిస్తానన్నాడాయన. ఆ సాక్ష్యం తప్పుడు సాక్ష్యమైనా సరే — కోర్టువారు నమ్మేలాగున ఉంటే చాలు...."

"ఇదంతా ఎందుకు?"

"బహుశా ఆయన విడాకులు తీసుకుందామని ప్రయత్నిస్తున్నాడనుకుంటాను— ..." అన్నాడు శాస్త్రి.

"ఇంతకూ మీరు నన్నెందుకు కలుసుకోవాలని అనుకుంటున్నారు?"

"మేము ప్రయివేటు డిటెక్టివులం. నేరపరిశోధనలో ఎవరికైనా సాయపడతాం తప్పితే నిర్దోషులకన్యాయం చేసే మనస్తత్వం మాకు లేదు. డబ్బు మాకు అవసరమే కానీ ముఖ్యంకాదు. మీ భర్త ఆలోచనల గురించి చెప్పి మిమ్మల్ని హెచ్చరించాలని అనిపించింది మాకు...."

నిర్మల ఆలోచనలో పడింది. ఇప్పుడు తనేం చేయాలి? ప్రసాద్ కి ఏమయింది? అతడికి తననుంచి విడాకులు తీసుకోవలసిన అవసరమేమిటి?

శర్మ అన్నాడు—"మీ ఆయన ప్రేమలో పడ్డాడు. ఓ అమ్మాయిని తరచుగా కలుసుకుంటున్నాడు. మీపైన నిరాసక్తతకు ఆ అమ్మాయే కారణమయుండవచ్చు. ఈ రెండ్రోజుల్లో పరిశోధించి మేము ఈ విషయం కూడా

తెలుసుకున్నాం—...."

"ఎవరా అమ్మాయి?" అంది నిర్మల ఆత్రుతగా.

"ఆమె పేరు నీరజ అనుకుంటాను—" అన్నాడు శాస్త్రి.

నీరజ పేరు వినగానే నిర్మల ఉలిక్కిపడింది. ఆమె ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. అంటే నీరజ మళ్ళీ తన భర్తను వలలో వేసుకున్నదా? అది సాధ్యమా?

"నేనా నీరజను కలుసుకుని మాట్లాడేను-" అన్నాడు శాస్త్రి.

"ఏమన్నదామె?"

"ప్రసాద్ వివాహితుడని నీకు తెలుసా అంటే తెలుసునంది. మరీ వ్యవహారమేమిటీ అంటే—ప్రసాద్ భార్య తనకు అన్యాయం చేసిందనీ—అది తను ప్రసాద్ కి తెలియజెప్పాననీ — దాంతో అతడికి భార్య అంటే విరక్తి పుట్టిందనీ అన్నది. అప్పుడు నేనామెకు పచ్చని సంసారంలో చిచ్చుపెట్టటం ఎంత తప్పో చెప్పాను. ఒక ఆడది మరో ఆడదాని జీవితం నాశనం చేయబూను కోవటం న్యాయం కాదన్నాను. నా ఉపన్యాసం ఆమె మీద పనిచేసింది. ప్రసాద్ భార్య అనగా మీరు....తన వద్దకు వచ్చి జరిగిందానికి క్షమార్పణ కోరుకుంటే ప్రసాద్ కి తను చెప్పినవన్నీ అబద్ధాలని చెప్పి తను అతడి జీవితం నుంచి తప్పుకుంటానని అన్నది...." అన్నాడు శాస్త్రి.

నిర్మల ఆలోచనలు చురుగ్గా పరుగెత్తాయి. తన సమస్యకు సులభ పరిష్కారమున్నదనిపించిందామెకు.

నిర్మలకు ఆర్థిక సమస్యలు లేవు. భర్త వదిలిపెడితే తన జీవితం ఏమైపోతుందోనన్న బెంగలేదు. కానీ సమా

జంలో గౌరవంగా బ్రతకటం అన్నింటికీ మించి ముఖ్యం ఆమెకు. అందుకే నీరజ చూపిన పరిష్కారం ఆమెకు అంగీకారమయింది.

"ఆలస్యం—అమృతం-విషం—మీరిప్పుడే బయల్దేరటం మంచిది...." అన్నాడు శాస్త్రి.

ఉన్నట్లుండి నిర్మలకో అనుమానం వచ్చింది—"మీరు శాస్త్రీ నా భర్తకు అవసరమైన సాక్ష్యాలు సంపాదించటం కోసం నన్నిలా మోసం చేయటం లేదుకదా—"

శాస్త్రి చిరాగ్గా — "దానికి వెధవ సోదంతా ఎందుకు—" అంటూ చటుక్కున ఆమె మెడమీద ఓ దెబ్బవేశాడు. క్షణాల్లో ఆమెకు స్పృహ తప్పింది.

ఆమెకు తిరిగి సరైన ఉపచారం చేసి స్పృహ తెప్పించి "అయిదు నిమషాల సేపు మీకు స్పృహ లేకుండా చేశాను. ఈ అయిదు నిమషాలు చాలు మాకు—ఎన్నో సాధించ డానికి. మనుషుల్ని ఎత్తుకుపోవటం—అందులోనూ ఆడ వాళ్ళను ఎత్తుకుపోవటం మాకు పల్లేరుపై బండి నడక వంటిది. పిచ్చి పిచ్చి అనుమానాలతో మీ భవిష్యత్తు పాడుచేసుకోకండి. మేము కూడా మీ వెంట రాము. మీకు తన ఇల్లు తెలుసునని నీరజ చెప్పింది. మీరామె ఇంటికి వెళ్ళండి. ఎటొచ్చీ ఆమె ఇంటికి నా కార్లో వెళ్ళడం అంత మంచిది కాదని నా ఉద్దేశ్యం...." అన్నాడు శాస్త్రి.

నిర్మల ఇంక మారాలోచించలేదు. ఆమె పార్కు నుంచి బయటకు వెళ్ళి డ్రైవర్ని పంపేసింది. తర్వాత నీరజ ఇంటికి రిక్షాలో వెళ్ళింది.

ఆమె నీరజ ఇంట్లో అడుగుపెట్టటం మిత్రులిద్దరూ దూరాన్నుంచి గమనించి టైము చూసుకున్నారు.

# 5

సరిగ్గా మర్నాడదే షైముకి వాళ్ళు దూరాన్నుంచి గమనించారు.

నిర్మల నీరసంగా బయటకు వస్తోంది.

"మనం ఋణం తీర్చుకున్నట్టే!" అన్నాడు శాస్త్రి.

"నీరజ ఋణం మనం తీర్చుకున్నాం. కానీ మన ఋణాలలాగే ఉండిపోయాయి—" అన్నాడు శర్మ.

"అయితే నిర్మలను డబ్బు అడుగుదాం .." అన్నాడు శాస్త్రి.

"అడిగితే ఇస్తుందంటావా?"

"ఎందుకివ్వదు? ఆమెకు మనం చేసిన ఉపకారం సామాన్యమైనది కాదు. విడాకులు కోరే భర్తనుంచి ఆమెను...."

"సరే—అదంతా మనం కల్పించిన కథ. నిర్మలను నీరజ ఈ యిరవైనాలుగ్గంటలలోనూ ఏం చేసిందో తెలియదు...."

"నీరజమీద నాకా నమ్మకముంది. ఆమె అన్నమాట తప్పదు...."

"సరే—ఓ రాయివేసి చూద్దాం. మనకు పోయిందేముంది?"

మిత్రులిద్దరూ త్వరత్వరగా వెళ్ళి ఆమెను కలుసుకున్నారు. నిర్మల వాళ్ళను చూసి—"మీరా?" అంది.

"అవును. మేము మిమ్మల్ని నిన్న వెళ్ళమన్నాం. మీరీరోజు వెళ్ళినట్లున్నారు. నిన్న ముహూర్తం బాగోలేదా—" అన్నాడు శాస్త్రి.

నిర్మల మాట్లాడలేదు.

"వెళ్ళిన పని సక్రమంగా అయిందా?"

నిర్మల నీరసంగా నవ్వింది.

"అడుగుతున్నందుకు మరోలా అనుకోకండి. మీ భర్త అప్పగించిన పని సక్రమంగా చేయలేకపోయాం. మాకా బేరం పోయింది. మీరు మాకు ఎంతో కొంత డబ్బు ఇవ్వాలి...." అన్నాడు శర్మ.

"మీకు డబ్బు కావాలా?" అంది నిర్మల.

"అవును...."

"ఎంత?"

"మీరెంతిచ్చినా సరే...."

"వంద ఇస్తాను—తీసుకుంటారా?"

శర్మ తెల్లబోయాడు—"పోనీ—అంతే ఇవ్వండి. మీ శక్తి అంతే అనుకుంటాం—" అన్నాడు.

"మీరు చేసినదానికి బదులిచ్చే శక్తి నాకుంటే బాగుండేది...."

"అది మా దురదృష్టం...." అన్నాడు శాస్త్రి—"పోనీ ఆ వందే ఇవ్వండి. త్వరగా...."

"అది మీ దురదృష్టం కాదు—అదృష్టం...."

శాస్త్రి కోపంగా—"మా సంగతి మీకు తెలియదు. కావాలంటే ఏమైనా చేయగలం మేము...." అన్నాడు.

"ఏమైనా చేయగలరా?"

"ఆఁ....మంచి పనైతేనే మరి!"

"అయితే మీ ఇద్దరికీ చెరో పదివేలూ యిస్తాను. నీరజ భర్త శ్యామలరావును మామూలు మనిషిని చేయండి—" అంది నిర్మల.

శాస్త్రి తెల్లబోతూ—"ఏమిటన్నారూ?" అన్నాడు.

"నేనేమిటన్నప్పటికీ అది మంచి పని కాదని మాత్రం

మీరనలేరు....”

శాస్త్రి, శర్మ ఓ క్షణం ఆలోచించారు.

“సరే—ఆ శ్యామలరావు వివరాలు చెప్పండి!”

“అన్నీ చెబుతాను. వాడో తాగుబోతు. జూదరి. తన అవసరాలకోసం భార్యచేత వ్యభిచారం చేయించే నీచుడు....” అంది నిర్మల.

“అలాంటి నీచుడివల్ల ఏ భార్యా సుఖపడదు. వాడు చావటం మంచిది. అప్పుడు నీరజ యింకో పెళ్ళి చేసుకుంటుంది....”

“నీరజకు వాడు చావటం ఇష్టంలేదు. మారటమే ఇష్టం....”

“అహా—....భారతనారీ జిందాబాద్....” అన్నాడు శర్మ.

# 6

“అడుగో—దేవదాసు....” అన్నాడు శాస్త్రి.

“అహా-కళ్ళింకా మూతలు పడలేదు. మన అదృష్టం..” అన్నాడు శర్మ.

ఇద్దరూ అతడిని సమీపించారు.

“నమస్కారం దేవదాసుగారూ—...” అన్నాడు శాస్త్రి.

“నా పేరు దేవదాసు కాదు....శ్యామల....” అన్నాడతడు.

“అదేంటి సార్....చూడ్డానికి మగాడిలా కనబడుతున్నారు. ఆడపిల్ల పేరు చెబుతారేమిటి?” అన్నాడు శర్మ ఆశ్చర్యపడుతున్నట్లు.

“నేను మగాణ్ణే—నా పేరు శ్యామల...” అతడు వాక్యం పూర్తిచేయలేక మళ్ళీ అక్కడే ఆగిపోయాడు.

"అయితే మీరు రచయితలయుండాలి. అది మీ కలం పేరా...."

అతడు చిరాగ్గా వారిద్దరి వంకా చూశాడు. మాటి మాటికీ కళ్ళు మూస్తున్నాడు తెరుస్తున్నాడు. సరిగ్గా మాట్లాడలేకపోతున్నాడు.

"కలం పేరు కాదు. నా పేరు శ్యామల...." మళ్ళీ వాక్యం ఆగిపోయింది.

"ఏమిటి సార్ — మీ పేరు శ్యామలంటారు?"

"నా పేరు శ్యామల కాదు....శ్యామల...." అతడా వాక్యం పూర్తిచేయలేక పోతున్నాడు.

"సరే—నీ పేరు చెప్పటం నీవల్ల కాదు కానీ— నాతో వస్తే డబ్బు దొరికే మార్గం చెబుతాను...." అన్నాడు శాస్త్రి.

"డబ్బా—" అని అతడు నవ్వి — "డబ్బు సంపాదించే మార్గాలు నాకే తెలుసు సవాలక్ష. ఈ శ్యామల" అన్నాడు. పేరు దగ్గరకొచ్చేసరికి తర్వాతి అక్షరాలతడి స్ఫురణకు రావటంలేదు.

"ఒకటి కాదు. రెండు కాదు. లక్షరూపాయలు. ఒక్కసారిగా లక్షరూపాయలు. ఈ రాత్రికే లక్ష రూపాయలు నీ స్వంతమయ్యే మార్గం చెబుతాను...."

అతడి మత్తు చాలావరకూ విడిపోయింది. అతడు మిత్రులిద్దరినీ అనుసరించాడు. ముగ్గురూ ఓ పార్కులో కూర్చున్నారు.

"ఇక్కడ వెల్తురు బాగా వుంది—" అన్నాడు శ్యామలరావు.

"బార్లో చాలా చీకటిగా వుంది కదూ—" అన్నాడు శాస్త్రి.

"నిన్ను చీకట్లోంచి వెలుగులోకి తీసుకురావటం మా ఉద్దేశ్యం—" అన్నాడు శర్మ.

"వెలుగు డబ్బు సంపాదించడానికి. చీకటి ఖర్చు పెట్టడానికి.... చెప్పండి. తొందరగా చెప్పండి. లక్ష రూపాయలెలా వస్తాయి నాకు?"

"ముందు నీ పేరు చెప్పు ..." అన్నాడు శాస్త్రి.

"నా పేరు శ్యామలరావు...." అని — "అరే— వెలుగ్లోకి రాగానే నా పేరు గుర్తొచ్చేసింది...." అన్నాడు శ్యామలరావు సంతోషంగా.

"సగం పేరు నీ కెప్పుడూ గుర్తుంది. మిగతా సగమే మర్చిపోయావు. నీ పేరులో సగమంటే తెలుసా? అర్ధాంగం....నువ్వు నీ అర్ధాంగిని మర్చిపోయావు. ఆమెను నువ్వు మర్చిపోకూడదు. తెలిసిందా?" అన్నాడు శర్మ.

"ఈ ఉపన్యాసం దేనికి? ఇలాంటివి ప్రతి హిట్ తెలుగు సినిమాలోనూ వుంటూనే వుంటాయి. ముందు లక్షరూపాయల సంగతి మాట్లాడండి.." అన్నాడు శ్యామలరావు.

"నువ్వు నీ భార్యతో మర్యాదగా కాపురంచేయాలి. ఆమె సంపాదనలో జల్సాచేయటంకాక-నీ సంపాదనతో ఆమెను సుఖపెట్టాలి. ఇది నా ఆజ్ఞ ...." అన్నాడు శర్మ.

"నువ్వెవ్వడివి నన్నాజ్ఞాపించడానికి...."

"నీకు తెలుసో తెలియదో....నీ శరీరం లక్షరూపాయల విలువచేసుంది. తాగుడుతో దాన్ని చంపేస్తున్నావు. నువ్వు తాగుడు మానేస్తే నీకు నేను మంచి ఉద్యోగం ఇప్పిస్తాను. ఆ ఉద్యోగం చేసుకుంటూ హాయిగా నీ భార్యతో...."

శాస్త్రి ఏదో చెబుతూండగా శ్యామలరావు లేచి—

"నా సమయమంతా వృధా చేస్తున్నారు. లక్షరూపాయ లొచ్చేమార్గం చెబుతారేమోననుకుని ఇక్కడికి వచ్చాను" అంటూ ఆక్కణ్నించి కదిలాడు.

అప్పుడు మొదలైంది శాస్త్రి, శర్మల ఆట.

"గురూ-ఫుట్ బాలా, టెన్నిసా, షటిలా, క్రికెట్టా?" అన్నాడు శర్మ.

"అన్నీ ఆడదాం—" అంటూ శాస్త్రి శ్యామలరావు చేయి పట్టుకున్నాడు.

"నేనెందుకు?" అన్నాడు శ్యామలరావు.

"మేమేమాట ఆడినా నువ్వే మా బంతివి...." అన్నాడు శాస్త్రి.

ఆ తర్వాత పావు గంటలో శ్యామలరావు వళ్ళు హూనమైపోయింది.

"మీరు చెప్పినట్లు వింటాను...." అంటూ అతడు వేడుకున్నాడు.

"అయితే అర్జంటుగా ఇంటికి వెళ్ళు. నీ భార్య కాళ్లు పట్టుకో. జరిగిందానికి తప్పయిపోయిందను. నీ బుద్ధి మార్చుకో...."

శ్యామలరావు దీనంగా—"నాదొక్కమాట!" అన్నాడు.

"చెప్పు...."

"నేను బుద్ధిగా బ్రతకడానికి సిద్ధమే! కానీ ప్రస్తుతం నా భార్యగా వుంటున్న ఆడది చెడిపోయింది. నేనూ అల్లరిచిల్లరిగా వుంటున్నాను కాబట్టి దాన్ని సహించాను. కానీ బుద్ధిగా వున్నప్పుడు నా కెందుకు? ఇంకో పిల్లను చూసి పెళ్ళిచేసుకుంటాను...."

"గురూ-ఇందాకా వాలీబాలు ఆడలేదు...." అంటూ

శర్మ శ్యామలరావును పైకెత్తాడు.

“బాస్కెట్ బాలయితే ఇంకా బాగుంటుందేమో!” అన్నాడు శాస్త్రి.

“మరి వీడు తూలడుగదా....” అన్నాడు శర్మ.

“దానికేముంది — మనమే మళ్ళీ లేవదీసి కూలేస్తూ వుండొచ్చు....”

శ్యామలరావు కంగారుగా — “మీరాటల గురించి ఆలోచించవద్దు. మీరేం చెబితే అది చేస్తాను....” అన్నాడు.

“ఇప్పుడు నువ్వు బుద్ధిగా వుంటావు. నీ భార్య కూడా బుద్ధిగా వుంటుంది. ఇద్దరూ బుద్ధిగా కాపురం చేసుకోండి....ఇంక నువ్వు వెళ్ళొచ్చు....”

శాస్త్రి ఇలా అనగానే శ్యామలరావులోకి ఒక్కసారిగా అంత శక్తి ఎలా వచ్చిందో ఏమో-ఎక్కుపెట్టిన బాణంలా క్షణంలో అక్కణ్ణించి మాయమయ్యాడు.

“గురూ—మారతాడంటావా?” అన్నాడు శాస్త్రి.

“చూద్దాం—” అన్నాడు శర్మ.

## 7

మర్నాడు వారు నీరజ ఇంటికి వెళ్ళేసరికి ఆమె ఇంట్లో నీరసంగా పడి వున్నది.

“ఏమయింది?” అన్నాడు శర్మ.

“నా భర్త వచ్చాడు—తెల్లవారుఝామున....”

“క్షమించమని అడిగాడా?” అన్నాడు శాస్త్రి కుతూహలంగా.

“లేదు—” అన్నదామె నీరసంగా.

నీరజ తనమీదకు రౌడీలను ఉసిగొల్పిందని శ్యామలరావు అభిప్రాయపడ్డాడు. శాస్త్రి, శర్మలమీద కలిగిన

కోపమంతా అతడు భార్యమీద చూపించాడు. ఇప్పుడు ఫుట్ బాల్, ఇప్పుడు క్రికెట్, ఇప్పుడు వాలీబాల్ అంటూ ఆమెను నానా హింసలూ పెట్టాడు.

ఫుట్ బాల్ అంటే కాలితో తన్నడం, క్రికెట్ అంటే కర్రతో కొట్టడం....

"గురూ — వాడిని మనం ఆడదాన్ని హింసించేలా తయారుచేశాం—" అన్నాడు శర్మ బాధగా.

"అసలు—మీ రాయన జోలికెందుకు వెళ్ళారు?"

"నిర్మల కోరికమీద...." అన్నాడు శాస్త్రి. అతను క్లుప్తంగా నిర్మల గురించి చెప్పి — "ఆమెలో చాలా మార్పు వచ్చింది. ఎలా?" అన్నాడు.

"అది మాత్రం చెప్పను...." అంది నీరజ.

"నువ్వు నిర్మలను ఏదో చేశావు...." అన్నాడు శర్మ.

"నేనేమి చేసినా ఆమెలో మార్పు తీసుకురాగలిగాను. మీరు నా భర్తలో మార్పు తీసుకుని రాలేక పోతున్నారు" అంది నీరజ.

"కొందరికి పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో కానీ పోదు...." అన్నాడు శాస్త్రి.

"ఆడలేక మద్దెల ఓడన్నాడుట—వెనకటికి ఒకడు" అంది నీరజ.

"మనం సామెతలు మాట్లాడుకోవద్దు...." అన్నాడు శాస్త్రి అర్థింపుగా—"ముందు నీ మనసులోని కోరిక చెప్పు—"

నీరజ స్పష్టంగా చెప్పింది. తన భర్త జీవించివుండాలి. దుర్వ్యసనాలు వదిలిపెట్టాలి.

"నిన్నింతలా చావదన్నాడు. అయినా నీకు వాడి మీద కోపంలేదా?" అన్నాడు శర్మ.

"ఆమె భారతనారి. ఆ విషయం మర్చిపోకు—"
అన్నాడు శాస్త్రి.

"భారతనారి అనగానే నాకు హిట్ తెలుగు సినిమా గుర్తుకు వచ్చింది ..."

"నాకూ గుర్తుకొస్తోంది ..."

మిత్రులిద్దరూ కళ్ళు కలుపుకున్నారు. వాళ్ళకు కళ్ళతో మాట్లాడుకోవటం వచ్చు. ఇద్దరూ ఒకరి భావాన్నొకరు బాగా అర్థంచేసుకున్నారు.

అప్పుడు శర్మ — "నీకు నీ భర్త ఇంట్లో వుంటే చాలా? అతణ్ని నువ్వే పోషిస్తావా?" అన్నాడు.

"ఊఁ" అంది నీరజ — "కానీ నాకప్పుడుద్యోగం కావాలి...." అని—"ఉద్యోగం నిర్మల ఇప్పిస్తుంది. నాకా ధైర్యముంది...." అంది మళ్ళీ.

"సరే—అయితే—నువ్విప్పుడు పరమ పతివ్రతా శిరోమణుల జాబితాలోకి చేరబోతున్నావు. సిద్ధంగా ఉండు" అన్నాడు శాస్త్రి.

"ఏం చేయబోతున్నారు మీరు?" అంది నీరజ ఆశ్చర్యంగా.

"నీ భర్త మళ్ళీ ఎన్నడూ నిన్ను తన్నని విధంగా బుద్ధి చెబుతాము. అసలా పని నిన్ననే చేయవలసింది.." అన్నాడు శర్మ.

# 8

మిత్రులిద్దరూ మరోసారి ఇంటికి వెళ్ళి తమవద్దనున్న పుస్తకం పదిసార్లు చూశారు.

"ఇదేదో ముని శాపం వ్యవహారంలా వున్నది...." అన్నాడు శర్మ.

"ఇంతవరకూ ఎవరిమీదా ఈ ట్రిక్కు వేయలేదు

మనం...."

"వికటి సుందని భయంగా వుందా?" అన్నాడు శర్మ.

"లేదు. కానీ అమానుష మేమో ననిపిస్తోంది...."

"మరి శ్యామలరావు ప్రస్తుతానికి మనిషి కాదుగా."

శాస్త్రి నీరసంగా పడివున్న నీరజను గురుచేసు కున్నాడు. భార్యను వ్యభిచారానికి ప్రోత్సహిస్తూ ఆ భార్యనే కొట్టే ప్రబుద్ధుడు మనిషి అనిపించుకుంటాడా? తను బుద్ధిగా మసులుకోవలసివస్తే మరో స్త్రీని కట్టుకోవాలనే స్వార్థపరుడికి మనిషి అనిపించుకునే అర్హత ఉంటుందా?

ఇద్దరూ ఇల్లు వదిలి శ్యామలరావు కోసం వేట ప్రారంభించారు. ఓ బార్లో అతడు వారికి కనిపించాడు. కానీ వీరిని చూసి దరిదాపులకు కూడా రానివ్వలేదు.

"వీణ్ణెలా పట్టాలి?" అన్నాడు శర్మ.

"మరి కాస్త తాగేక ఎత్తుకుని తీసుకునిపోవడమే!" అన్నాడు శాస్త్రి.

"వద్దు. నిర్మల సాయం కోరుదాం-" అన్నాడు శర్మ.

నిర్మల ఈ వ్యవహారంలో తమకు సాయపడుతుందా? సాయపడక ఏం చేస్తుంది? ఏ కారణంవల్లనో ఆమె నీరజకు భయపడుతున్నది.

శర్మ నిర్మలకు ఫోన్ చేసి శ్యామలరావు బార్లోంచి బైటకు రావటంలేదనీ—అతణ్ని ఎలాగో అలా నీరజ ఇంటికి చేర్చితే తను క్షణాలమీద అతడిని మార్చబోతున్నాననీ కావాలనుకుంటే ఆ దృశ్యాన్ని తను కూడా స్వయంగా చూడవచ్చుననీ చెప్పాడు.

"సరిగ్గా మరో గంటలో శ్యామలరావు తన ఇంట్లో

వుంటాడు. అక్కడికి నేను కూడా వస్తాను...." అన్నది నిర్మల.

"గురూ-మనం వేషాలు మార్చాలి. అప్పుడే నాటకం రక్తి కడుతుంది—" అన్నాడు శాస్త్రి.

"సరే—అలాగే!" అన్నాడు శర్మ.

# 9

నిర్మల పంపిన మనిషి శ్యామలరావును యింటికి పిల్చుకుని వెళ్ళాడు. అతడు వెళ్ళేసరికి అక్కడ నిర్మల వున్నది.

"నమస్కారమండి!" అన్నాడతడు.

"నువ్వు అన్ని సమయాల్లోనూ బార్లో నే వుంటావా?" అంది నిర్మల.

"లేదండి—ఇప్పుడే బారుకు వెళ్ళాను...." అన్నాడు శ్యామలరావు.

"నీరజ నా స్నేహితురాలు. నీ ప్రవర్తనకు అది చాలా బాధపడుతోంది. నువ్వు చాలా మారాలి—" అంది నిర్మల.

"బారుకు చాలామంది వెళతారండి. నేనూ అంతే! ఎటొచ్చీ నీరజ ప్రవర్తన సరైనదికాక నేనాట్టే యింటి పట్టున వుండను—" అన్నాడు శ్యామలరావు.

"ఛీ....అసత్య ప్రలాపీ!" అంటూ పక్క గదిలోంచి సాధువు వేషంలోని శర్మ గడ్డం నిమురుకుంటూ అక్కడ ప్రవేశించాడు.

"వీడెవడు?" అన్నాడు శ్యామలరావు చిరాగ్గా.

"సాధుపుంగవులను వాడు, వీడు అనరాదు—పాపం చుట్టుకుంటుంది—" అంటూ శర్మ వెనుకనే శాస్త్రి ప్రవేశించాడు.

"ఎవరు మీరు — ఏమిటిదంతా?" శ్యామలరావు మరింత చిరాకుపడ్డాడు.

"సాధుపుంగవులం. ఈ ఇంట్లో ఓ మహా పతివ్రతా శిరోమణి వుంటే ఆశీర్వదించి పోదామని వచ్చాం—" అన్నాడు శాస్త్రి.

"ఎవరా పతివ్రత?" అన్నాడు శ్యామలరావు.

"ఇంకెవరు—నీ భార్య!" అన్నాడు శర్మ.

పెద్ద జోకు విన్నట్లు శ్యామలరావు నవ్వసాగాడు— "డబ్బుకోసం రోజుకో మగాడితో వుండే నా భార్యలో మీకు పతివ్రత కనబడిందా?"

"మరి ఆమె సంపాదించిన డబ్బు నువ్వేం చేస్తున్నావ్?"

"భర్త కోరికమీద వ్యభిచారం చేసినా పాతివ్రత్యమే అనిపించుకుంటుంది. నిన్ను చూస్తే నువ్వెక్కడా పురాణాలు చదివిన వాడివిలా కనిపించటంలేదు. రేపట్నించి నేనే స్వయంగా నీ పక్కన కూర్చుని పురాణ పఠనం చేస్తాను...." అన్నాడు శర్మ.

"నేనింట్లో ఉండను...." అన్నాడు.

"ఇకమీదట నువ్వు రోజూ ఇంటిపట్టునే వుంటావు. ఇది సాధుపుంగవుల ఆజ్ఞ—...." అన్నాడు శాస్త్రి.

"నువ్వెవడివి—నన్నాజ్ఞాపించడానికి?...." అన్నాడు శ్యామలరావు.

"నన్నిలా అడిగినందుకు మన్నించమని పాదాలు పట్టుకో—లేదా శపించగలను...." అన్నాడు శాస్త్రి.

"ఆయనకు కోపంవస్తే అన్నంతపనీ చేస్తాడు. వెంటనే పాదాలు పట్టుకో—" అన్నాడు శర్మ.

"ముందు మీకు దేహశుద్ధి అవసరం...." అంటూ

కోపంగా చేయి పైకెత్తాడు శ్యామలరావు.

"నామీదకే చేయెత్తుతావా? ఆ చేయి పడిపోవు గాక...." అన్నాడు శాస్త్రి.

సరిగ్గా అప్పుడే శర్మ శ్యామలరావు వెనుక చేరి మెడ పక్క ఏదో నరాన్ని ఒకసారి నొక్కి వదిలాడు.

ఉన్నట్లుండి శ్యామలరావు పెద్ద కేక పెట్టి క్రిందపడి పోయాడు.

అప్పుడక్కడికి పరుగున వచ్చింది నీరజ. నిర్మల దూరా న్నుంచే జరుగుతున్నదంతా చూస్తోంది.

శ్యామలరావుకు ఒక చేయి, కాలు సరిగ్గా పని చేయటంలేదు. అతడు స్పృహతోనే వున్నాడు కానీ మాట్లాడలేక పోతున్నాడు.

"ఆయన్నేం చేశారు?" అంది నీరజ.

"నేను శపించాను—" అన్నాడు శాస్త్రి.

"ఇది శాపమా, పక్షవాతమా?" అంది నీరజ.

"పక్షవాతం కాదు. శాపమే!" అన్నాడు శాస్త్రి.

"అయితే పరిహారం చెప్పండి స్వామీ-మీ పాదాలు పట్టుకుంటాను—" అంటూ శాస్త్రి పాదాలమీద వాలి పోయింది నీరజ.

"వాడు మూర్ఖుడు. క్రూరుడు. వాడికీశాస్తి కావల సిందే—" అన్నాడు శాస్త్రి.

"అలాగనకండి స్వామీ—మీరెన్ని అన్నా ఆయన నా భర్త. ఆయన్ని తిరిగి మామూలు మనిషిని చేయండి" అంది నీరజ.

శర్మ కూడా నీరజ తరఫున శాస్త్రిని వేడుకున్నాడు.

"అయితే నెలరోజులపాటు నియమనిష్ఠలతో నీ పతికి సేవలు చేసుకో. ఇద్దరూ పరస్పరానురాగవర్తులై మీ

పాత జీవితాలు మరిచిపోయి ఒక మాసం రోజులు వుండ గలిగితే—నీ పతి మళ్ళీ మామూలు మనిషవుతాడు—" అన్నాడు శాస్త్రి.

"నిజమా స్వామీ!" అంది నీరజ.

"సాధుపుంగవులెన్నడూ అసత్యం పలుకరు—" అన్నాడు శాస్త్రి.

"స్వామీ — నేను గత జీవితం మర్చిపోవడానికి సిద్ధమే! అయితే నెలరోజులపాటు నియమనిష్టలతో నా పతిని సేవించుకోమన్నారు. ఇల్లెలా గడుస్తుంది?" అంది నీరజ.

"నీ ఖర్చులన్నీ నేను భరిస్తాను. ఆ తర్వాత నీ భర్తకు మంచి ఉద్యోగం వచ్చేలా చూస్తాను...." అంది నిర్మల.

శ్యామలరావు జరుగుతున్నదంతా విన్నాడు. కానీ అసహాయుడై చూస్తున్నాడు.

నిర్మల అక్కణ్ణించి వెళ్ళిపోతూ శాస్త్రినీ, శర్మనూ పిలిచింది. వీధి గుమ్మంలో ఆమె వాళ్ళిద్దరికీ ఒక చెక్కు ఇచ్చింది. శాస్త్రి చూశాడు. అది మార్చుకుంటే పదివేల రూపాయలు.

"ఈ చెక్కు మారుతుందా?" అన్నాడు శాస్త్రి.

"స్వయంగా మీ మహిమను చూశాను. మిమ్మల్ని మోసం చేస్తానా?" అంది నిర్మల భయంగా. ఎంతో సామాన్యంగా మాట్లాడుతూ, సాధారణంగా కనిపించే ఈ యువకుల శక్తియుక్తులు అసాధారణం, అసామాన్యం అని ఆమె గ్రహించింది.

నిర్మల వెళ్ళిపోయాక మిత్రులిద్దరూ లోపలకు వెళ్ళారు.

"నీకు ఒక్క పదినిముషాలసేపు పూజా విధానం నేర్పుతాను. ఆ ప్రకారం చేస్తే ఆయన నెలరోజుల్లో

మామూలు మనిషి అవుతాడు—" అన్నాడు శాస్త్రి.

శ్యామలరావు నిస్సహాయంగా చూస్తూండగా పక్క గదిలోకి వెళ్ళారు.

"చూస్తూండగా నా భర్తకు పక్షపాత మెలా వచ్చింది?" అంది నీరజ ఆశ్చర్యంగా.

"అదే మేము నేర్చుకున్న అనేక విద్యల్లో ఒకటి. నాడీమండలాన్నంతా క్షుణ్ణంగా పరిశీలించిన ఓ మహా జ్ఞాని వ్రాసిన అపూర్వ గ్రంథం సాయంతో ఈ పని చేయగలిగాము. మాకో చిన్న సందేహం తీర్చినావంటే తిరిగి నీ భర్త మామూలు మనిషయ్యే ఉపాయం చెప్ప గలము...." అన్నాడు శాస్త్రి.

"మీకు సందేహం తీర్చగల పాటిదానినా?" అంది నీరజ.

"నువ్వు నిర్మల నెలా వశపర్చుకున్నావో మాకు తెలియడంలేదు...." అన్నాడు శర్మ.

"ఓస్ అదా?" అంది నీరజ.

"నా వద్ద ఒక పాత రివాల్వరుంది. అది హత్యచేయడానికి పనికిరాదు. కానీ మనుషుల్ని బెదిరించడానికి పనికొస్తుంది. నిర్మలను దాంతో బెదిరించాను...."

"బెదిరించి... ?" అన్నాడు శర్మ.

"నగ్నంగా ఫోటోలు తీశాను. నేనెలా నిలబడమంటే అలాగ—నేనెలా చెబితే అలాగ.... మొత్తం ఒక రీలు తీశాను. నా భర్తకు ఫొటోగ్రఫీ హాబీ వుండేది. ఇంట్లో డెవలపింగుకీ ప్రింటింగుకీ అవకాశాలున్నాయి. ప్రింట్లు తీసి నిర్మలకు చూపించాను.

రాత్రికి ఆమెను వేరే గదిలో ఉంచాను. ఆ పక్క గది నా పడకగది. ఆ రాత్రి నాకు మామూలుగా ఓ

ప్రియుడొచ్చాడు. వాడికీ ఫోటోలు చూపించి ఎవరివో చెప్పాను. వాడి అభిప్రాయం అడిగాను. ఇంకా ఎలాంటి ఫోటోలు తీయిస్తే బాగుంటుందో అడిగాను. మా మొత్తం సంభాషణ అంతా నిర్మల విన్నది.

మర్నాడుదయం నిర్మలకు రాత్రి ప్రియుడు సూచించిన విధంగా మరికొన్ని ఫోటోలు తీశాను. నీ కారణంగా నేను వ్యభిచారిణినయ్యాను. నా వద్దకు వచ్చిన ప్రియులందరూ నీ చిరునామాను, నీ నగ్న రూపాలను చూస్తూ ఉంటారు—అని నిర్మలకు చెప్పాను.

ఫోటోలను ఆమె ఊహించలేని చిరునామాకు పోస్టు చేశాననీ నాకే ప్రమాదం కలిగినా అవి విరివిగా ఊరంతా పంచిపెట్టబడతాయనీ చెప్పాను. ఆమె నా దోలికి రానంతకాలం ఆ ఫోటోలను కేవలం విటులకు మాత్రం చూపిస్తాననీ-పొరపాటున కూడా ఎవరికీ ఇవ్వననీ హామీ ఇచ్చాను. నాకీ వ్యభిచార జీవితంనుంచి విముక్తి కలిగి గౌరవ జీవితం లభిస్తే తప్ప ఆ ఫోటోలు ప్రతి రాత్రీ కొత్త వ్యక్తులు చూస్తూంటారని అన్నాను.

నిర్మల వెంటనే నా జీవితం మార్చాలనుకుంది. ఎందుకనుకుందో మీరే ఊహించగలరు. ఆ ఫోటోల్లో విధంగా ఇతరుల కళ్ళబడాలని ఏ ఆడదీ అనుకోదు. కనీసం తన ఫోటోలు అలా చూడబడటం కూడా ఏ భారతనారీ సహించలేదు. అందులోనూ నిర్మల సంగతి నేను బాగా అర్థంచేసుకున్నాను...."

"ఆ ఫోటోలేమయ్యాయి?"

"ఏమైనా—మీకు మాత్రం చూపించను...." అంది నీరజ.

"పాపము శమించుగాక — నువ్వు చూపుతానన్నా

అలాంటి ఫోటోలు మేము చూడం" అన్నాడు శాస్త్రి.

"మరి నా భర్త మామూలు మనిషయ్యే ఉపాయం చెప్పండి...."

"అతడిలో దానంతటదే మార్పు వస్తుంది. రోజు రోజుకూ కొంచెం కొంచెం పరిస్థితి మెరుగుపడి—నెల రోజులయ్యేసరికి పూర్తిగా మామూలు మనిషవుతాడు. అయితే నువ్వు మాత్రం నీ నియమనిష్ఠలవల్లే అతడిలో మార్పు వచ్చినట్లు భ్రమను కలిగించాలి. ఎప్పుడైనా అతడికి చిత్త చాంచల్యం కలిగిందా — తిరిగి అతణ్ని సబుణ్ని చేయగల శక్తి మాకుంది-" అన్నాడు శాస్త్రి.

"ఆ ఉపాయమేదో నాకూ చెప్పకూడదా?" అంది నీరజ.

"దీనికి చాలా పెర్ఫెక్షన్ కావాలి. ఈ ప్రయోగం మా శర్మ చేయగలిగినట్లు నేను కూడా చేయలేను. పట్టు సరిగ్గా లేకపోతే మనిషి ప్రాణాలు పోవచ్చు—" అన్నాడు శాస్త్రి.

# 10

శాస్త్రి, శర్మ ఇద్దరూ బజార్లో ఏదో బొమ్మను బేరం చేస్తున్నారు. వాళ్ళ పక్కింటి పాప పుట్టిన రోజు బహుమతిగా ఇవ్వాలని వారి అభిప్రాయం. బొమ్మ వారికి నచ్చింది. వాడు పదెనిమిది రూపాయలు చెప్పాడు.

శర్మ నూరు రూపాయలనోటు చూపించాడు. వాడు చిల్లర లేదన్నాడు.

అది చాలా చిన్న కొట్టు.

శర్మ షాపులోంచి బయటకు వచ్చాడు—చిల్లర ఎవరిస్తారా అని చూస్తూ. ఆ సమయంలో అతడికి రిక్షావాలా కనిపించాడు.

శర్మ చటుక్కున అతడిని సమీపించి—"అరే—

"నువ్వటోయ్—" అన్నాడు.

రిక్షా వాలా అతడిని గుర్తుపట్టి—నీరసంగా—"ఎక్కడికి బాబూ!" అన్నాడు.

"ఏం లేదోయ్-వంద రూపాయల చిల్లర కావాలి-" అన్నాడు శర్మ.

"అమ్మో — ఆ రోజులు పోయాయి బాబూ—ఏ ముహూర్తాన మీకు రిక్షా కట్టానో కానీ ఆ తర్వాతనుంచి నా బేరాలు తగ్గిపోయాయి...." అన్నాడు వాడు నీరసంగా.

"ఏం జరిగింది?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"నా బేరాలన్నీ ఫామిలీ లేడీస్ తోటే—నీరజమ్మ కథ అందరికీ తెలిసిపోయింది. అందరి మొగుళ్ళూ మారి పోయారు. నాకు తెలిసిన ఫామిలీ లేడీసంతా నిజంగా ఫామిలీ లేడీస్సై పోయారు బాబూ—" అన్నాడు వాడు బాధగా.

శర్మ వాడి మాటలు విని ఉత్సాహంగా షాపులోకి పరుగెత్తాడు.

"చిల్లర దొరికిందా?" అన్నాడు శాస్త్రి.

"లేదు గురూ....కానీ మనకో మంచి వృత్తి దొరికి నట్లనిపించింది. ఇచ్చట భర్తలు బాగుచేయబడుదురు— అని ఓ బల్లకట్టి వ్యాపారం ప్రారంభిస్తే ఎలాగుంటుందీ అని చూస్తున్నాను. అప్పుడు చాలామంది ఫామిలీ లేడీసు మనవల్ల సుఖపడతారు—...." అన్నాడు శర్మ.

"ఆ మాటలకు శాస్త్రి పగలబడి నవ్వాడు.

—:అ యి పో యిం ది:—

# దారి దోపిడీ

## వాణిశ్రీ

ఆర్. టి. సి. నైట్ ఎక్స్‌ప్రెస్ ఇంకొక గంటలో హైదరాబాద్ సిటీ చేరబోతూ వుంది. బస్సు డ్రైవర్ రోడ్డు ప్రక్కన వున్న పెద్ద చింతమానుకింద ఆపాడు. చెట్టుకి ఆనుకునే ఒక పాక. ఆ పాకలో చిన్న టీస్టాల్. బస్సు ఆగడం చూసి టీ స్టాల్లో వున్న కుర్రాడు బొగ్గుల కుంపటి విసర సాగాడు.

"టీ కావాల్సినోళ్ళు దిగండి సార్" అంటూ డ్రైవర్ అనౌన్స్‌మెంట్ చేసి బస్సు దిగిపోయాడు.

ఆ తర్వాత కండక్టర్ దిగాడు. అతని వెనుక మరి కొందరు ప్రయాణీకులు బద్ధకంగా కళ్ళు తెరిచి వళ్ళు విరుస్తూ, ఆవులిస్తూ బస్సు దిగి టీ స్టాల్ దగ్గర చేరారు. కుర్రాడు వేడి వేడి టీ గ్లాసులు అందిస్తున్నాడు.

ఇంతలో మెటాడర్ వ్యాన్ వచ్చి అక్కడ ఆగింది. అందులో నలుగురు వున్నారు. వ్యాన్ నిండా పేపర్ కట్టలు వున్నాయి.

డ్రైవర్ వ్యాన్ దిగివచ్చి "కండక్టర్ సాబ్! మేం సిటీనుంచి వస్తుంటే ఇక్కడికి దగ్గర్లోనే అంబాసిడర్ కార్లో మర్డర్స్ జరిగాయి" అన్నాడు.

కండక్టర్‌తోపాటు అక్కడున్న వాళ్ళంతా వులిక్కి పడ్డారు.

"ఏమిటీ?" అన్నాడు కండక్టర్ నమ్మలేనట్లు.

"ఇక్కడికి రెండు మూడు ఫర్లాంగుల దూరంలో అంబాసిడర్ ఆగివుంటుంది చూడండి. అందులో రెండు శవాలు వున్నాయి. మీరు సిటీ వెళ్తారుగదా! పోలీసులకు చెప్పండి" అన్నాడు వ్యాన్ డ్రైవర్.

"మర్డరు జరగటం మీరు చూశారా?"

"వుహూఁ....మర్డరు ఎప్పుడు జరిగాయో? తెలీదు. కారు డోర్లు బార్లా తీసివుంటే మాకు అనుమానం వచ్చి మా వ్యాన్ ఆపి చూశాం. అందులో రెండు శవాలు కన్పించాయి" చెప్పాడు వ్యాన్ డ్రైవర్.

ప్రయాణీకులు వ్యాన్ డ్రైవర్ చుట్టుముట్టి అతను చూసిన కారులో శవాల గురించి పదేపదే అడిగి తెలుసుకున్నారు. వ్యాన్ డ్రైవర్, అందులో వున్నవాళ్ళు టీ తాగి వెళ్ళిపోయారు.

ఆర్టీసీ బస్ డ్రైవర్ హారన్ కొట్టాడు. అంతా బస్సులో ఎక్కి కూర్చుని కార్లో శవాల గురించి చెప్పుకోసాగారు. బస్ కదిలిన కాసేపటికే మళ్ళీ ఆగింది. బస్ హెడ్‌లైట్ల కాంతిలో నీలం రంగు అంబాసిడర్ కారు రోడ్డుకి పక్కగా జరిగివుంది. దాని డోర్లు తీసేవున్నాయి.

"గురూ హెడ్ లైట్లు ఆపకు" అంటూ కండక్టర్ బస్సు దిగాడు. అతని వెనుకే కొందరు ప్రయాణీకులు దిగి కారు దగ్గరికి వెళ్ళారు. శవాల్ని చూడటం ఇష్టంలేని

వాళ్ళు, శవం పేరు చెప్తేనే భయపడే రకం మాత్రం బస్సులోనే కూర్చుండిపోయారు.

వెనుక సీట్లో లావుపాటి వ్యక్తి వెల్లకిలా పడి వున్నాడు. గుండెలో కత్తి దిగి వుంది. నెత్తురుతో బట్టలు తడిసిపోయి వున్నాయి. అతనికి ఏ ఖై ఏళ్ళు పైనే వుండొచ్చు. గ్లాస్కోపంచె సిల్కు లాల్చీలో వున్నాడు.

ముందు సీట్లో ఒక ప్రక్కకి ఒరిగిపోయి వున్న వ్యక్తి కుర్రాడే. పాతిక ముప్పై ఏళ్ళ మధ్య వుంటుంది వయస్సు. తలమీద కొట్టిన గాయం కనిపిస్తోంది. రక్తం ముఖం మీదుగా కారింది.

"అరె....ఇతను బ్రతికే వున్నాడు" టార్చిలైట్ ఫోకస్ చేసిన వ్యక్తి అన్నాడు.

ఎవరో చెయ్యిపట్టుకుని పల్స్ చూశారు.

"అవును ప్రాణం వుంది" అన్నాడు.

"బస్సులో తీసికెళ్ళి హాస్పిటల్లో జేర్స్తే మంచిది. పాపం బ్రతుకుతాడేమో?" అన్నారు కొందరు ప్రయాణీకులు.

"ఈయనెవరో శేట్‌లా వున్నాడు. ఎందుకు హత్య చేశారో పాపం?"

"ఇది బొంబాయి రోడ్డు. స్మగ్లింగ్ కేసేమో?"

"పాపం పుణ్యా దేవుడికే తెలియాలి."

ప్రయాణీకులు రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు.

కండక్టర్ కొందరు సాయంతో డ్రైవింగ్ సీటులో పడివున్న వ్యక్తిని బస్సులోకి జేర్చాడు. అంబాసిడర్ తలుపులు మూసి నెంబర్ నోటు చేసుకున్నాడు.

బస్సు సిటీవైపు బయల్దేరింది.

# 2

అతను నీరసంగా మూలిగి నెమ్మదిగా కళ్లు తెరిచాడు. ముక్కులకు ఘాటుగా ఫినాయిల్ వాసన, మందుల వాసన తగిలింది.

హాస్పిటల్ వార్డులో స్వీపర్ ఫినాయిల్ చల్లి గుడ్డతో తుడుస్తున్నాడు. అతని పక్కనే స్టాండ్‌కి ఖాళీ గ్లూకోజ్ బాటిల్ వ్రేలాడుతూ వుంది. వార్డు మధ్యలో టేబిల్ ముందు కూర్చుని వుంది స్టాఫ్ నర్స్.

బెడ్‌లమీదున్న వాళ్ళందరికీ కాలికో, చేతులకో, తలకో కట్లుకట్టి వున్నాయి. తను సర్జికల్ వార్డులో వున్నాడని అతడు గ్రహించాడు.

"సిస్టర్ ....సిస్టర్" నెమ్మదిగా పిలిచాడు.

నర్స్ అతని బెడ్ దగ్గరికి వచ్చింది.

"మంచినీళ్ళు కావాలి" అన్నాడు.

ఆమె అతన్ని లేపి కూర్చోబెట్టి మంచినీళ్ళు త్రాగించింది.

"సిస్టర్, నేను ఇక్కడెందుకు వున్నాను?" ప్రశ్నించాడు.

"మీరు వస్తున్న కారుకి యాక్సిడెంట్ జరిగిందనుకుంటాను. ఆర్టీసీ బస్‌లో వస్తున్నవాళ్ళు చూసి మిమ్మల్ని తీసుకొచ్చి అడ్మిట్ చేశారు" అంది ఆమె.

"అలాగా!" అని అతను కళ్ళు మూసుకున్నాడు.

కొంచెంసేపటికి ఇన్‌స్పెక్టర్ అజీజ్, డ్యూటీ డాక్టర్ కలిసి వచ్చారు.

"మిస్టర్ ....! మిస్టర్ ...."

అతను కళ్ళు తెరిచాడు. కళ్ళు తిప్పి తన బెడ్ ముందు నిల్చున్న డాక్టర్ని, సిస్టర్ని చూశాడు.

"మీ పేరేమిటి?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"మదన్‌రాజ్."

"మీరు కారులో సిటీకి వస్తున్నారు కదూ!"

అతను తల వూపాడు.

"ఎక్కడ్నుంచి వస్తున్నారు?"

"బొంబేనుంచి."

"కారు మీరే డ్రైవ్ చేస్తున్నారు కదూ!"

"అవును."

"మీరు డ్రైవరా?"

"వుహూ!"

"మరి?"

"హిమాలయా ఇంటర్నేషనల్ హోటల్ మేనేజర్ని."

"వెనుక సీట్లో వున్న ఆయన ఎవరు?"

"సార్! ఆయనకి ఏమైనా దెబ్బలు తగిలాయా?" ఆదుర్దాగా ప్రశ్నించాడు మదన్‌రాజ్.

"ఆయన ఎవరు?" చెప్పండి."

"ఆయన మా బాస్ రమేష్‌చంద్ర హోటల్‌గాక ఇంకా ఇతర వ్యాపారాలున్నాయి ఆయనకి."

"ఐ.సీ...."

"ఆయనకి ఏమీ ప్రమాదం జరుగలేదు గదా?"

ఇన్‌స్పెక్టర్ అతని ప్రశ్నకు జవాబు చెప్పలేదు. ప్రశ్నని దాటవేస్తూ "మీరు కారులో ఎందుకు పడి వున్నారు? ఏం జరిగింది? మీకు గుర్తుందా?" అన్నాడు.

"నేను స్పీడుగా డ్రైవ్ చేస్తున్నాను. కొంచెం దూరంలో రాళ్ళు అడ్డంపెట్టి వుండడం గమనించి సడన్ బ్రేక్ వేశాను. వెంటనే రోడ్డుపక్కనుంచి నలుగురైదుగురు మా కారు దగ్గరికి పరిగెత్తుకొచ్చారు. నేను విండో

గ్లాసులు ఎత్తబోతుండగా ఒకడు డోర్ లాగి కర్రతో నా నెత్తిమీద కొట్టాడు. నేను తెలివితప్పి పడిపోయాను. తర్వాత ఏం జరిగిందో నాకు తెలీదు" అన్నాడు మదన్ రాజ్.

"వాళ్ళు ఎలా వుంటారో చెప్పగలరా?"

"చీకట్లో వాళ్ళ ముఖాలు సరిగా కన్పించలేదు. ముఖాలు నల్లగా వున్నాయి. బహుశా నల్లరంగు వేసు కున్నారేమో? నిక్కర్లు బనీన్లు మాత్రమే వున్నాయి. తలలకి గుడ్డలు కట్టుకున్నారు. చూట్టానికి అందరూ ఒకే మాదిరిగా వున్నారు" అన్నాడు మదన్ రాజ్.

ఇన్ స్పెక్టర్ మరి కొన్ని ప్రశ్నలు అడిగి తెలుసు కున్నాడు.

"సార్! మా బాస్ కి ఎలా వుంది? ఆ దుర్మార్గులు ఆయన్ని ఏమైనా చేశారా?" మదన్ రాజ్ కంఠం ఆందోళన పూరితంగా వుంది.

"సారీ మిష్టర్ మదన్ రాజ్. దుండగలు ఆయన్ని హత్య చేశారు."

"నో...." మదన్ రాజ్ గట్టిగా కేక పెట్టాడు.

వార్డులోని రోగులంతా అతనివైపు వింతగా చూశారు.

"మిష్టర్, ఆవేశపడకండి. మీ ఆరోగ్యం సరిగా లేదు. మీరు ఎక్కువ ఆలోచించకుండా రెస్టు తీసు కోవాలి" అన్నాడు డాక్టర్.

మదన్ రాజ్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మిష్టర్ మదన్ రాజ్. మీరు బొంబేనుంచి వస్తున్న ప్పుడు మీ దగ్గర విలువైన వస్తువులు ఏవైనా వున్నాయా?" ప్రశ్నించాడు ఇన్ స్పెక్టర్.

"సార్! మా బాస్ కి సిటీలో జ్యూవెలరీషాపుగూడా

వుంది. బొంబేలో గోల్డు, డైమండ్స్ కొంటుంటారు. కాని ఆ వివరాలు నాకు చెప్పరు. నేనూ అడగను. ఆయనకు తోడుగా వెళ్ళి వస్తుంటాను.

"అయితే మీకు వివరాలు ఏమీ తెలియవన్నమాట."

తల అడ్డంగా వూపాడు మదన్ రాజ్.

"మీ బాస్ రెసిడెన్స్ ఎక్కడ?"

"బంజారా హిల్స్."

"ఆయనకి భార్య పిల్లలు ఉన్నారా?"

"వున్నారు సార్. ఆయన ఇద్దరు కొడుకులు అమెరికాలో వున్నారు. కూతురు ఇక్కడే వుంది. ఎమ్. ఏ. చదువుతున్నది."

ఇన్ స్పెక్టర్, రమేష్‌చంద్ర ఇంటి అడ్రెస్ ఫోన్ నెంబర్ నోట్ చేసుకున్నాడు.

# 3

సువర్ణ రేఖ ఛేజ్ నవలలో మునిగిపోయింది. ఆమె కూర్చున్న సోఫాముందున్న టీపాయ్‌మీద పెట్టిన 'టీ' చల్లారిపోవడంగూడా ఆమె గమనించలేదు. 'టీ' తాగమని నౌకరు అప్పలకొండగూడా గుర్తుచేయడానికి సాహసించలేదు. అమ్మాయిగారి ఏకాగ్రతకి భంగం కలిగితే ఏం జరుగుతుందో అతనికి బాగా అనుభవం వుంది.

చేతిలో వున్న పుస్తకం విసిరికొట్టొచ్చు. లేదా ఆ టీ గ్లాసుతోనే బుర్ర రాంకీర్తన పాడించొచ్చు. అందుకే అప్పలకొండ టీ చల్లారిపోతున్నా మిన్నకుండిపోయాడు.

ఇంతలో అమ్మాయిగారిని డిస్టర్బ్ చేస్తూ ఫోన్ రింగైంది. అమ్మాయిగారు ఫోన్ ఎత్తుతారేమోనని అప్పలకొండ కొన్ని క్షణాలు ఎదురు చూశాడు. కాని ఆమె ఫోన్‌వంక చూడకుండా అప్పలకొండకేసి తీవ్రంగా

చూసింది. ఆమె భావం గమనించి అతను రిసీవర్ ఎత్తి "హలో" అన్నాడు.

"రమేష్‌చంద్రగారిల్లేనా?"

"అవును సార్."

"ఎవరు మాట్లాడుతున్నారు?"

"నేను ఇంట్లో నౌకర్ని సార్."

"మీ అమ్మగారున్నారా?"

"మేడపైన వున్నారు సార్."

"కొంచెం పిలుస్తావా?"

"పిలుస్తాను సార్. తమరు ఎవరు సార్?"

"పోలీస్ ఇన్‌స్పెక్టర్ అని చెప్పు."

సువర్ణరేఖ చదువుతున్న పుస్తకం మూసి టీపాయ్ మీద పడేసి "ఎవర్రా మాట్లాడేది?" అంది విసుగ్గా.

అప్పలకొండ మౌత్‌పీస్‌కి చెయ్యి అడ్డంపెట్టి "పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గారమ్మా" అన్నాడు.

"ఏం కావాలట? నాన్నగారు బొంబే వెళ్ళారని చెప్పు" అంది.

"అమ్మగారు కావాలన్నారమ్మా! నాన్నగార్ని అడగలేదు."

ఆమె ఒక్క క్షణం తల పంకించి లేచి ఫోన్ దగ్గరకు వచ్చి రిసీవర్ అందుకుంది.

"హలో, నేను రమేష్‌చంద్రగారి అమ్మాయిని సువర్ణరేఖను మాట్లాడుతున్నాను. మీరెవరండీ"

"నేను పోలీస్ ఇన్‌స్పెక్టర్ని మాట్లాడుతున్నాను. మీ అమ్మగారిని పిలుస్తారా?"

"మా అమ్మ పనిలో వుంది. ఏమిటో చెప్పండి.

ఫరవాలేదు."

"మీ నాన్నగారు బొంబే వెళ్ళారు కదూ?"

"అవును."

"ఆయన వస్తున్న కారుకి యాక్సిడెంట్ జరిగింది. ఆయనతోపాటు వున్న మదన్‌రాజ్ డ్రైవ్ చేస్తున్నాడు. ఇద్దర్నీ హాస్పిటల్లో జేర్పించాము. మీరు వెంటనే ఇక్కడికి రండి."

"యాక్సిడెంటా? యెక్కడ జరిగింది ఇన్‌స్పెక్టర్ మా ఫాదర్‌కి యెలా వుంది?" సువర్ణరేఖ ఆదుర్దాగా అడిగింది.

"సిటీకి పాతిక మైళ్ళ దూరంలో జరిగింది" అంటూ ఇన్‌స్పెక్టర్ వాళ్ళు రావాల్సిన హాస్పిటల్ వివరాలు చెప్పాడు.

"ఫాదర్‌కి ఏమైనా దెబ్బలు తగిలాయా? ఇప్పుడెలా ఉన్నారు?"

"మీరు వెంటనే రండి."

ఫోన్ పెట్టేసిన శబ్దం వినిపించింది.

సువర్ణరేఖ మెదడు మొద్దుబారినట్లయింది. గుండె వేగం హెచ్చింది. శరీరంలో శక్తి ఉడిగిపోయినట్లు నీరసం ముంచుకొచ్చింది. కొంచెంసేపువరకూ లేవలేక పోయింది.

ఇన్‌స్పెక్టర్ ఫోన్‌లో చెప్పిన విషయం నిజమా? లేక తను కలగంటున్నదా? అని సందేహం వచ్చింది. కాని వాస్తవం కల యెలా అవుతుంది? ఫాదర్‌కి యెలా వుంది? ఇన్‌స్పెక్టర్ చెప్పకుండా దాటవేశాడెందుకు? ఆమె మనస్సు ఏదో కీడును శంకిస్తోంది.

పరిపరివిధాల పోతున్న మనస్సు అదుపులో పెట్టి ఆమె

మేడపైకి వెళ్ళి "అమ్మా! నాన్నగారి కారుకి యాక్సిడెంట్ జరిగిందట" అంది.

సరళారాణి కొయ్యబారిపోయి "ఏమిటే?" అంది.

"ఇన్‌స్పెక్టర్ ఫోన్ చేసి చెప్పాడు. హాస్పిటల్లో అడ్మిట్ చేశారట. మనల్ని వెంటనే రమ్మన్నాడు" అంది సువర్ణరేఖ.

"అప్పన్నా.... డ్రైవర్‌కి చెప్పు. కారు రెడీచెయ్యమని" కేకపెట్టింది సరళారాణి.

తల్లీ, కూతురూ కారులో హాస్పిటల్‌కి చేరుకున్నారు.

"ఇన్‌స్పెక్టర్ మా ఫాదర్‌కి యెలా వుంది?" అంది సువర్ణరేఖ ఇన్‌స్పెక్టర్ని చూస్తూనే.

"రండి...." అంటూ ఇన్‌స్పెక్టర్ వాళ్ళిద్దర్నీ మార్చ్యురీకి తీసికెళ్ళాడు.

రమేష్‌చంద్ర శవాన్ని చూసి వాళ్ళిద్దరూ ఘొల్లుమన్నారు.

## 4

పోలీసు దక్కలు అక్కడక్కడే తారట్లాడి రోడ్డు మీదే కొంతదూరం వెళ్ళి వెనక్కి వచ్చేశాయి. దుండగులు కారులోనే పారిపోయి ఉంటారని పోలీసులు నిర్ణయించుకున్నారు. కారుకు కొద్ది దూరంలో రోడ్డు మీద రాళ్ళు అడ్డంపెట్టిన గుర్తులున్నాయి.

డి.సి.పి. పాపారావు, ఇన్‌స్పెక్టర్ అజీజ్‌కి ఇన్వెస్టిగేషన్ బాధ్యత అప్పగించి వెళ్ళిపోయాడు.

కారు డిక్కీలో వి. ఐ. పి. సూట్‌కేస్ మాత్రమే వుంది టూల్స్ కిట్, జాకీ వగైరాలున్నాయి.

కారు లోపల సీట్లన్నీ తీయించి వెతికితే గోల్డుచెన్ ఒకటి దొరికింది. గొలుసు సన్నగా ఉంది. లాకెట్ మీద

ఆంజనేయుడి బొమ్మ, వెనకవైపు 'ఎస్' అని ఇంగ్లీషు అక్షరం వున్నాయి.

కారుమీద లోపల సీట్లమీద పౌడర్ చల్లి వీలైనన్ని ఫింగర్ ప్రింట్స్ ఫొటోలు తీస్తున్నాడు ఎక్స్‌పర్టు.

ఇన్‌స్పెక్టర్ అతని సిబ్బంది ఆ చుట్టుపక్కల ఏవైనా ఆధారాలు దొరుకుతాయేమోనని గాలించారు. కాని పనికివచ్చే సమాచారం ఏమీ దొరకలేదు.

ఆ రోజు సాయంకాలానికి పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చేసింది. కత్తిపోట్లువలన మరణం సంభవించిందనీ, రాత్రి రెండు, మూడు గంటల మధ్య చనిపోయి వుంటాడనీ డాక్టర్ రిపోర్టు రాశాడు.

పోస్టుమార్టమ్ తరువాత రమేష్‌చంద్ర మృతదేహాన్ని అతని కుటుంబ సభ్యులకు అందజేశారు. ఆయన వ్యాపార సంస్థలలో పనిచేసే సిబ్బంది అంతా అంత్యక్రియలలో పాల్గొన్నారు. మదన్‌రాజ్ గూడా వెళ్ళడానికి ప్రయత్నించాడుగాని డాక్టర్ ఒప్పుకోలేదు.

రమేష్‌చంద్ర కొడుకులు అమెరికానుంచి వచ్చారు. అంత్యక్రియలవరకూ వుండి వెళ్ళిపోయారు. దోపిడీ గురించి అరెస్టులు ఏమీ జరుగలేదు. యెవర్నయినా అరెస్టు చెయ్యడానికి ఆధారాలు దొరకటంలేదు. సూట్‌కేస్‌లో బట్టలు, డైరీ, వగైరా వస్తువులున్నాయే గాని అనుమానించదగినవేమీ లేవు.

కేసు సి.బి.సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ పతంజలికి ట్రాన్స్‌ఫరైంది. ఫైలు క్షుణ్ణంగా పరిశీలించాడు పతంజలి.

రాష్ట్రవ్యాప్తంగా నేరస్తుల వేలిముద్రలు, ఇతర రాష్ట్రాల నేరస్తులవీ పరిశీలించి చూశాడు. కాని కారు లోపల, బైట దొరికిన వాటితో ఒక్కటీ టాలీ కాలేదు.

రాష్ట్రం లోపల నేరస్తులు కాని, సరిహద్దు రాష్ట్రాల దోపిడీ దొంగలుగాని, ఈ నేరం చేసివుండరని నిర్ణయించుకున్నాడు పతంజలి.

అసలు రమేష్‌చంద్రను హత్యచేసినవాళ్ళు దోచుకున్నది ఏమిటి? అనే విషయం సందిగ్ధంగానే వుండిపోయింది. అసలు దోపిడీ ఎవరు చేశారు? అనేది కాకుండా ఎందుకు చేశారు? వాళ్ళ మోటివ్ ఏమిటి?

కారులో విలువైన వస్తువులు దొరుకుతాయనే ఉద్దేశ్యమా? లేక రమేష్‌చంద్రమీద పగతో ఈ హత్య చేశారా? పతంజలి లోతుగా ఆలోచిస్తున్నాడు.

# 5

పతంజలిని చూసి ఎవరో వూహించలేకుండాపోయింది సరళారాణి. రమేష్‌చంద్ర పోయిన తర్వాత ఆమెను పరామర్శించడానికి యెందరో వస్తున్నారు. కొందరు ఆమెకు తెలిసినవాళ్ళే అయితే కొందర్ని అసలు గుర్తుపట్టలేక పోతోంది. కాని తెలిసినట్లే ప్రవర్తిస్తున్నది. తనకి గుర్తులేదంటే వచ్చినవాళ్ళు చిన్నబుచ్చుకుంటారని ఆమె భయం.

పతంజలిని చూసిగూడా ఆమె అలాగే అనుకున్నది. ఎవరు ఇతను? ఎప్పుడూ చూసినట్లు గుర్తులేదే?

సరళారాణిని చూసి అతను "నమస్తే మేడమ్" అన్నాడు.

ఆమె ప్రతి నమస్కారంచేసి విచారంగా తల దించుకుంది.

"కూర్చోండి" అంది ఆమె.

అతను సోఫాలో కూర్చున్నాడు.

ఆమె మరొక సోఫాలో కూర్చుని అతను చెప్పబోయే

సానుభూతి వాక్యాలు వినడానికి సిద్ధంగా వుంది. కాని అతను ఏమీ మాట్లాడలేదు. ఆమె వంకే పరీక్షగా చూశాడు.

ఆమెకు నలభై ఏళ్ళు దాటివుంటాయి. కానీ శరీరం పెరగకుండా శ్రద్ధతీసుకున్నందువల్ల నేమో ముప్పై ఏళ్ళ స్త్రీలా కనిపిస్తోంది. ఆమె ఎత్తుగా, ఎర్రగా ఆకర్షణీయంగా వుంది. ఆమె దిగులుగా వున్న ముఖంలో ఠీవి, రాజసం కనిపిస్తూనే వున్నాయి.

అతను యెంతసేపటికి మాట్లాడకపోయేసరికి ఆమె తలెత్తి అతన్ని చూసింది. అతను కళ్ళు తిప్పుకుని "మీరు ఎంతో విచారంలో వున్నారు. అయినా మిమ్మల్ని ఇబ్బంది పెట్టవలసివచ్చింది" అంటూ తన ఐడెంటిటీ కార్డు ఆమెకు అందించాడు.

'సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్' అన్నమాట అనుకుంది.

"ఫరవాలేదు. అడగండి" అంది సరళారాణి.

"రమేష్‌చంద్రగారు బొంబాయి వెళ్ళబోయేముందు మీకు ఏమైనా చెప్పారా?"

"ఏ విషయం?"

"బొంబాయి ఎందుకు వెళ్తున్నారో ఏమిటో? అని."

"సామాన్యంగా నేను వివరాలు అడగను. ఆయనకు రకరకాల వ్యాపారాలున్నాయి. అప్పుడప్పుడూ ఢిల్లీ, బొంబాయి, మద్రాస్ వెళ్తుంటారు. ఎందుకు ఏమిటి అని నేను అడగను. చెప్పాలనిపిస్తే ఆయనే చెప్తారు."

"అయితే మీకేమీ చెప్పలేదన్నమాట."

"వుహుఁ, చెప్పలేదు."

"ఆయన వెంట ఎవరెవరు వెళ్ళారో మీకు తెలుసా?"

"మా హోటల్ మేనేజర్ మదన్‌రాజ్ వెళ్ళాడు.

అతను ఆటోలో మా ఇంటికి వచ్చాడు. ఇద్దరూ కలిసి కారులో వెళ్ళారు."

"వెళ్ళేటప్పుడు వెంట క్యాష్ ఏమైనా తీసికెళ్ళారా?"

"ఏమో తెలీదు."

"కేసు ముందుకు పోవటంలేదు మేడమ్. రమేష్‌చంద్ర గారిని డబ్బుకోసం హత్య చేశారా? లేక ఆయనపై ఎవరికైనా పగ వుండి హత్యచేశారా? మోటివ్ ఏమిటి అనేది తెలియడంలేదు."

సరళారాణి ఏమీ మాట్లాడలేదు.

"మీకు ఎవరిమీదనైనా అనుమానం వుందా? వృత్తి రీత్యాగాని, లేదా మరేదైనా ఇతర కారణాలవల్లగాని ఆయనపై యెవరికైనా కోపం వుందా? మీకు తెలిస్తే చెప్పండి."

"ఇన్‌స్పెక్టర్ నాకేమీ అర్థం కావటంలేదు. నాకు అంతా అయోమయంగా వుంది. నేనేమీ చెప్పే స్థితిలో లేను" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి అలా అంటుంటే.

"ఐయామ్ సారీ మేడమ్. మిమ్మల్ని బాధపెడుతున్నాను" అన్నాడు పతంజలి.

"ఫరవాలేదు...." అంటూ ఆమె కళ్ళు తుడుచుకుంది.

"కారులో సెర్చి చేస్తుంటే మా వాళ్ళకు ఒక గోల్డు చెయిన్ దొరికింది. ఇది ధరించేవాళ్ళు మీకు యెవరైనా తెలుసా? తెలిస్తే చెప్పండి" అంటూ పతంజలి తన పర్సు లోనుంచి చైన్ తీసి ఇచ్చాడు.

ఆమె దానిని అందుకుని పరీక్షగా చూసి తిరిగి ఇచ్చేసి "నాకెవరూ తెలీదు" అంది.

"రమేష్‌చంద్రగారి ఆఫీస్ రూమ్ ఒక్కసారి

చూడాలి. మీరు అనుమతిస్తారా?"

"రండి. చూపిస్తాను."

సరళారాణి మేడపైకి దారితీసింది. ఇన్‌స్పెక్టర్ పతంజలి ఆమెను అనుసరించాడు.

తలుపు తీసి లైటువేసింది ఆమె. ఏ. సి. ఆన్ చేసింది. గది విశాలంగా వుంది. రెండు గాడ్రెజ్ స్టీల్ అల్మారాలు, సోఫాలు, సొరుగులున్న ఐరన్ టేబుల్ వగైరాలున్నాయి. ఆమె ప్రశ్నార్థకంగా పతంజలివైపు చూసింది.

బీరువాలో ఎక్కౌంట్ బుక్స్, ఫైల్స్, పేర్చి వున్నాయి. సొరుగులో పాస్ బుక్స్, కొన్ని రసీదులు దొరికాయి. అందులో ఒకటి రమేష్‌చంద్ర బొంబాయి వెళ్ళబోయేముందు తీసుకున్న డిమాండ్ డ్రాఫ్ట్ తాలూకు రసీదు. పి.యమ్. జైన్ పేరుతో రెండు లక్షలకు తీసుకున్న రసీదు.

"మేడమ్ ఈ రసీదు చూడండి. పి.యమ్. జైన్ పేరుతో రెండు లక్షలకు తీసుకున్నారు. అంటే బొంబే వెళ్ళేటప్పుడు రెండు లక్షలకు డ్రాఫ్ట్ తీసుకున్నారు. ఇక క్యాష్ ఎంత తీసికెళ్ళారనేది మనకి తెలీదు."

"క్యాష్ తీసికెళ్ళి వుండకపోవచ్చునుగదా?" అంది సరళారాణి.

"అఫ్‌కోర్స్. పోనీ రెండు లక్షలే తీసికెళ్ళారను కుందాం. ఆ డబ్బుకి సమానమైన వస్తువులేవో వెంట తెచ్చి వుండాలి."

ఆమె తల వూపింది.

"పి.యమ్. జైన్ రెగ్యులర్ లావాదేవీలున్న బిజినెస్ మన్ అనుకుంటాను. మీకు తెలుసా?"

"తెలీదు."

పతంజలి, రమేష్‌చంద్ర స్వయంగా నోట్ చేసి పెట్టు కున్న టెలిఫోన్ ఇండెక్స్‌లో గాలించాడు పి.యమ్. జైన్ అడ్రస్ కోసం. అతను వూహించినట్లే అడ్రస్, టెలిఫోన్ నెంబర్ దొరికాయి.

"మేడమ్! జైన్ అడ్రస్ దొరికింది. మీరు పర్మిషన్ ఇస్తే అతనికి ఫోన్ చేసి వివరాలు సేకరిస్తాను."

"అలాగే కానివ్వండి."

పతంజలి బొంబాయికి యస్.టి.డి. చేశాడు. వెంటనే లైన్ దొరికింది.

"పి.యమ్. జైన్ గారున్నారా?"

"నేనే మాట్లాడుతున్నాను. ఎవరు మీరు?"

"నేను హైదరాబాద్ నుంచి మాట్లాడుతున్నాను. రమేష్‌చంద్రగారి మేనేజర్ని."

"క్యా మదన్‌రాజ్ సాబ్. క్యా హై?" అని పలకరించాడు జైన్.

"వెరీ శాడ్ న్యూస్ జైన్ సాబ్. రమేష్‌చంద్ర గారిని హత్య చేశారు దొంగలు."

జైన్ ఆశ్చర్యపోయాడు. ఆయన హత్య ఎలా జరిగిందీ వివరంగా చెప్పాడు పతంజలి. మాట్లాడుతున్నది మదన్‌రాజ్ అనుకునే జైన్ ఫ్రీగా మాట్లాడాడు.

"మీ రిచ్చిన సరుకు విలువ ఎంత?"

"మీకు తెలుసుగా పదిలక్షలు."

"నాకేం తెలుసు. రెండు లక్షలకు డ్రాఫ్టు తెమ్మన్నారు. తెచ్చాను. మీకు క్యాష్ ఎంత ఇచ్చారో నాకేం తెలుసు?"

"భలేవారే. మీరే కదా ఆయనముందు క్యాష్ ఇచ్చారు."

"ఆఁ....అవునవును. గుర్తులేదు. ఇప్పుడెలా? సరుకు పూర్తిగా దొంగలు దోచుకున్నారు. నేను వస్తే సరుకు ఇస్తారా?"

"ఎందుకివ్వమూ?"

"సరుకు ఎక్కడిస్తారు?"

"అదేంటి భాయీ! కొత్తగా మాట్లాడుతున్నావు? కష్టమ్స్ చెక్ పోస్టు దాటించి ఇస్తాము. ఆ బాధ్యతంతా నాది."

"ఓ.కె. థాంక్స్ జైన్ సాబ్."

"ఎప్పుడొస్తారు?"

"వచ్చేముందు ఫోన్ చేస్తాను."

పతంజలి ఫోన్ రిసీవర్ పెట్టేశాడు.

"మేడమ్. రమేష్‌చంద్ర రెండు లక్షల డ్రాఫ్ట్ తీసి కెళ్ళారు. ఎనిమిది లక్షలు క్యాష్ తీసికెళ్ళారు. పది లక్షలు విలువచేసే స్మగుల్డు గుడ్స్ కారులో తీసుకొస్తున్నారని తెలుస్తున్నది. యెవరో కనిపెట్టి ఆయన్ని మర్డర్ చేసి ఆ సరుకు దోచుకుపోయారు" అన్నాడు పతంజలి.

సరళారాణి ముఖం నల్లగా మాడిపోయింది. ఆ మాటలు వింటూవుంటే.

"ఆయన బొంబేనుంచి స్మగుల్డు తెస్తున్నట్లు తెలిసిన వాళ్ళెవరో ఈ అఘాయిత్యం చేశారు. మీరేం దిగులు పడకండి. వాళ్ళెవరో కనిపెట్టి తీరతాం" అన్నాడు పతంజలి.

# 6

"గుడ్ మాణింగ్ మిష్టర్ మదన్ రాజ్."

పేపరు తిరగేస్తున్న మదన్ రాజ్ అతన్ని చూసి కొంచెం ఆశ్చర్యపోయాడు. తనని పేరుతో పిలుస్తున్న ఎవరితను?" ఎప్పుడూ చూసినట్లులేదే అనుకున్నాడు.

"గుడ్ మాణింగ్" అని విష్ చేశాడు మదన్ రాజ్.

అది హాస్పిటల్లో స్పెషల్ రూమ్. ఆరోగ్యం బాగయ్యేవరకూ అక్కడే వుండాలని డబ్బు ఖర్చయినా ఫరవాలేదని స్పెషల్ రూమ్ ఎలాట్ చేయించుకుని వుండిపోయాడు.

ఇంతలో నర్స్ సిరంజితో లోపలకు వచ్చింది.

"ఏమైనా ఆహారం తీసుకున్నారా?" ప్రశ్నించింది నర్స్.

మదన్ రాజ్ తల వూపాడు.

నర్స్ ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయింది.

అప్పటివరకు నిలబడే వున్నతన్ని చూసి "కూర్చోండి" అన్నాడు మదన్ రాజ్.

అతను కుర్చీలో కూర్చున్నాడు.

"మిమ్మల్ని పి.యమ్. జైన్ గారు అడిగానని చెప్పమన్నారు" అన్నాడు అతను.

మదన్ రాజ్ ఉలిక్కిపడి నివ్వెరపోయి చూశాడు.

"మీరు...మీరు బాంబేనుంచి వచ్చారా?" అన్నాడు మదన్ రాజ్.

"అవును. పి.యమ్. జైన్ గారిని కలుసుకున్నాను. రమేష్ చంద్రగారి లావా దేవీలు మీకు పూర్తిగా తెలుసటగదా. సంత్సరానికి కోటిపైగా ట్రాన్సాక్షన్ చేస్తారట. అదంతా చెప్పాడాయన."

మదన్‌రాజ్‌కి ఆందోళన కలుగుతోంది. అతను చెప్పే మాటలు వింటూవుంటే. ఎవరితను? పి.యమ్. జైన్ దగ్గరికి ఎందుకు వెళ్లాడు?

"ఈమధ్య మీరు పదిలక్షల సరుకు తెచ్చారటగదా! అదంతా దొంగలపాలైందని తెలిసి ఆయన చాలా విచారించాడు."

మదన్‌రాజ్ నాలుక పిడచగట్టుకుపోయింది. కొంచెం సేపటికి తేరుకుని "ఎవరు మీరు?" అన్నాడు.

పతంజలి తన గుర్తింపు కార్డుతీసి అందించాడు.

మదన్‌రాజ్ ముఖం వెలాతెలాపోయింది ఆ కార్డు వంక చూస్తూనే.

"ఇప్పుడు చెప్పండి? దోపిడీ జరిగిన రోజున అబద్ధపు స్టేట్‌మెంట్ ఎందుకిచ్చారు? రమేష్‌చంద్ర లావాదేవీలన్నీ మాకు తెలుసు. మీ కారులో స్మగుల్డు గుడ్స్ వుందని తెలుసు. అన్నీ తెలిసి నాకేం తెలీదని ఆయన నాకేం చెప్పడనీ పోలీస్ స్టేట్‌మెంట్ ఎందుకిచ్చారు?" పతంజలి గొంతు కఠినంగా వుంది.

మదన్‌రాజ్‌కి ఊపిరి ఆగిపోయినట్లయింది. ఉక్కిరి బిక్కిరైపోయాడు. "సారీ సార్! స్మగుల్డు వ్యవహారం కాబట్టి అలా చెప్పక తప్పలేదు."

"ఇందులో మీ షేంర్ ఎంత?"

మదన్‌రాజ్ అదిరిపోయాడు ఆ మాట విని.

"సార్! ఇందులో నా ప్రమేయం ఏమీలేదు. నా ప్రాణాలు దక్కించుకోవడం కోసం అబద్ధం చెప్పాను" అన్నాడు.

"నిజం చెప్తే మీ ప్రాణాలు పోయేవా? చెప్పండి? ఎందుకు? దోపిడీ చేసినవాళ్ళు ఎవరో మీకు తెలుసా?"

ప్రశ్నల వర్షం కురిపించాడు పతంజలి.

"ఎవరో కాదు ఇన్‌స్పెక్టర్! సుఖదేవ్" అన్నాడు మదన్‌రాజ్.

"సుఖదేవ్ ఎవరు?"

"రమేష్‌చంద్రగారి బావమర్ది. మీరు చూసేవుంటారు ఆయనింట్లో?"

"నేనెప్పుడూ చూళ్ళేదు. అయితే బావగారిని చంపింది సుఖదేవ్ అన్నమాట."

"సుఖదేవ్ చంపలేదు. అతని వెంట వచ్చినవాళ్ళు చంపారు. సుఖదేవ్ మేం తెస్తున్న స్మగుల్డు సరుకంతా దోచుకున్నాడు."

"వాళ్ళు మొత్తం ఎంతమంది?"

"సుఖదేవ్ కాక నలుగురు."

"మీరు తెచ్చిన సరుకేమిటి?"

"బంగారం సార్! రమేష్‌చంద్రగారికి జ్యూవెలరీ షాప్ వుంది. దాన్ని అడ్డం పెట్టుకుని దొంగ బంగారం బిజినెస్ చేస్తుంటారు. నగలు తయారుచేయించి కారులో ఇళ్ళకు పంపించి అమ్మిస్తుంటారు."

మదన్‌రాజ్, రమేష్‌చంద్ర దొంగ బంగారం వ్యాపారం గురించి వివరంగా చెప్పాడు.

"సుఖదేవ్ ఏం చేస్తుంటాడు?"

"అతనికి ఒక వృత్తి అంటూ లేదు సార్. సినిమా పిచ్చి జాస్తి. సినిమా తియ్యాలని ప్లాన్ వేస్తున్నాడు. డబ్బుకోసం బావగారిని పీడిస్తుంటాడు. యెన్నోసార్లు ఘర్షణపడటం, అక్కగారు వచ్చి అతన్ని లాక్కెళ్ళడం నేను స్వయంగా చూశాను."

"బావగారు డబ్బివ్వడని నిర్ణయించుకుని ఆఖరికి ఈ

అఘాయిత్యం చేశాడన్నమాట."

"అవును సార్! డబ్బు పాపిష్టిది" అన్నాడు మదన్ రాజ్ విచారంగా. ఇన్ స్పెక్టర్ జేబులోంచి బంగారు గొలుసు తీశాడు. అదెవరిదో తనకు తెలియదన్నాడు మదన్ రాజ్.

"మీ ఆరోగ్యం యెలా వుంది? యెప్పుడు డిశ్చార్జి అవుతారు?

"ఇప్పుడు కొంచెం ఫరవాలేదు సార్. ఇంకొక వారం రెస్టు తీసుకుంటే డిశ్చార్జి చేస్తారు. పూర్తిగా నయమయ్యేవరకూ ఇక్కడే వుండమని మా అమ్మ గొడవ పెడుతున్నది."

"మీకు పెళ్ళి కాలేదా?"

"లేదు సార్!" అన్నాడు మదన్ రాజ్.

## 7

"సరళారాణిగారూ! బంధుత్వం పక్కన పెట్టి నిజం చెప్పండి. ఈ గోల్డు చైన్ మీ తమ్ముడు సుఖదేవ్ దేనా?" ప్రశ్నించాడు ఇన్ స్పెక్టరు.

ఆంజనేయస్వామి బొమ్మ, 'ఎస్' అనే ఇంగ్లీషు అక్షరం వున్న గోల్డు చైన్. అది లోగడే చూసింది సరళారాణి.

"మా తమ్ముడ్ని అనుమానిస్తున్నారా?" నివ్వెర పోతూ అడిగింది ఆమె.

"హంతకుడు దొరికే వరకూ అంతా అనుమానితులే" అని నవ్వాడు పతంజలి.

ఆమె తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

"ఇది వాడిది కాదు" అంది ఆమె.

"ఇంతకీ మా తమ్ముడిమీదకు మీ అనుమానం ఎందుకు

పోయింది?" అంది తిరిగి.

"దానికి ఆధారం వుంది. మీ తమ్ముడు సినిమా తియ్యాలని ఉబలాటపడుతున్నాడనీ, డబ్బుకోసం రమేష్ చంద్రగారిని సతాయిస్తున్నాడనీ మాకు తెలిసింది."

"ఆ మాట నిజమేలెండి. డబ్బు ఇవ్వడానికి ఆయనకు ఏమీ అభ్యంతరంలేదు. కాని అనుభవం లేక పాడు చేస్తాడని ఆయన వెనుకాడుతుండేవారు. అనుభవం సంపాదించు. తర్వాత చూద్దాం అనేవారాయన. అది వాడికి గిట్టేదికాదు. దిగితే అదే అనుభవం వస్తుంది అనేవాడు మా తమ్ముడు. తరచు కీచులాడుకుండేవారు కాని వాడు డబ్బుకోసం ఇంత దుర్మార్గం చేసేవాడు కాదు."

"ఆ మాట యెలా చెప్పగలం సరళారాణిగారూ! డబ్బు పాపిష్టిది. డబ్బుకోసం తండ్రిని చంపినవాళ్ళు, అన్నదమ్ముల్ని పొట్టన పెట్టుకున్నవాళ్ళు మా రికార్డులో యెందరో ఉన్నారు. ఇక ఇటువంటి బంధుత్వాలు ఒక లెక్కా!" నవ్వాడు పతంజలి.

"అవన్నీ నిజమేననుకోండి. కాని మా తమ్ముడు అంత నీచుడు కాదు" అంది సరళారాణి.

"మీ తమ్ముడు ఎక్కడున్నాడండి?"

"మా హోటల్లో ఉండొచ్చు. మా మేనేజర్ ఇంకా హాస్పిటల్లోనే ఉన్నాడుగదా! అక్కడ మేనేజ్‌మెంట్ మావాడే చూస్తున్నాడు."

"మీ ఫోన్ ఒకసారి ఉపయోగించుకోవచ్చా!"

"అలాగే. దానికేముంది" అంది ఆమె.

పతంజలి రిసీవర్ ఎత్తి నెంబర్ డైల్ చేశాడు.

"నేను పతంజలిని మాట్లాడుతున్నాను. సుఖదేవ్

హిమాలయా ఇంటర్నేషనల్ హోటల్లో ఉంటాడు. వెంటనే అరెస్టు చెయ్యండి. దోపిడీ జరిగినరోజు రాత్రి ఎలిబీ చెక్ చెయ్యండి. నేను రమేష్‌చంద్రగారింట్లో ఉన్నాను."

పతంజలి రిసీవర్ క్రెడిల్ చేసి వచ్చి కూర్చున్నాడు.

సరళారాణి అతన్ని ఆశ్చర్యంగా చూస్తూ "ఏమిటీ మా తమ్ముడ్ని అరెస్టు చేస్తున్నారా?" అంది.

"అవును. మా వాళ్ళు వారంట్ తీసుకునే వెళ్తున్నారు లెండి."

"అది కాదు. ఆధారం లేకుండా వాడిని అరెస్టు చెయ్యడం అన్యాయం అంటున్నాను. వాడు లేకపోతే మాకు చాలా ఇబ్బంది. మా మేనేజర్ గూడా లేని సంగతి మీకు తెలుసు గదా! ఈ పరిస్థితుల్లో వాడిని అరెస్టు చేసి మాకు ఇబ్బంది కలిగించకండి" అంది.

"మీకు ఇబ్బంది ఏమీ వుండదు. అరెస్టు చెయ్యడం మా డ్యూటీ. బెయిల్ మీద రిలీజ్ చేసుకోండి. దానికేముంది?" అన్నాడు పతంజలి.

# 8

జానికమ్మ అరగంటనుంచీ కొడుకుకోసం స్పెషల్ రూమ్‌లో ఎదురుచూస్తూ కూర్చుంది. కాని మదన్‌రాజ్ యెక్కడికి వెళ్ళాడో రాలేదు.

అటుప్రక్క, ఇటుప్రక్క రూమ్‌ల వాళ్ళని అడిగింది. స్పెషల్ వార్డు నర్స్‌నీ, వార్డు బాయ్‌నీ కొడుకు గురించి వాకబు చేసింది. కనిపించిన వాళ్ళనందర్నీ అడుగుతూనే వుంది. కాని మదన్‌రాజ్ గురించి ఎవరూ చెప్పలేక పోయారు.

చీకటి పడింది.

రాత్రి ఎనిమిది గూడా దాటింది.

జానికమ్మ ఆదుర్దాపడుతోంది. రోజూ ఆమె క్యారియర్ తీసుకొచ్చే సమయానికి అతను రూమ్‌లోనే వుండేవాడు. కాని ఈ రోజు అందుకు భిన్నంగా జరిగింది. దెబ్బలు తగిలిన కొడుకు కోలుకున్నాడనీ, నాలుగైదురోజుల్లో హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అవుతున్నాడనీ ఆమె ఆనంది స్తుంటే హఠాత్తుగా మదన్‌రాజ్ మాయమైపోయాడు.

జానికమ్మ వెళ్ళి డ్యూటీ డాక్టర్‌కి ఫిర్యాదు చేసింది తన కొడుకు కనిపించటంలేదని.

"చిన్నపిల్లాడా ఏమిటి? ఎక్కడికన్నా వెళ్ళాడేమో? వస్తాడులేవమ్మా! కంగారుపడకు" అన్నాడు డాక్టర్.

కాని ఆమె ఊరుకోలేదు. హాస్పిటలంతా తిరిగి తిరిగి అలిసిపోయింది. వార్డుబాయ్ చేతిలో పదికాగితం పెట్టే సరికి ఎక్కడ్లేని ఉత్సాహం తెచ్చుకుని అంతా గాలించి వదిలాడు.

ఎంతసేపటికీ మదన్‌రాజ్ రాకపోయేసరికి డాక్టర్ గూడా కొంచెం కంగారుపడ్డాడు. పై అధికారులకు రిపోర్టు చేశాడు. పోలీస్ వారికి తెలియజేయమని డాక్టర్‌కి ఆదేశాలు వచ్చాయి. డ్యూటీ డాక్టర్, మదన్‌రాజ్ సాయంకాలం ఆరింటి దగ్గర్నుంచి కనిపించటంలేదని పోలీసులకు రిపోర్టు చేశాడు.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ వచ్చి ఎంక్వయిరీ మొదలు పెట్టాడు. మదన్‌రాజ్ ఎప్పట్నుంచి కనిపించటంలేదనే విషయం ఖచ్చితంగా యెవరూ చెప్పలేకపోయారు. జానికమ్మ వచ్చి కొడుకు విషయం అడిగేవరకూ ఎవరూ నోటీస్ చెయ్యలేదు మదన్‌రాజ్ గురించి.

మదన్‌రాజ్ గురించి హిమాలయా హోటల్‌కి, రమేష్‌చంద్రగారి ఇంటికి ఫోన్ చేసి యెంక్వయిరీ చేశారు. అక్కడికి రాలేదని తెలిసింది.

జానికమ్మ ఏడుస్తూ ఆటోలో ఇంటికి వెళ్ళిపోయింది. వాళ్ళ ఇల్లు చిక్కడపల్లిలో కొత్తగా కట్టిన ప్లాట్‌లో.

ఆమె క్యారేజి తీసుకుని ఇంటికి వచ్చే సమయానికి చిన్న కొడుకు కృష్ణ ఇంట్లోనే వున్నాడు. ఏడుస్తూ వచ్చిన తల్లిని చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటమ్మా? ఏం జరిగింది?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"అన్నయ్య కన్పించడంలేదు" అంది ఆమె బొంగురు పోయిన గొంతుతో.

అన్నయ్య కన్పించకపోవటం ఏమిటి? హాస్పిటల్లో లేడా?" నివ్వెరపోయాడు కృష్ణ.

"నేను వెళ్ళేసరికి లేడు. ఎక్కడికైనా వెళ్ళాడేమో వస్తాడని గంటసేపు ఎదురుచూశాను. ఎంతసేపటికీ రాక పోయేసరికి అనుమానం వేసింది. వార్డు బాయ్‌ని, నర్స్‌నీ, ఆ చుట్టుప్రక్కల రూముల్లో వాళ్ళనీ అందర్నీ అడిగాను. యెవరూ చెప్పలేకపోతున్నారు. డాక్టర్ గారే పోలీస్ రిపోర్టు ఇచ్చారు. ఇన్‌స్పెక్టర్ వచ్చి వెళ్ళాడు."

జానికమ్మ చిన్న కొడుకుతో వివరాలన్నీ చెప్పింది.

"ఇదేదో మాయగా వుందే. అన్నయ్య కన్పించక పోవడం ఏమిటి? యెక్కడికి వెళ్ళివుంటాడు? అలా చెప్పకుండా వెళ్ళకూడదే!" అన్నాడు కృష్ణ.

"ఏమోరా? నాకు చాలా భయంగా వుంది."

"ఎందుకు?"

"వాళ్ళ పాప్రయిటర్ని చంపేసినవాళ్ళు వీడిని

మాయం చేసి వుంటారేమోనని."

"వాళ్ళెందుకు మాయం చేస్తారు?"

"చంపిన వాళ్ళని గుర్తు పడతాదేమోనని భయం వేసి వుండొచ్చు."

తల్లి అనుమానంలో అర్థం వున్నట్లు అతనికి అనిపించింది. ఆ మాటే ఆమెతో అని మదన్ రాజ్ ఫోటోలు తీసుకుని బయల్దేరాడు.

"ఇంత రాత్రి పూట నువ్వెక్కడికిరా?" అంది జానికమ్మ.

"అన్నయ్య ఫోటో పేపర్లో వేయిస్తాను."

"ఎందుకూ?" అంటూ ఆశ్చర్యపోయింది.

"ఎందుకైనా మంచిది."

"పోలీసులు వెతుకుతారు గదా! మనం యెందుకు పేపర్లో వేయించటం? దానివల్ల ఇంకా ఏమైనా గొడవలొస్తాయేమో?" అంది జానికమ్మ.

"గొడవలేం రావులే నువ్వూరుకో" అంటూ తల్లి మాటలు లక్ష్యపెట్టకుండా వెళ్ళిపోయాడు కృష్ణ.

# 9

కాలింగ్ బెల్ చప్పుడు కాగానే తనే వెళ్ళి తలుపు తీశాడు పతంజలి ఇంత ప్రొద్దున్నే తన దగ్గరికి వచ్చిన వాళ్ళు ఎవరా? అని.

గుమ్మంలో ఒక మెరుపు తీగ కనిపించింది. అమెరికన్ జార్జెట్ చీర, రెండు జడలు, మెడలో రాళ్ళ నెక్లెస్, ఆమె అందం వర్ణించతరం కాదు అనుకున్నాడు పతంజలి.

ఇంటిముందు కారు ఆగి వుంది. ఆమె కారు స్వయంగా డ్రైవ్ చేసుకొచ్చినట్లు పతంజలి వూహించాడు.

"నమస్తే ఇన్ స్పెక్టర్!" అంది ఆమె రెండు చేతులూ

జోడించి.

"నమస్తే!....మీరు....?" ఆమెను గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ అన్నాడు పతంజలి.

"నేను సువర్ణరేఖను" అందామె నవ్వుతూ.

"ఓ! ఐయామ్ సారీ! మిమ్మల్ని మోడ్రన్ డ్రెస్‌లో చూశాను మీ ఇంట్లో. ఇప్పుడు చీర కట్టుకొస్తే గుర్తుపట్టలేక పోయాను. రండి...." అన్నాడు పతంజలి.

ఆమె లోపలకొచ్చి కూర్చుంది. ఇల్లంతా కలయజూస్తూ "ఇంట్లో యెవరూ లేరా?" అంది.

"మా ఫ్యామిలీ పుట్టింటికెళ్ళారు. ఐ యామ్ సారీ. మీకు కాఫీ గూడా ఇవ్వలేకపోతున్నాను. ఫ్లాస్క్ ఇప్పుడే ఖాళీ అయ్యింది" అన్నాడు పతంజలి.

"ఫరవాలేదు. నేను కాఫీకోసం రాలేదు" నవ్వుతూనే అంది సువర్ణరేఖ.

"కాఫీకోసం రాగనుకోండి....! ఏమిటి ప్రొద్దున్నే వచ్చారు?" అన్నాడు.

"మీకు తెలుసా? మా హోటల్ మేనేజర్ మదన్‌రాజ్‌ని యెవరో మాయం చేశారట" అంది ఆమె.

"అవును విన్నాను. మావాళ్లు చెప్పారు."

"మీరు శ్రద్ధతీసుకుని అతని జాడ కనిపెట్టాలి. అది చెప్పడానికే ప్రొద్దున్నే వచ్చాను."

"మేం కనిపెడతామనుకోండి. మీకెందుకు అతనిమీద అంత ప్రత్యేక శ్రద్ధ?" సూటిగా ఆమె కళ్లల్లోకి చూసి ప్రశ్నించాడు పతంజలి.

ఆ ప్రశ్నకు ఆమె ముఖం ఎర్రబడింది. సిగ్గుతో తల వంచుకుని "అతను లేకపోవడంవల్ల మాకు చాలా ఇబ్బందివుంది. మేనేజ్ చేసేవాళ్ళు లేకపోతే బిజినెస్ వీక్

అవుతుందిగదా!" అంది.

"అఫ్‌కోర్స్! కాని మీరు ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకుంటున్నారంటే ఇంకేదో కారణం వుండివుండాలని పిస్తోంది."

ఆమె ఒక్కసారి పతంజలి వంక చూసి "నిజమే. మీరు నా మనసులో విషయం కనిపెట్టేశారు. ఎంతైనా సి.ఐ.డీలు గదా!" అని నవ్వింది.

అతను నవ్వాడు.

"ఐ లైక్ హిమ్" అంది.

"ఐ. సీ."

"అతను మాయమయ్యాడంటే నేను నమ్మలేకపోయాను. హాస్పిటల్లో వున్నవాడిని అదీ సాయంకాలం మాయం చేశారంటే వాళ్ళకెంత ధైర్యం?"

"రాత్రిళ్ళకంటే అటువంటి సమయమే మంచి వీలు. ఏదో మాయమాటలు చెప్పి తీసికెళ్ళి వుంటారు."

"అతను ఎలా నమ్మి వుంటాడంటారు?"

"ఎందుకు నమ్మడు? సపోజ్ సువర్ణరేఖగారు వచ్చారు మిమ్మల్ని రమ్మన్నారని యెవరైనా కుర్రాడితో కబురు చేశారనుకోండి, రాకుండా యెలా వుండగలడు?"

"అవుననుకోండి? కాని నేను అతన్ని చూడాలనుకుంటే వారుకే వెళ్ళివుండేదాన్నని అతనికి ఐడియా రాదంటారా?"

"ఏమో? ఒకోసారి బుర్ర పనిచేయదు" పతంజలి నవ్వాడు.

"మీరు చెప్పింది కరక్టే!"

"మీ అంకుల్ యెలా వున్నాడు?"

"బెయిల్ మీద విడిపించాక ఫరవాలేదు. లేకపోతే

తెంగ పెట్టుకుని చిక్కిపోయేవాడు" నవ్వింది ఆమె.

"ముందు యెవరొకర్ని అరెస్టుచేస్తే మా ఆఫీసర్స్ శాటిస్ ఫై అవుతారు. లేకపోతే మాకు చీవాట్లు తప్పవు." సుఖదేవ్ ని అరెస్టు చెయ్యడంపై వ్యాఖ్యానించాడు పతంజలి.

"ఊరికే అరెస్టుచేస్తే ఏం లాభం. పట్టుకుని కేసు పెట్టాలిగాని."

"కేసు మీ అంకుల్ మీదే పెట్టొచ్చు. ఆ రోజు అతనికి ఎలిబీ లేదు. ఎవరో సినీ రచయితతో పాటు స్క్రిప్టు వర్కు చేయిస్తూ వుండిపోయానంటాడు. ఆ రచయిత పేరు హాస్యశ్రీ కాబోలు. అతను ప్రస్తుతం నగరంలో లేడు."

"మా అంకుల్ సామాన్యుడేంకాదు."

"ఈ రోజుల్లో అంతా అసామాన్యులే. సామాన్యులెవరూ లేరు."

"మీ ఇన్వెస్టిగేషన్ యెంతవరకూ వచ్చింది."

పతంజలి సమాధానం చెప్పలేదు. నవ్వి వూరుకున్నాడు.

మదన్ రాజ్ విషయం శ్రద్ధ వహించండి. డెయిలీ పేపర్స్ చూశారా! అతని తమ్ముడు ఫోటో కూడా వేయించాడు" అంది ఆమె.

చూశానన్నట్లు తల వూపాడు పతంజలి. ఆమె శెలవు తీసుకుని వెళ్ళిపోయింది.

# 10

సువర్ణరేఖ వెళ్ళిపోయినట్లుగా కారు చప్పుడైంది. తలుపు మూసి పతంజలి లోపల బోల్టు పెట్టేశాడు.

టెలిఫోన్ రిసీవర్ ఎత్తి నెంబరు డైల్ చేశాడు.

"ఈజిట్ పోలీస్ కంట్రోల్ రూమ్?"

"యస్సార్!"

"నేను పతంజలిని మాట్లాడుతున్నాను. ఎమ్.ఎస్.వై. నాలుగు తొమ్మిదులున్న ఫియట్ కారు యిప్పుడే మా ఇంటి దగ్గర్నుంచి బయలేరింది. అందులో ఒకమ్మాయి వుంది. ఆమె పేరు సువర్ణ రేఖ ఆమె కారులో ఎక్కడికి వెళ్తున్నదో కనిపెట్టి నాకు ఫోన్ చెయ్యాలి. ఓ. కే?"

"ఓ. కే. సార్."

పతంజలి ఫోన్ పెట్టేశాడు.

అరగంట తర్వాత పతంజలి ఇంట్లో ఫోన్ మ్రోగింది.

"సార్!"

"యస్. పతంజలి స్పీకింగ్."

"ఆ కారు యెక్కడికెళ్ళిందో కనిపెట్టాం సార్."

"చెప్పండి."

"ఆ కారు చింతలబస్తీ దాటి సోమాజీగూడా వైపు వెళ్ళింది. ఇంజనీర్—చీఫ్—ఆఫీసుకు కొంచెం ఇవతల సందులోకి వెళ్ళి లెఫ్ట్ సైడ్ ఒక కొండ పైకి చేరింది. అక్కడంతా విశాలమైన ప్రాంతం. ఒక పాత మేడ ముందు కారు ఆగింది సార్."

"ఓ. కే" పతంజరి ఫోన్ రిసీవర్ క్రెడిల్ చేశాడు. కొంచెంసేపు ఏదో ఆలోచించాడు. తర్వాత ఒక నిర్ణయానికి వచ్చి ఫోన్ ఎత్తి నెంబర్ డైల్ చేశాడు.

"మిష్టర్ అజీజ్."

"యస్. ఇన్‌స్పెక్టర్ అజీజ్ స్పీకింగ్."

"నేను పతంజలి మాట్లాడుతున్నాను. మన కంట్రోల్ రూంవాళ్ళు ఎమ్. ఎస్. వై. నాలుగు తొమ్మిదులున్న ఫియట్ కారు సోమాజిగూడా ప్రాంతంలో ఒక కొండ మీద వున్నట్లు కనిపెట్టారు. ఐ యామ్ సారీ, ఫోలో

అయ్యారు. నువ్వు ఫోర్స్‌తో వెళ్ళి అక్కడ ఏమీ జర
క్కుండా చూడాలి."

"ఏం జరుగుతుందేం?"

"బహుశా మర్డర్ జరగడానికి ప్రయత్నం."

"ఆ కారు ఎవరిది?"

"రమేష్‌చంద్ర కూతురు సువర్ణరేఖది. అక్కడ దొరికిన వాళ్ళందర్నీ పట్టుకునిరా. నేనీలోపల ఒక చిన్న పని చూసుకుని వస్తాను. కేసు దగ్గరపడిందిలే" అన్నాడు.

"ఓ.కే. ఇప్పుడే బయల్దేరుతున్నా."

"ఆలస్యం చెయ్యకు వెంటనే బయల్దేరు."

"అలాగే."

పతంజలి రిసీవర్ క్రెడిల్ చేశాడు. డ్రెస్ చేసుకుని బయల్దేరాడు.

చిక్కడపల్లి ప్రాంతం. డైరీలోని ఇంటి నెంబరు వెతుక్కుంటూ వెళ్ళాడు పతంజలి. కొత్తగా కట్టి ప్లాట్లలో ఫస్టు ఫ్లోర్‌లో దొరికింది నెంబరు.

కాలింగ్ బెల్ నొక్కాడు.

జానికమ్మ తలుపు తీసింది.

"నమస్కారమండీ. మీరు జానికమ్మగారు కదూ?" అన్నాడు పతంజలి.

"నమస్కారం. అవును. నేనే జానికమ్మని. మీ రెవరు?"

"నేను మీ చిన్నబ్బాయి పనిచేసే ఫ్యాక్టరీలో పని చేస్తున్నానండీ."

"అలాగా రాండి. కూర్చోండి" అంది.

పతంజలి లోపలకెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"మీ చిన్నబ్బాయి కృష్ణ నేనూ ఒకచోటే పని

చేస్తామండి" అన్నాడు.

"అలాగా."

"మీ కృష్ణ లేడాండి."

"లేడు బాబూ! ఫ్యాక్టరీక నే వెళ్ళాడే."

"అరే, ఫ్యాక్టరీకి రాలేదే" అని ఆశ్చర్యం నటించాడు పతంజలి.

"ఏమో బాబూ! ఎక్కడికెళ్ళాడో, ఒకవేళ వాళ్ళ అన్నయ్యని వెతకడానికి వెళ్ళాడేమో!"అంది జానికమ్మ.

"వాళ్ళ అన్నయ్య యెక్కడికెళ్ళాడండీ?"

"ఏం చెప్పమంటావు నాయనా!" అంటూ జానికమ్మ మదన్ రాజ్ హాస్పిటల్ నుంచి మాయమై పోవడంవరకూ కథంతా చెప్పింది.

"ఇంతకూ ఏదైనా పనిమీద వచ్చావా బాబూ!" అంది ఆమె.

"అవునండీ" అంటూ పతంజలి జేబులోనుంచి గోల్డు చైన్ తీసి "బంగారు గొలుసు పోయిందని ఆ మధ్య గొడవపెట్టాడండి ఇదుగోండి. ఇది మీ కృష్ణదేనా?" ఆమెకు అందించాడు.

ఆ గొలుసు చూసి ఆమె ముఖం వెలిగింది.

"అవును బాబూ! ఇది మా కష్ణదే. వాడికి పదో ఏట దెయ్యం పట్టింది. నానా బాధలూపడ్డాం. ఒక భూత వైద్యుడు నయంచేశాడు. ఎప్పుడూ ఆంజనేయ స్వామి బొమ్మ మెడలో ఉండేట్టు చూడమన్నాడు. వాళ్ళ నాన్న ఏకంగా బంగారు గొలుసే చేయించి ఇచ్చారు. అప్పట్నుంచి వాడికి ఏ గ్రహబాధలూ లేవు. అది పోయిందని తెలిసినప్పట్నుంచి నాకు మనశ్శాంతి లేదు. ఆ రోజే మా పెద్దబ్బాయిని దొంగలు కొట్టారు.

ఇక ముందు ముందు ఏం గొడవలు జరిగేవో? అదృష్ట వశాత్తూ దొరికింది" జానికమ్మ మురిసిపోతూ చెప్పింది.

"మీ అబ్బాయి పేరు కృష్ణ కదా. దానిమీద 'ఎస్' అనే అక్షరం ఎందుకు చెక్కించారు?" ప్రశ్నించాడు పతంజలి.

"వాడి పూర్తి పేరు శ్రీకృష్ణ."

"ఇప్పుడు అర్థమైంది. ఆ గొలుసు ఇలా ఇవ్వండి. కృష్ణకి నేనే స్వయంగా ఇస్తాను" అంటూ పతంజలి ఆమె చేతులో గొలుసు తీసుకోబోయాడు.

ఇంతలో కృష్ణ మెరుపులా లోపలకొచ్చి తల్లి చేతిలో గొలుసు తీసుకోబోతున్న పతంజలి చేతిమీద కొట్టాడు. గొలుసు కిందపడిపోయింది. కృష్ణ పతంజలిని వెనక్కి తోశాడు. పతంజలి లేచి కృష్ణ ముఖంమీద పిడికిలితో గట్టిగా కొట్టాడు. కాలితో పొట్టలో రెండు తగల నిచ్చాడు. కృష్ణ కెవ్వున కేక పెట్టి విరుచుకుపడిపోయాడు,

జానికమ్మ అదంతా వింతగా చూసింది. భయంతో ఒక మూలకు ఒదిగిపోయి ఏడుస్తూ వుండిపోయింది.

పతంజలి అతని రెక్కలు విరిచి నైలాన్ తాడుతో కట్టేసి విజిల్ వేశాడు. వెంటనే మఫ్టీలో వున్న ఇద్దరు కానిస్టేబుల్స్ వచ్చి కృష్ణని పట్టుకున్నారు.

"అయ్యో! ఏమిటిది నాయనా! వాడినెందుకు తీసి కెళుతున్నారు?" అంది జానికమ్మ గోడుగోడున ఏడుస్తూ.

ఆమె ఏడుపు విని చుట్టుప్రక్కల ఆడవాళ్ళుకూడా అక్కడ చేరారు.

"జానికమ్మగారూ! మీ కొడుకుల గురించి మీకు తెలీదు. హిమాలయా హోటల్ ప్రొప్రయిటర్ రమేష్ చంద్రగారిని హత్యచేసి పదిలక్షలు విలువచేసే బంగారు

దోచుకున్నారు" అన్నాడు పతంజలి.

ఆ మాట విని జానికమ్మ "ఆఁ...." అంటూ విరుచుకు పడిపోయింది.

"ఏడిని స్టేషన్‌కి తీసికెళ్ళండి. దారిలో యెక్కడా ఆగకండి" అన్నాడు పతంజలి.

## 11

స్టేషన్‌లో అప్పటికే మదన్‌రాజ్, సువర్ణరేఖ వున్నారు. మదన్‌రాజ్ పనిపట్టడానికి సువర్ణ రేఖ వినియోగించిన ఇద్దరు గూండాలు అక్కడే వున్నారు. కృష్ణని పట్టుకొచ్చిన పతంజలిని చూసి సువర్ణరేఖ చిన్నగానవ్వింది.

డి.సి.పి. పాపారావు పతంజలి వంక మెచ్చుకోలుగా చూసి "వెల్‌డన్ మిష్టర్ పతంజలి" అన్నాడు.

"థాంక్స్ సార్" అన్నాడు పతంజలి.

"మదన్‌రాజ్ ఈ దోపిడీ చేయించాడని నువ్వెలా వూహించావు పతంజలీ?" ప్రశ్నించాడు డి.సి.పి.

"కేసు టేకప్ చేసినప్పుడే నాకు అర్థమైంది సార్. దోపిడీ దొంగలైతే మనిషిని చంపరు. వీళ్ళు ప్రతిఘటించారనుకోండి ఇద్దర్నీ చంపేవారు గదా! రమేష్‌చంద్రనే చంపడం, షరగాడిని లైట్‌గా తలమీద కొట్టి వది లేయడం పెద్ద పాయింట్.

తర్వాత ఇతను యెక్కువ రోజులు హాస్పిటల్లో వుండాల్సినంత పెద్ద దెబ్బలేం తగల్లేదు. అయినా డాక్టర్ని కూడగట్టుకుని వుండగలిగాడు. అప్పొక అనుమానం కలిగించింది. తర్వాత రమేష్‌చంద్రగారి బావమ్మర్ది సుఖదేవ్ ఈ దోపిడీ చేశాడని స్టేట్‌మెంట్ యిచ్చి కేసు తప్పు దోవ పట్టించాలనుకున్నాడు. మనమూ తప్పు దోవనే పోతున్నట్లు అతన్ని మభ్యపెట్టడానికి సుఖదేవ్‌ని

అరెస్టు చేశాం."

"వెరీగుడ్" అన్నాడు డి.సి.పి.

"మదన్ రాజ్ తమ్ముడు హోటల్ కొచ్చి మా అన్న బొంబేనుంచి ఎప్పుడొస్తాడని అడుగుతుండేవాడు. ఎప్పుడొచ్చేదీ కనుక్కొని దోపిడీకి ప్లాన్ వేశాడు. హోటల్లో ఇన్ చార్జిగా పనిచేసిన సుఖదేవ్, కృష్ణ గురించి చెప్పారు. అనుమానం బలపడింది" అన్నాడు పతంజలి.

"మదన్ రాజ్ ని నేనే కిడ్నాప్ చేయించానని మీరెలా వూహించారు?" ప్రశ్నించింది సువర్ణ రేఖ.

"అది మీరు చేసిన పొరపాటే!" అని నవ్వాడు మదన్ రాజ్.

"నేను చేసిన పొరపాటా?" ఆశ్చర్యపోయింది సువర్ణ రేఖ.

"యస్ మేడమ్ మీరు నన్ను కలుసుకోవడానికి వచ్చారు. మదన్ రాజ్ ని లైక్ చేస్తున్నాననీ, అదనీ చెప్పారు. అప్పుడే నాకు దొరికిపోయారు. సుఖదేవ్ మీరూ ప్రేమించుకున్నట్లూ, త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నట్లూ నాకు తెలుసు. అదంతా సుఖదేవ్ నాకు చెప్పాడు.

మీ నాన్నగారిని చుట్టుపెట్టిన వ్యక్తిని పట్టుకొని శిక్షించాలని మీకు కసిగా వుంది. సమయం చూసి మదన్ రాజ్ ని కిడ్నాప్ చేసి మీ పాత బిల్డింగ్ లో దాచారు. ఇక కృష్ణ దొరకగానే ఇద్దరికీ కలిపి బుద్ది చెప్పాలి అనుకున్నారు. అవునా?" అన్నాడు పతంజలి.

సువర్ణ రేఖ సిగ్గుతో తల వంచుకుంది.

—:ఐ పో యి ం ది:—

# మరణ శాసనం

## సికిందర్

వర్షం వచ్చేలా వుంది....

ఆకాశం మబ్బులు కమ్ముకుంటూ, చల్లటి గాలులు వీస్తున్నాయి....

సరోజ పది గంటలకి రమ్మంది.

రిస్టువాచీని అసహనంగా చూసుకుని నిట్టూర్చాను.... ఇంకా రెండు గంటలు వేచివుండాలి! ఈ నిరీక్షణ నన్ను నిలవనీయడంలేదు!

ఇలాంటి నిరీక్షణ ఎవర్నీ నిలవనీయదు! క్షణక్షణానికీ భరింపరానిదై నిగ్రహాన్ని జయిస్తుంది, నియమ భంగం గావిస్తుంది....

లేకపోతే ఆమె ఎందుకిలా విధం తప్పి ప్రవర్తించాలి ఈ రోజున?

ఆమెకీ ఆలోచన రాకపోతే ఈపాటికీ ఏ పచ్చని ప్రకృతి మధ్యనో పరవశిస్తూ వుండేవాళ్ళం, ఎప్పటిలాగే.

కానీ ఈ రోజు ఆమె యింటికాహ్వానించింది.....

ఇది సాహసం. మరి నాదీ సాహసమే కదూ? నేనింత సాహసం ఎలా చేస్తున్నాను, మై గాడ్.

ఆలోచిస్తే నాకంతా విచిత్రంగా వుంది.... అంతా అనూహ్యంగా జరిగిపోయింది. ఇలాంటి మలుపు నా జీవితంలో ఆశించలేదు! ఇంత వేగంగా మలుపుతీసుకుంటుందనీ అనుకోలేదు.... ఆందోళనగా ఇంకో సిగరెట్ వెల్గించుకున్నాను.

కిటికీలోంచి బయట కారుమబ్బుల్ని చూస్తూ, వారం క్రితం ఎలా నా జీవితం హఠాత్తుగా మలుపు తిరిగిందో గుర్తుచేసుకుంటోంటే, గుండెలోంచి అదురూ జలదరింపూ పుట్టుకొస్తున్నాయి.... ఇంత సాహసం కూడదని హెచ్చరిస్తోంది ఒకప్రక్క అంతరాత్మ. ఛ నోర్మూయ్ అని దాని గొంతు నొక్కేస్తోంది అదుపులేని మనసు ...

సుమారు ఆరు నెలల క్రితం బిజినెస్ మాగ్నెట్ బి. జె. పి. రావ్‌కి పర్సనల్ సెక్రటరీగా కుదిరినప్పుడు నేనిక జీవితంలో సిరపడిపోయాననుకున్నాను. అంతకు ముందు పనిచేసిన బాస్‌లందరూ వాళ్ళంటేనే వెగటు పుట్టేలా ప్రవర్తించారు. బాస్‌లంతా శాడిస్టులేనన్న అభిప్రాయాని కొచ్చేశాను.... అయితే ఈ కొత్త బాస్ దగ్గర సిరపడ్డాననుకున్న కొలరోజుల్లోనే, ఇతనూ శాడిస్ట్ అనిగాక ఎంత పెద్ద బాస్టర్డో తెలుసుకున్నాను.

ఇతనంటే నాకు విరక్తిలేదు. ఇతడి క్రూరమన స్తత్వాన్ని చూసి కసితో బాస్టర్డు! అనుకునేంతగా పగా ద్వేషం రగులుతున్నాయి. ఇతన్ని శాడిస్టుగా కంటే అంతకంటే నీచంగా బాస్టర్డు అనుకోవడంలోనే నాకు తృప్తి వుంటుంది.

కలిమి కలిగినవాడికి కరుణ కూడా వుండాలి అంటాడు

వేమన, లేదా నాశనమే నాశనం. తన దగ్గర ఉద్యోగుల మీద గాకపోయినా, ప్రపంచంలో ఏ అభాగ్యులమీద గాకపోయినా, కనీసం తనింట్లో స్వంత భార్యా బిడ్డలపై కూడా కరుణలేని పరమ నీచ కిరాతకుడు, నా బాస్ బి.జె.పి. రావ్.

ఆరోజు నేనా దృశ్యం కళ్లారా చూసివుండకపోతే. ఎప్పుడో అతన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయేవాడ్ని.

కానీ ఇప్పుడు—

ఆడదై వుండీ అతడ్ని భరిస్తున్న భార్య వుండగా, జడుసుకొని నేను పారిపోవాలనుకోవడం ఎంత పిరికితనం!

మొట్టమొదటిసారి ఆ దృశ్యాన్ని చూసినప్పుడే అనుకున్నాను, ఎప్పుడో ఇతనికి తగిన శాస్తి జరపకుండా వదలకూడదని!

ఆ తర్వాత పదేపదే ఆ దృశ్యాల్ని చూశాను. వాటికి అంతంలేదు. ఏ మగవాడూ తన భార్యని అంతలా బాధిస్తాడని నేననుకోలేదు. నా బాస్ మాత్రం కట్టుకున్న భార్యని కాళ్ళతో, చేతులతో, కర్రతో, అందిన ప్రతి వస్తువుతో కొట్టి గాయపరుస్తాడు. రాక్షసంగా ఆమె అరుపులు, ఏడ్పులు విని ఆనందిస్తాడు. ఇల్లంతా వేటకుక్కలా తరిమి భీభత్సం చేస్తాడు. ఆ పైశాచికత్వంలోంచి అనిర్వచనీయమైన అనుభూతిని ఏదో చవి చూస్తాడు. తృప్తిచెందుతాడు.

అతని కోపానికి కారణముండనవసరంలేదు. ఏ తప్పూ చేయనవసరంలేదు. వూరికే హింసించి ఆనందిస్తేగాని నిద్రపోని శాడిస్టు. తన అయిదేళ్ళ పసికూతురు చిన్నారిని కూడా వదలని రాక్షసాకారుడు. ఆ పసిపిల్ల మరో దిక్కులేక తల్లడిల్లిపోతోంది....

పిల్లల్ని ఎలా ట్రీట్ చేస్తే వాళ్ళు పెద్దవాళ్ళయి తమ పిల్లల్ని అలాగే ట్రీట్ చేస్తారని సైకాలాజీ చెపుతుంది. చిన్నారి ఏం చేస్తుందో ఇప్పుడు వూహించడం కష్టమే గానీ, ఆమె తండ్రిమాత్రం బాల్యంలో అలాటి అనుభవాలకే గురైయి ఇలా తయారయ్యాడనడానికి ఆధారముంది...

ఆ ఇంట్లోనే పనిచేసే డెభై ఏళ్ళ ముసలి రాజయ్య ఇలా అంటాడు.

"నిజం బాబయ్యా, అయ్యవోరు శానా సెడ్డవోరు.... ముప్ఫై ఏళ్ళుగా సూస్తున్నా బాబయ్యా. మానోత్వం ఇసుమంతైనా నేదుకదా మడిసిలో! ప్రేమ సూడలేదు బాబయ్యా ఎన్నడూ, ఆ అయ్య మనసులో! మడిసిలో ఏ బూతమైనా తొంగుందా అన్పిస్తది సూస్తే....ఆ అయ్యని సయీంచలీకనే మొదటి అమ్మ వురీసుకుంది, బాబయ్యా. మూడేళ్ళే కాపరం సీసేందా అయ్యతో, తరువోత వచ్చిన రెండో అమ్మ పదేళ్ళు ఓపికబట్టిందెలాగో....ఆయమ్మ కూడా గింత ఇసం మింగి సచ్చిపోయింది బాబయ్యా, ఏడాదిన్నర పాప ఆ సిన్నారిని ఒగ్గేసి!...

సావులు శానా భయంకరమైనది బాబయ్యా, సూడలేను. ఆ రెండు సావుల్నీ సూసీక నిజంగా నేను పిచ్చోణ్నయ్యాను, బాబయ్యా, అయ్యోగ్నెవురూ మార్సలేరు! అది సిన్నప్పటి గుణం. అడోళ్ళంటే అయ్యాకసయ్యం! తల్లిని అసయ్యించుకునీవోరు, బాబయ్యా. ఆయమ్మ శానా బాదలు పెట్టేది. ఆయన బాబు ఆయమ్మని బాదించీవోరు, ఆయమ్మ ఈ యయ్యని సావబాదీసీవోరు!"

అదీ—

ఇప్పుడీ మూడో భార్య మరో టార్గెట్ అయిందతనికి.

సరోజ చాలా దురదృష్టవంతురాలు....

సిగరెట్ పారేసి బయట మొదలైన వర్షాన్ని చూడసాగాను....

ఆమె మోసపోయింది. నరకంలో వచ్చి పడింది. ఎలా భరిస్తోందో, ఎందుకు భరిస్తోందో ఆశ్చర్యంగా వుంది. నన్ను చూస్తే చిరునవ్వు నవ్వేది. అది మర్యాదకోసమో, తన అవస్థని చూడమనో అర్థమయ్యేది కాదు.

ఇంటికి నా రాకపోకలు పెరుగుతున్నకొద్దీ ఆమె నాకు సన్నిహితం కావాలని ప్రయత్నించేది. రకరకాల చర్యలతో నన్నాకర్షించాలని తపించేది... నాకదంతా కొత్తగా, థ్రిల్ గా అనిపించేది. నేనెవర్నీ ఆకర్షించాలని వెర్రి ప్రయత్నాలు చేయలేదు. నన్నూ ఎవరూ ఆకర్షించడానికి సాహసించలేదు. నేను తిరిగే సర్కిల్ అలాంటిది. అప్పుడీ సరోజతో వింతగా అనిపించేది....

అలా నాకు తెలియకుండానే నేనామెకు దగ్గరయ్యాను, స్నేహితునిగా. అయితే ఆమె ఏనాడూ తన దుస్థితి నాకు చెప్పుకుని ఏడ్వలేదు. అది నాకు బాగా తెలుసన్నది ఆమెకు తెలుసు. ఆమె వ్యక్తిత్వం నన్ను బాగా ఆకర్షించింది. నాకామెపై చాలా సానుభూతి వుండేది. కష్టాలు పడ్డవాడికే పడేవారి మనసు తెలుస్తుంది.... అలా వారాలు గడిచి, కాలం నెలల్ని మింగేస్తూంటే, క్రమక్రమంగా ఆ స్నేహం గాఢమైన ప్రేమగా మారిపోయింది....

ఆమె పరిస్థితి నేనర్థం చేసుకోగలను. ప్రేమ, లాలన ఆమెకు కరువయ్యాయి. వాటికోసం ఎంత కాలంగానో

తపిస్తోంది. కానీ నేను.... నేనప్పుడే వాటి అవసరాన్ని గుర్తించాను! ఇంకా ఈ బ్రహ్మచర్యం క్షమార్హం కాదని పించింది....

అలా వారం క్రితమే ఆమె తన పాతివ్రత్యాన్ని, నేను నా బ్రహ్మచర్యాన్ని వదులుకున్నాం!

ఎప్పటిలా ఆ రోజు కూడా సాయంత్రం సిటీ పొలిమేరలు దాటి, వరంగల్ రూట్లో ఓ ఏకాంత ప్రదేశంలో మాట్లాడుకుంటూ గడుపుతున్నప్పుడు, ఆ కమ్ముకుంటోన్న కారుచీకట్ల మధ్య హఠాత్తుగా మా కారు ప్రణయ మందిరంగా మారిపోయింది....

అలా అనుకోకుండా జరిగిపోయిందానికి సినిమా హాల్లో మూల కూర్చుని ఏడుస్తూ ఆమే, పరిణామాలు ఆలోచిస్తూ ఉద్రేకంగా నేనూ వుండిపోలేదు. మళ్ళీ మళ్ళీ ఏకమయ్యాం. ఇంకా ఇంకా కావాలనుకున్నాం.

సురేష్—సరోజల జంటని ఇక ఈ ప్రపంచంలో ఏ శక్తీ విడదీయలేదని కలిసి బాస చేశాం.

ఈ వారంరోజులుగా అలా ప్రతీ సాయంత్రం కలుసుకుంటూనే వున్నాం. కానీ ఇవ్వాళ ఆమె ఇంటికాహ్వానించింది క్రొత్తగా. ఏమిటామె ఉద్దేశ్యం? భర్త ఊళ్ళో లేడని ధైర్యమా? అవును, నా బాస్ ఉదయమే కోయంబత్తూరు చెక్కేశాడు. ఎల్లుండిగానీ రాడు. సరోజ మార్పుని కోరుకుని వుంటుంది. ఆ ఇరుకు కారులో చెడ ఇబ్బంది పడిపోయి వుంటుంది. నాకూ అలా కార్లో అసహ్యంగానే వుంది. దాన్ని కక్కుర్తి అంటారు. నిజమైన ప్రేమికులు అలాంటి వాతావరణాన్ని కోరుకోరు!

అయిపోవచ్చిన సిగరెట్ని పారేసి ఆకాశంలోకి చూశాను. కుండపోతగా కురుస్తోంది వర్షం..నాకాందోళన

కలిగింది. ఇదెప్పుడు తగ్గుతుంది? నేనెప్పుడు పోవాలి? అసహనంగా వాచీ చూశాను, ఇంకో గంట నిట్టూర్చాను, ఆతృతని అణచుకుంటూ నేను చేస్తున్న పని ఎంతవరకు మంచిదని ఆలోచించసాగాను .... నా ఉద్యోగం, ప్రాణాలతో కూడా రిస్కు తీసుకుంటున్నాననిపించింది. ఇంతవరకు ఇదెవరికీ తెలియదు. నా బాస్‌కి కనుక తెలిస్తే నాకు చావు తప్పదు! కచ్చితంగా తప్పదు!

అయితే ఈ ప్రమాదం సరోజకి కూడా వుంది.

ప్రతిక్షణం కనిపెట్టాలి. ఆమెకు జాగ్రత్తలు చెప్పాలి. ప్రమాద సూచనలు కనిపిస్తున్నాయనగానే ఇద్దరంకలిసి ఎటైనా వెళ్ళిపోవాలి! అవును, ఆమె లేనిబ్రతుకు ఏం బ్రతుకు!

మా భవిష్యత్తు గురించి యివ్వాళ ఆమెతో మాట్లాడాలి.

ఇప్పుడామె ఇంటికి రమ్మందంటే జాగ్రత్తపడే వుంటుంది, ఆ ముసలి రాజయ్యా, చిన్నారీ తప్ప ఇంట్లో ఎవరూ వుండరు. రాజయ్యా అవుట్ హవుస్‌లో ఎనిమిది గంటలకే వెళ్ళి నిద్రపోతాడు. చిన్నారి కూడా తొందరగానే పడుకుంటుంది. ముసలి రాజయ్యా పడుకున్నాడంటే లేవడు. అతను చిత్రమైన వ్యక్తి. తనేమిటో, తన పనేమిటో, మిగతా ప్రపంచం గురించి అవసరం లేనట్లు వుంటాడు. ఆ వయసులో అలాటి మనస్తత్వమే వస్తుందేమో.

రాజయ్య మాత్రం నాకు బాగా నచ్చుతాడు. ఈ వయసులో కూడా అతడంతపనీ ఎలా చేయగల్గుతాడో ఆశ్చర్యంగా వుంటుంది. రాత్రయితేగాని విశ్రమించడు. పలకరిస్తే బోసినోరు తెరిచి ఎప్పుడూ నవ్వుతూంటాడు,

'తాతా' అని పిలిస్తే పరవశించిపోతాడు. ఆ మరుక్షణమే
అతడి ముఖం మ్లానమవుతుంది. అప్పుడిదే పాఠం చెప్తాడు.

మావోడు నన్నొగ్గేసి వెళ్ళిపోకపోతే బాబయ్యా,
నాకు నీ అంత మనవడుండీవోడు! తాతా అన్న పిలుపులో
ఎంత తీపి వున్నదో, నేను నోసుకోలేదు, బాబయ్యా...."

అప్పుడు నవ్వి నేనిలా అంటాను.

"నా చిన్నప్పుడే మా తాత తుపాకీ గుండు తగిలి
యుద్ధంలో చచ్చిపోకపోతే 'తాతా' నీ అంత వుండే
వాడు! తాతయ్య ప్రేమ నేనెరుగను. నువ్వు మనమడి
ముద్దెరుగవు. మనిద్దరం ఒకటవుదాం, ఏం?"

అప్పుడతని కళ్ళలో వాత్సల్యం కురుస్తుంది.

సరోజ కూడా అతన్ని అలాగే పిలిచి అభిమానంగా
చూసుకుంటుంది. ముసలి రాజయ్య లేని ఇల్లు ఇల్లు
కాదనిపిస్తుంది...

తేరుకుంటూ ఈ లోకంలోకొచ్చి మళ్ళీ టైము చూసు
కున్నాను. ఇక బయల్దేరడం మంచిదనుకున్నాను. లేచి
పైజామా విడిచేస్తూ బట్టలకోసం వెళ్తున్నప్పుడు, వర్షం
తగ్గుముఖం పట్టినట్లనిపించింది....

## 2

ఆటో దిగి గేటుతీసుకుని చకచకా లోపలికి నడిచాను.

వర్షం ఇప్పుడు పూర్తిగా వెలిసింది. కానీ కింద ఇంకా
కాలవలుగట్టి నీళ్ళు పారుతూనే వుంది. వేగంగా మేడ
వైపు కదుల్తూ, తోటలో యెడమవైపు చూశాను.
దూరంగా అవుట్ హవుస్ తలుపువేసి చీకటిగా కనిపి
స్తోంది. చలికి అప్పుడే ముసుగుదన్ని పడుకుని వుంటాడు
ముసలి రాజయ్య.

ఇంట్లో లైట్లు కనిపిస్తున్నాయి. వరండాలో ఆమె

కన్పిస్తోంది.

పరుగెత్తుకెళ్ళి వరండాలో యెక్కాను.

ఆమె ముందుకొచ్చి, "తడిసిపోయావా?" అనడిగింది.

"లేదు....తడిసినా లెక్కచెయ్యను .... కానీ నువ్వు చంపేశావు!" అన్నాను. ఆమె భుజం చుట్టూ చెయ్యి వేసి లోపలికి నడుస్తూ.

ఆమె నా నడుము చుట్టూ చెయ్యివేసింది. "నువ్వొక్కడివే యెలా చస్తావు, నిరీక్షణ ఇద్దరిదీ!" అంది నవ్వుతూ.

"ఓహ్, అయితే తమరేం చేశారు?" అన్నాను, సోఫాలో కూలబడుతూ. ఆమె తలుపువేసి వచ్చి నా పక్కన కూర్చుంది. జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి లాగింది. కళ్ళలోకి చూస్తూ నవ్వింది.

"నేనేం చేస్తాను! రికార్డులు పెట్టుకొని విరహగీతలు విన్నాను....మరి తమరు?"

"సిగరెట్లు రెండు పెట్లు ఖర్చుచేశాను. నా ఆయుష్షు నిమిషంన్నర తగ్గించుకున్నాను...."

"నువ్వెప్పుడు ఆయుష్షు, చావు....యెందుకలా మాట్లాడతావు?"

"ఓహ్, అలా మాట్లాడేస్తున్నానా? నాకు తెలియకుండానే అవి ఊతపదాలయ్యాయన్నమాట! మానేస్తాను. నా భాషను ఇంప్రూవ్ చేసుకుంటాను, ఓ.కే?"

ఇద్దరం మేడమీదికి చేరుకున్నాం. బెడ్‌రూంలో ప్రవేశం.

అప్పుడామె అప్సరసలా కన్పించింది. పాతికైనా దాటని ఆమె శరీర సౌష్టవాలు నన్ను ఉన్మత్తుడ్ని చేశాయి! గాఢంగా పెనవేసుకుని అందిన చోటల్లా

పెదాలతో దాడిచేశాను....ఆమె కూడా ప్రతి స్పందించి నా నిలువెల్లా విద్యుత్తరంగాల్ని పంపింది....

కాలం కొన్ని క్షణాలు స్థంభించింది.

విడిపడి బెడ్ దగ్గర కెళ్ళాం. దానిమీద కూలబడ్డాం.

"నిన్నొదలడమంటే బ్రతుకును చాలించుకోవడమే, సరోజా!" అన్నాను ఆమెని లాక్కుంటూ.

"నిన్నొదిలి నేనుంటానా....? నువ్విస్తున్న అనుభవం ఎప్పుడూ పొందలేదు, సురేష్!"

"ఎందుకు పొందలేదు....?"

ఆమె మాట్లాడలేదు. మాట్లాడలేకపోయింది.

నాకనుమానం వేసింది. ఒకవేళ నా బాస్ ఇంపోటెంట్ కూడా కాదుకదా? కాదు, కాదు, సంతానాన్ని కన్నాడు అయితే ఈమెని క్రూరంగా, రాక్షసంగా హింసించి తనకాక్కావల్సిన తృప్తిని పొందుతూ, ఆ అనుభవమంటేనే భయం అసహ్యం కల్గించి వదిలాడన్న మాట....నిజంగా బాస్టర్డే!

"నువ్వెందుకింకా అతన్ని అంటి పెట్టుకొనుంటున్నావు?"

"ఏం చేయను?"

"ఏమైనా చేయగలవు. నీ సవతులు సనాతన భావాలుగల కుటుంబస్త్రీలు కావచ్చు. కానీ నువ్వు ఆధునిక భావాలుగల యువతివి. ఏమైనా చేయగలవు. అతని మొహాన ఉమ్మేసి పోగలవు."

"ఎక్కడికి పోను....అనాథని."

ఆమె భుజాలుపట్టి వూపాను. "నువ్వు నిజం చెప్పు, అనాథవైతే ఇతన్ని కట్టుకోకముందు ఎలా వున్నావు? ఎక్కడున్నావు? ఇప్పుడు విడిచిపెట్టాలంటే ఎందుకు

భయం? నీకతని డబ్బుమీద కన్నుందికదూ? దానికోసమే ముసలాడితో మూడో పెళ్ళాంగా సిద్ధపడ్డావు! దానికోసమే ఇన్ని బాధలూ భరిస్తున్నావు!"

ఆమె తల వంచుకుని చిన్నగా అంది. "కావచ్చు, నేను చాలా దారిద్ర్యాన్ని చవిచూశాను. దాని రుచి నువ్వెరుగవు! ఇప్పుడు కోరి కోరి మళ్ళీ దాన్నాహ్వానించలేను. ఆ బీదరికంకంటే ఈ హింస అనుభవించడమే నయం!"

నేనింకా దూరం వెళ్ళదలచుకోలేదు. "మన గురించి ఏం చేద్దామని అనుకొంటున్నావు?" అడిగాను.

"ఇంకా నే నేమీ అనుకోలేదు."

"ఇలా ఎంతోకాలం సాగలేం. బయటపడకముందే దారి చూసుకోవాలి. లేదా చావు తప్పదు మనకి....నీ భర్త కనీసం చంపకుండా వదలడు! అంత చండశాసనుడు. ఇలా మనం కోరికలవరకే పరిమితంకాకుండా, నిజంగా మనం ఒకరికొకరు తోడూనీడగా కావాలనుకుంటే సరోజా, వెంటనే ఇక్కడ్నించి వెళ్ళిపోవడం మంచిది! నిన్ను మనసారా కోరుకుంటున్నాను. నీవులేని బ్రతుకు వూహించలేను. కానీ....చిన్నారి గురించే నేను ఎక్కువ వర్రీ అవుతున్నాను. ఆమె వంటరి అవుతుంది. ఏమవుతుందో వూహించలేం. మన సుఖంవరకే చూసుకోవడం అన్యాయం. కానీ ఆమెని తీసుకెళ్ళే హక్కు మనకుందా? లేదు! ఇదే నాకు చిక్కు సమస్యగా వుంది, సరోజా!"

"నీకోసం ఈ ఐశ్వర్యమంతా వదులుకుని రావడానికి సిద్ధంగా వున్నాను, సురేష్. నామీద నమ్మకముంచు. ఐశ్వర్యం నువ్వూ సంపాదించగలవు. కానీ ప్రేమ నేను

ఎక్కడ సంపాదిస్తాను? చిన్నారినీ వదులుకోలేను. దానికి తండ్రి దగ్గర రక్షణలేదు. అసలు చేరికలేదు. నేను పోతే అది వుండలేదు. దాని గురించి నాకూ బాధగా వుంది...."

"అందుకే ఏం చేద్దామంటావు? చిన్నారి మనకెలా దక్కుతుంది?"

"ఒకవేళ అది అనాధ అవుతే...."

"ఏమిటీ....ఏమి టేమిటీ...."

"తండ్రి కూడా చచ్చిపోతే ...."

"సరోజా!" ఆమెని పట్టి వూపాను, "సరోజా! ఏమిటి నువ్వన్నది? తండ్రి కూడా చచ్చిపోతే....గాడ్, నీకు మతిపోయిందా? తెలివిలో వుండి మాట్లాడు తున్నావా?"

ఆమె మాట్లాడలేదు.

ఛళ్ళున తెరచుకుంది తలుపు—అప్పుడు హఠాత్తుగా.

"నువ్వా....!!! నా గదిలో....!!!" అతను లోపలి కొస్తూ, గది దద్దరిల్లిపోయేలా అరిచాడు.

## 3

ఆకాశంలో ఉరుములూ, మెరుపులూ ప్రారంభ మయ్యాయి—

కొన్ని క్షణాలు ఏం జరిగిందో నాకర్థంగాలేదు.

కాకతాళీయమా? కల్పించబడిందా?

ఇప్పుడేదీ ఆలోచించడానికి సమయంలేదు.

అతడు ఉద్రేకంతో వూగిపోతూ రెండు చేతుల్తో నా గొంతు పుచ్చుకున్నాడు. కళ్ళెర్రజేస్తూ గర్జనచేశాడు. "నిన్ను చంపుతాను!"

నేనాలస్యం చేయలేదు. శక్తినంతా కూడదీసుకుంటూ

అతన్ని కిందపడదోసి మీదెక్కి కూర్చున్నాను.

"నువ్వే చావు బాస్టర్డ్!" అన్నాను కసిగా, ఒక చేత్తో అతని గొంతు పుచ్చుకొని, మరోచేత్తో టీపాయ్ మీది ఫ్లవర్ వేజ్‌ని అందుకుంటూ, "చచ్చిపో! నీ తల్లి చెడ్డపని భార్యల్ని హింసిస్తావా? నీకు తల్లి దగ్గర లేని ప్రేమ కట్టుకున్న ఆలితో చూసి తరించాలిరా మూర్ఖుడా! ఆడదాని ప్రేమకి — అదే రూపంలో వున్నా సరే — మరేదీ ప్రపంచంలో సాటిరాదని తెలుసుకో మరు జన్మకైనా, మగవాడా! నీ డబ్బూ దర్పం అన్నీ దాని ముందు దిగదుడుపే!"

నా చేతిలో ఫ్లవర్ వేజ్ అతడి తలమీద బలంగా పడింది. గట్టిగా మూల్గి కళ్ళు మూసుకున్నాడతను. అది నా చేతిలోంచి జారిపోయి దూరంగా వెళ్ళి పడింది. నేను దాన్ని అందుకుంటూండగా, కింద ఒక్కసారి కాలింగ్ బెల్ మోగింది.

సరోజ బెడ్ దిగి భయవిహ్వలఅయి చూస్తోంది.

ఆయాసం తీర్చుకుంటూ, "రాజయ్య కావచ్చు, వెళ్ళి అతన్ని పంపెయ్యి!" అన్నాను.

ఆమె మరబొమ్మలా పరుగుతీసింది బయటికి.

నేను కదలకుండా పడివున్న రావ్‌ని చూసి, కిటికీ దగ్గరకురికి కింద అవుట్ హవుస్ కేసి చూశాను. లైటు వెలగడంలేదు. తలుపు తీసి వుందో, మూసి వుందో కన్పించడంలేదు, చెమట తుడుచుకుంటూ, ఇంకా అలాగే పడివున్న రావ్‌ని చూసి బయటికి పరుగుతీశాను. ఆ వచ్చిందెవరో చూడాలి! బయటినుంచి గది తలుపు గడియవేసి, వేగంగా మెట్లకేసి వురికాను.

కిందికి దిగుతూ చివరి మెట్టుమీద అప్రయత్నంగా

ఆగిపోయాను. గోడచాటుకి జరిగి హాలులోకి తొంగి చూశాను. సరోజ అప్పుడే తలుపుతీసింది. భయపడిపోయి వెనక్కి రెండడుగులు వేసింది.

టార్చి పట్టుకుని ఎవరో ఇరవై ఏళ్ళ కుర్రాడు లోనికి జొరబడ్డాడు.

వాడు నల్లగా, బక్కగా వున్నాడు. వాడికి పెద్ద జుట్టు వుంది. అది ముఖంమీదా, భుజాలమీదా, చెవుల మీదా పడుతోంది, దువ్వుకోక, నూనెలేక అసహ్యంగా వుంది. వాడి బట్టలు బాగా మాసి వున్నాయి. కాళ్ళకి హవాయి చెప్పులున్నాయి. వాడి కళ్ళు చురుగ్గా, చుంచెలుకలా చూస్తున్నాయి. వాడి ఎండిన పెదవులమీద మందహాసం వుంది....

పళ్ళికిలించి వాడు, "హిహ్హి—అక్కయ్యా—గుర్తు పట్టావా?" అన్నాడు.

వాడి పళ్ళు వాడిగా, గారపట్టి వున్నాయి.

వాడి గొంతు పిట్ట అరిచినట్టు కీచుగా వుంది. వాణ్ని సరిగ్గా జాడించి తంతే దూదిబస్తాలా ఎగిరిపోయేలా వున్నాడు.

వాడి మాటలు విని సరోజ ఉలిక్కిపడడం గమనించాను.

గిర్రున తిరిగి ఆమె చుట్టూ చూసింది. ఎవరూ లేరని నిర్ధారించుకొని వాడివైపు తిరిగింది. అలా చుట్టూ చూసినప్పుడామె ముఖం కందగడ్డలా వుంది. ప్రాణాలు కళ్ళలోంచి ఎగిరిపోతున్నట్లుగా వున్నాయి చూపులు.....

"నువ్వా! నువ్విక్కడికెలా వచ్చావ్?"

ఆమె మాటలు బలహీనంగా అస్పష్టంగా వున్నాయి.

వాడు మరో నవ్వు నవ్వాడు. "నిన్ను వెతుక్కుంటూ

వచ్చానక్కా!" అన్నాడు.

నేను ఉలిక్కిపడి మేడమీదికి చూశాను. పైన ఏ చప్పుళ్ళూ లేవు. రావ్ ఇంకా లేవలేదు....

"వెళ్ళిపో ఇక్కడ్నుంచి! వెళ్ళిపో!" సరోజ అంటోంది చేత్తో తలుపువైపు చూపిస్తూ.

వాడు కదిలి మరింత ముందుకొచ్చాడు, కుతూహలంగా చూస్తూ.

"ఏమిటక్కా, ఎందుకలా భయపడతావ్? నేనెవర్న నుకుంటున్నావు? నీ తమ్ముడ్నే — నాగేష్ని —"

"ఓహ్, నిన్నిలా చూడలేను! నువ్విక్కడికి రాకూడదు! వెళ్ళిపో ఇక్కడ్నుంచి!"

వాడు నవ్వాడు టార్చిని వూపుతూ. "పో అక్కా ప్రేమలేదనకు!"

"నిన్నెప్పుడో మర్చిపోయాను, నాకు గుర్తులేవు పో! నాకు నువ్వు లేవు! ఇంకెప్పుడు నీ ముఖం చూపించకు, వెళ్ళిపో ఇక్కడ్నుంచి!"

సరోజ ఆవేశంతో వూగిపోతోంది.

వాడు పళ్ళికిలించాడు, "ఓసహో, నామర్దానా? ఇప్పుడు నీ హోదా పెరిగింది గనుక నన్ను చూడలేవు! మహారాణివి అయిపోయావే .... నిన్నిలా చూస్తానని వూహించలేదు. ఇన్నేళ్ళూ నిన్ను వెతకని చోటులేదు. ఎన్నేళ్ళయిందక్కా, నన్ను వదిలిపెట్టిపోయి? ఎనిమిదేళ్లు అంతేనా? ఎనిమిదేళ్ళలో నువ్వెంత మారిపోయావక్కా!"

"పోతావా లేదా ముందిక్కడ్నించి—"

వాడు మరో నవ్వు నవ్వాడు. "నన్నిలా చూసి అసహ్యించుకుంటున్నావు. కానీ నీకు గుర్తుందా అక్కా, కూటికి కరువై బజార్లోపడి డబ్బు! డబ్బు! డబ్బు! అని

తిరుగుతున్నప్పుడు, చిటికలేసిన ప్రతివాడికీ ఎలా కావ్ఛ జా పేదానివో!...అప్పటి నీ జీవితం ఏమిటో!...తలచుకో! ఇప్పుడు మహా పతివ్రతలా మాట్లాడేస్తున్నావే...."

అంతవరకూ నేనెలాగో అణచుకోగల్గాను. ఇక ఆపుకోలేకపోయాను. గోడచాటునుంచి ఒక్క పరుగున వెళ్ళి, పిడికిలితో బలంకొద్దీ వాడి దవడమీద మోదాను. వాడి చేతిలో టార్చి ఎగిరిపోయింది. వాడు కిందపడ్డాడు. వాడి జుట్టు పట్టుకొని లేపి గిరిగిరా తిప్పి మెడమీద ఒక దెబ్బ వేస్తూ వదిలేశాను. వాడు కాగితం విమానంలా వెళ్ళి గది తలుపులకి ధడాలున కొట్టుకొని కిందపడ్డాడు. నేను నాలుగు గంతుల్లో వెళ్ళి వాడి డొక్కలో తన్నాను. తన్నసాగాను. కసిదీరా తన్నసాగాను....

"వెధవా! అక్కతో అలాగేనా మాట్లాడతావూ?"

సరోజ పరుగెత్తుకొచ్చి నా చేతులు పట్టి వెనక్కి లాగింది. "అయ్యయ్యో....సురేష్! వాడ్నొదిలెయ్యి—"

ఆమె లాక్కుంటూ తీసికెళ్ళి నన్ను సోఫాలో కూలేసింది. నేనామెని నెట్టేసి లేవబోయాను, ఆవేశం ఇంకా హెచ్చి.

"సురేష్! సురేష్! ఓహ్, తేరుకో! అలా రెచ్చిపోకు!" ఆమె నన్నాపుతూ కదలకుండా పట్టుకుంది. ఆందోళన పడిపోతూ తిరిగి నన్ను సోఫామీదికి నెట్టింది.

నేను కూర్చుని ఆవేశం అణచుకుంటూ చూశాను.

"ఆ వెధవని చంపుతాను! చంపి నిద్రపోతాను!"

"వద్దు, సురేష్! వాడ్నొదిలెయ్యి!

వాడు నెమ్మదిగా లేస్తున్నాడు, కడుపు పట్టుకొని, బాధని అణచుకుంటూ, జుట్టును పైకి తోసుకుంటూ లేచి నిలబడ్డాడు. హాలులో కలయజూసి, చెరో మూల పడ్డ

చెప్పుల్ని కుంటుతూ వెళ్ళి తొడుక్కున్నాడు. కిందపడి అద్దం పగిలిన టార్చిని అందుకున్నాడు.

అప్పుడు ఆకస్మాత్తుగా నావైపు తిరిగి పళ్ళికిలించాడు, దగ్గరికొస్తూ.

"హాలో, లవర్ బాయ్! నువ్విక్కడే వున్నావని తెలీదు! బాగున్నావే....బలే దెబ్బతీశావే...."

"బాస్టర్డ్, ఇప్పుడు చస్తావ్ —"

చటుక్కున లేవబోయాను, సరోజ ఆపింది.

వాడు పళ్ళికిలించాడు. "లవర్ బాయ్, నువ్వు కొంచెం తగ్గు. తగ్గటం నీ ఒంటికి మంచిది. తన్నటం హీరోయిజమ్ అనుకుంటున్నావా? ఇప్పుడే తెలుసుకుంటావు మనిద్దర్లో మొనగాడెవరో...."

వాడు జేబులోంచి ఏదో తీస్తున్నాడు.

నేను ఉలిక్కిపడి మెట్లవైపు చూశాను. పైన ఏమీ చప్పుళ్ళు లేవు. నా మనసులో ఆందోళన పసిగట్టి సరోజ బెదురుగా నా చెయ్యి పట్టుకుంది. మెట్లవైపు రెప్పవేయకుండా చూసింది. అతడింకా లేవలేదా? లేస్తే బయటికి రాలేడు. తలుపు బయట గడియవేశాను. కానీ కిటికీ వుంది! అందులోంచి బాల్కనీలోకి దిగవచ్చు.... గాభరాగా నేను హాలు తలుపువైపు చూశాను....ఏ క్షణాన బయటనుంచి ఆంబోతులా జొరబడతాడో....?

వాడు జేబులోంచి దాన్ని తీసి విప్పుతున్నాడు. ఆ కవరులోంచి మూడు సరికొత్తగా వున్న ఫోటోలు నా మీదికి విసిరాడు.

"చూడు, లవర్ బాయ్! నీ టెంపరేచర్ జీరోకి దిగకపోతే అప్పుడను!"

నాకేమీ అర్థంగాలేదు. ఆ ఫోటోల్ని తికమకగా

చూస్తూ అదిరిపడ్డాను. సరోజ వాటినందుకొని చూసి, చటుక్కున వదిలేసి కళ్ళు మూసుకుంది.

"చూశారా? ఎలా వున్నాయి?" వాడు హేళనగా చూస్తున్నాడు, ఎలా వుంది వంట్లో? లవర్ బాయ్, బలే మజా చేసుకున్నారులే! కారులో మంచి ఫోజు లిచ్చారు లవర్స్ ఇద్దరూ కలిసి! కాస్త కష్టపడ్డా చక్కగానే తీశాను .... మీకాకారే దొరికిందా వేడి చల్లార్చుకోడానికి?"

వాడేమంటున్నాడో నేను విన్పించుకోవడం లేదు. నా ఆవేశమంతా దిగిపోయి వళ్ళు చల్లబడిపోయింది. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది .... సరోజ సిగ్గుతో సోఫాలో ఓ మూల ఒదిగి కూర్చుంది, తలదించుకుని. వాడు మమ్మల్ని తమాషాగా, వెటకారంగా చూస్తున్నాడు .... నన్ను నేను సంభాళించుకుంటూ గుటకలు మింగాను. ధైర్యం తెచ్చుకున్నాను.

"ఇప్పుడు నీకేం కావాలి, వెధవా?" అడిగాను, వాడి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ నా చెవులు పైన శబ్దాలకోసం నిక్కబొడుచుకొని వున్నాయి.

వాడు సంతోషంగా మాశాడు. "అలా అడుగు. లవర్ బాయ్. నాకు డబ్బు కావాలి... రెండు లచ్చలు."

వాడ్నలాగే చూస్తూ అన్నాను. "రెండు లక్షలు కాదురా లుచ్చా, నా దగ్గర రెండు నయాపైసలు కూడా లేవు."

వాడు భుజాలెగరేశాడు, "నిన్నడగడం లేదు! అక్కయ్య ఇస్తుంది!"

"ఆమె దగ్గరా లేదు!"

"అయితే అవి బావగారికి చేరుకుంటాయి...."

"విధవా, నీకో సంగతి చెప్పనా? ఇదెప్పుడో నీ బావగారికి తెలిసిపోయింది! నువ్వాలస్యంగా తగలడ్డావు! వెళ్ళి ఆయన్నే అడుక్కో పో!"

వాడు నమ్మలేనట్లు చూసి, వెంటనే కోపంగా అన్నాడు. "లేదు లవర్ బాయ్, ఈ బుకాయింపులూ ఎత్తులూ మనకొద్దు! డీల్ క్లీన్‌గా వుండాలి. ఇప్పుడు నీ బుర్ర కేదీ తోచదు. రేపుదయంవరకు ఆలోచించుకునేందుకు టైమిస్తాను. మీరిద్దరు బాగా ఆలోచించుకోండి. ఏం చెప్తావో నే చెప్పినచోటికి వచ్చి చెప్పు. దిల్ సుఖ్ నగర్ బస్ డిపో ఎదురుగా రవూఫ్ కేఫ్‌కి, ఉదయం పదకొండు గంటలకి, సరేనా? నేనక్కడుంటాను...."

వాడు సమాధానంకోసం చూడకుండా, టార్చి వూపుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

నేను భారంగా నిట్టూర్చి ఫోటోలు మడిచి జేబులో పెట్టుకున్నాను. సరోజని చూశాను. ఆమె ఇంకా అలాగే కూర్చుని వుంది.

లేచి దగ్గరకెళ్ళి, ఆమె గెడ్డం పుచ్చుకు తల పైకెత్తాను.

"నీ గురించి వాడన్నది నిజమేనా?"

ఆమె బదులు చెప్పలేదు, నోరు విప్పలేదు. కళ్ళు మూసుకుంది.

ఆమె భుజంపట్టి లేపాను. "పద! ఇక మర్చిపో! వింటున్నావా? గతాన్ని పాతిపెట్టెయ్యి!"

"ఓహ్ సురేష్, నన్నిప్పుడు వొదిలెయ్యవు కదూ?"

"నన్ను నమ్ము. నాకు నీ గతం కాదు, వర్తమానం కావాలి."

ఆమె నిట్టూరుస్తూ నాతో వచ్చింది. పైకి మెట్లెక్కసాగాం.

"ఇప్పుడెక్కడికి?"

"అతన్ని చూద్దాం!"

"నాకు భయమేస్తోంది!"

"చూడక తప్పదుగా?"

గుండె అదురుతోంటే ఆ గది ముందాగి తలుపుకు చెవి ఆనించాను. లోపల ఏ శబ్దమూ లేదు. తలుపుకెక్కడా రంధ్రంలేదు చూడటానికి. వణుకుతున్న చేత్తో గడియతీసి, తలుపు చిన్నగా నెట్టాను. పూర్తిగా తెరచి ఊపిరి బిగబట్టాను.

అతను రక్తం మడుగులో పడివున్నాడు.

## 4

"సురేష్! ఏమిటిది, సురేష్? ఎంత పనిచేశావు!"

ఆమెని విడిపించుకుంటూ, అతన్ని సమీపించాను. అక్కడ కూర్చుని చెయ్యి ముట్టుకున్నాను. నాడీ ఆడడం లేదు. తల పక్కకు తిప్పి చూశాను. అక్కడ కణత దగ్గర గాయముంది. చాలా రక్తం పోయింది....తల చుట్టూ మడుగు కట్టింది.

కొంతదూరంలో పడివుంది ఫ్లవర్ వేజ్. దాన్ని లేపినప్పుడు అది బాగా బరువుంది. ఇత్తడిది. దాని దెబ్బకి తల పగలక వుండదు! నేను బలంగానే కొట్టాను....రావ్ అప్పుడే చచ్చిపోయి వుండాలి! స్పృహ తప్పాడనుకున్నాను—తర్వాత నెమ్మదిగా బ్లీడింగ్ జరిగింది!

అప్పటికిగానీ నేను తెలుసుకోలేదు, ఆ ఆవేశంలో ఏంచేశానో! నా వళ్ళంతా చెమటపట్టేసింది! కంపిస్తున్న శరీరాన్ని అతికష్టంమీద అదుపులో పెట్టుకున్నాను. ఆలోచనలు కలగాపులగంగా ముసురుకుంటున్నాయి.....

ఓ గాడ్, రావ్‌ని చంపేశాను.

ఇతనికి శాస్తి చేయాలనుకున్నాను గానీ, ఇలా చేస్తాననుకోలేదు! ఇప్పుడేం చేయాలి?

"సురేష్, ఎంత పని చేశావు! ఆయన్ని చంపేశావా!" ఆమె నన్ను పట్టుకొని వూపింది.

"చంపకపోతే మనల్ని చంపేస్తాడు, పిచ్చిదానా! నువ్వు చస్తావా?" కసిరాను అసహనంగా.

"నేనిలా జరుగుతుందనుకోలేదు!"

"ఎందుకనుకోలేదు? చిన్నారి అనాథ అవుతే....అని అనుకున్నావుగా? ఇప్పుడు అయ్యింది చూడు!" నవ్వాను పిచ్చిగా, ఆమె భయపడింది, "వెరీ వెల్! ఇప్పుడు నా సమస్య తీరింది! చిన్నారిని మనం స్వేచ్ఛగా తీసికెళ్ళిపోవచ్చు....ఎంత మంచి జరిగింది!"

"ఇప్పుడేం చేయాలి? ఇతన్నేం చేస్తావు?" ఆమె అరిచింది.

నేను తేరుకొని తేలికపడ్డాను. ఒక సిగరెట్ తీసి వెల్గించాను, "కాకతాళీయం కాదు, కల్పించబడింది. నీ భర్త కోయంబత్తూరు వెళ్ళలేదు, బుకాయించాడు. మన సంగతి ముందే కనిపెట్టాడు. మనల్ని పట్టుకోడానికా బూటకపు ప్రయాణంతో నమ్మించాడు. అప్పుడిలా వూడిపడ్డాడు!"

"మరి పగలంతా ఎక్కడున్నాడు?"

కళ్ళు చిట్లించి నేను శవాన్ని చూశాను. దాన్ని సమీపించి జేబులన్నీ వెతికాను. కొన్ని నోట్లు, చిల్లరా, కర్చీఫ్, పెన్నూ, కళ్ళద్దాలు, సిగరెట్ ప్యాకెట్, లైటరూ, ఒక తాళంచెవి రింగూ వున్నాయి.

ఆ రింగు నన్నాకర్షించింది. అందులో ఒక చేకీ

వుంది. దానికి వేలాడుతున్న టాగ్ మీద పేరు ముద్రించి వుంది. దానికింద ఒక అంకె వుంది.

దాన్నామెకు చూపిస్తూ అన్నాను.

"హోటల్ మార్య, రూం నెంబర్ 98...."

"హోటల్లో గడిపాడా?"

"ఇంకెక్కడ గడుపుతాడు? సూట్ కేసుతో వెళ్ళాడు అదక్కడే వదిలి వచ్చి వుంటాడు. ఇవ్వాళ కూడా మనం బయటే కలుసుకుంటే నా...."

"ఇప్పుడేం చేద్దాం? ఏమిటిదారి?"

"అలా కంగారు పడకు, ఆలోచించుకోనీ!"

"చూడలేకపోతున్నాను, ఓహ్! పూడ్చేద్దాం పద! వర్షం పడింది. నేల వదులుగా వుంటుంది....తోటలో తవ్వి పాతేద్దాంపద!"

కిటికీ దగ్గర కెళ్ళి నేను బయటికి చూశాను. థాంక్ గాడ్! ఈ గొడవంతా రాజయ్యకి తెలియదు. సిగరెట్ పీలుస్తూ అలాగే చూస్తూండిపోయాను....

పూడ్చిపెట్టే ఆలోచన నాకు నచ్చలేదు. ఈ పరిసరాల్ని డిస్టర్బ్ చేయకూడదు. అదెప్పటికైనా ముప్పు. మరోచోట, మరెక్కడైనా ప్రతిష్ఠించాలి శవాన్ని. శవాల్ని తొక్కిపట్టినకొద్దీ పైకి తన్నుతాయి. అప్పటి కప్పుడు మాయోపాయాలతో ప్రదర్శనకు పెట్టేయాలి. ఎప్పుడేం జరుగుతోందన్న భయాందోళనలు తప్పతాయి. అందరికంట పడేలా, చావు వెంటనే చాటింపైపోయాలా చేస్తే ఏ బెడదా వుండదు. పూడ్చిపెడితే మనిషి అయిపు గురించిన అనుమానాలు బయలుదేరతాయి..అక్కడ్నుంచి మొదలవుతుంది హంతకుడి పతనం!

వెల్, మిస్టర్ బి.జె.పి. రావ్, అయాం సారీ. మరు

జన్మంటూ వుంటే, మనం మళ్ళీ కలుసుకుంటే, అప్పుడు నీ చేతుల్లోనే నా ప్రాణాలు పోవాలని కోరుకుంటాను. ఈ జన్మలో నీ దౌష్ట్యానికి ఇలా నా చేతుల్లో నీ ప్రాణాలు తీయక తప్పలేదు, క్షమించు. ఇప్పుడు నీ దేహానికే అపచారం జరిగినా మన్నించు. తర్వాత నీకు ఘనంగా శాస్త్రోక్తంగా అపర క్రియలు జరిపిస్తాను.

చటుక్కున ఆమె దగ్గరికి కదిలి, "నాకో ఆలోచన వచ్చింది, సరోజా!" అన్నాను.

"ఏమిటది?"

"అది నీకు తెలియకుండా వుంటే మంచిది. లేకపోతే కన్ఫ్యూజ్ అయి కలగాపులగం చేస్తావు అంతా. పోలీసులొచ్చి అడిగితే నీకేమీ తెలియదని చెప్పాలి, అంతే. అర్థమైందా? అతను కోయంబత్తూరు వెళ్ళిన సంగతే నీకు తెలుసని చెప్పాలి. అంతకుమించి ఇంకేమీ చెప్పవద్దు, తెలిసిందా?"

"పోలీసులొస్తారా!" అందామె బెదిరిపోతూ.

"అలా బెదరకు! అవును, వస్తే ఏమిటి? రొటీన్‌గా కొన్ని ప్రశ్నలేస్తారు. నిన్నెందుకు అనుమానిస్తారు? పిచ్చి భయాలు పెట్టుకొని గట్స్ పోగొట్టుకోక! ధైర్యంగా వాళ్ళడిగిందానికి చెప్పు. వాళ్ళనలా ఆపి, నాకు ఫోన్ చెయ్. నేనొచ్చి అక్కడ్నించీ చూసుకుంటాను...."

ఆమె రెప్ప వేయకుండా చూడసాగింది.

"ఇక పద! నేను శవాన్ని మోసుకొస్తాను, నువ్వు కారు డిక్కీ తెరువ్!"

ఆమె తేరుకొని కదలబోయింది. నేను చటుక్కున ఆమె జుట్టులోంచి కొన్ని వెంట్రుకలు పీకాను.

"అబ్బా... ఏమిటిది?" అందామె బాధగా.

"ఏమీలేదు....నీకు లిప్‌స్టిక్ అలవాటుంది కదూ?" అడిగాను డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరికి కదుల్తూ దానిమీద కాయితంలో ఆ వెంట్రుకల్ని చుట్టి జేబులో పెట్టు కున్నాను. సొరుగులాగి అందులోంచి ఒక లిప్‌స్టిక్‌ని అందుకున్నాను.

ఆమె దగ్గరకెళ్ళి విచిత్రంగా చూస్తున్న ఆమె పెదాలకి దాన్ని పూసి, "ఇక అతన్ని ముద్దు పెట్టుకో!" అన్నాను.

"ఏమిటీ!"

"చెప్పినట్టు చెయ్, ప్లీజ్!" ఆమెను లాక్కెళ్ళి శవం దగ్గర కూర్చోబెట్టాను. "కంఠం కింద....ఒకటే ముద్దు.. కమాన్!"

ఆమె చటుక్కున వంగి పెట్టింది.

"గుడ్!" ఆమెని లేపుతూ జడలోని మల్లెదండ తీసు కున్నాను, దాన్ని కాగితంలో చూడుతూ, "ఇప్పుడొక సీసా, పాత గుడ్డలు, నీళ్ళు తీసుకురా!"

"ఎందుకు?"

"ఎందుకు, ఏమిటి, అనే ప్రశ్నలొద్దు! ప్రాక్టికల్స్ సక్సెస్ గావాలంటే ప్రొఫెసర్ చెప్పినట్టు అసిస్టెంట్ వినాలి, వెళ్ళు త్వరగా!" యుగంధర్‌లా నవ్వి అన్నాను.

అప్పుడు నాకాందోళన ఎగిరిపోయి, మనసు ఉల్లా సంగా అయింది.

అయిదు నిమిషాల తర్వాత ఆమె వాటితో తిరిగి వచ్చింది.

నేను సీసాలో కింద రక్తం ఎత్తిపోసి, అందులో నీళ్ళు కలిపాను కట్టిపడకుండా. మూత బిగించి జేబులో పెట్టుకొని, గుడ్డతో శవంమీద రక్తాన్ని శుభ్రంగా

తుడిచాను, నాకంటుకోకుండా. తర్వాత లేచి నిలబడ్డాను.

అప్పుడు ఆమె సహాయంతో శవాన్ని భుజాన వేసుకొని బయల్దేరాను. ఆమె వెంట వచ్చింది.

రావ్ చాలా బరువై పోయాడు. వంగి నడుస్తూ బయట గ్యారేజీ చేరుకున్నాను. ఆమె తాళంతీసి లోపలి కెళ్ళింది. డిక్కీ తెరిచింది.

నేను శవాన్ని తీసుకెళ్ళి జాగ్రత్తగా అందులో పడుకోబెట్టాను. అతని బూట్లకంటిన మట్టిని దులుపుతూ అన్నాను. "ఇప్పుడు శ్రద్ధగా విను! నీ భర్త వర్షం వెలిశాక వచ్చాడు....బయట బూట్ల జాడలు కూడా ఏర్పడతాయి. నేను తిరిగొచ్చాక అవన్నీ తుడిచెయ్యాలి. ఈలోగా నువ్వు బెడ్‌రూంని శుభ్రంచెయ్. రక్తాన్ని తుడిచి తడిగుడ్డల్ని ఎక్కడైనా దాచు. ఉదయం బాయిలర్‌లో పడేయ్. ప్లవర్ వేజ్‌ని కూడా తుడిచి పెట్టు, ఏమిటి? నీ లిప్‌స్టిక్ తుడుచుకో...."

ఆమె తలూపింది తుడుచుకుంటూ.

"ఇక కారెక్కు. దీన్నిక్కడ స్టార్టు చేయడం మంచిది కాదు. ముసలి రాజయ్య మేల్కొవచ్చు. నువ్వెక్కి స్టీరింగ్‌ని కంట్రోల్ చెయ్, నేను నెట్టుకుంటూ వస్తాను. బయట వీధిలోకెళ్ళాక దిగిపోదువుగాని....అలాగే తిరిగి వచ్చినప్పుడు కూడా చేయాలి."

ఆమె మళ్ళీ తలూపింది.

అయిదు నిమిషాల తర్వాత నేను వీధిలో కారు స్టార్టు చేసి దూసుకుపోయాను వేగంగా....

## 5

ఫోను గణగణ మోగుతోంటే బద్ధకంగా కళ్ళు తెరిచి చూశాను.

ముఖంమీద ఎండపడి చురుక్కున మండింది! కళ్ళు పూర్తిగా తెరిచి చూశాను. బాగా పొద్దెక్కిపోయింది. టేబుల్ మీద టైంపీస్ ఏడున్నర చూపిస్తోంది....

ఎంతోసేపు నిద్రపోలేదు. తెలతెలవారుతూండగానే అతికష్టంమీద నిద్రపట్టింది. ఇంతలో ఈ ఫోను—

లేచి దాన్నందుకున్నాను.

సరోజ గొంతు పలికింది ఉద్రేకంగా. "సురేష్, మీరు వెంటనే రండి!"

తేరుకొని, పోలీసులొచ్చారని గ్రహించాను. నిద్ర పూర్తిగా ఎగిరిపోయింది.

"హలో, దేనికి మాడమ్?" అడిగాను.

"ఓహ్, త్వరగా వచ్చేయండి! మీ బాస్‌కి ఏక్సిడెంట్ జరిగింది!"

"యాక్సిడెంటా! ఎక్కడ?"

"మీరు తక్షణం రండి, సురేష్! ఇక్కడికి పోలీసులొచ్చారు...."

"అలాగే, మాడమ్! వచ్చేస్తున్నాను...." ఫోన్ పెట్టేసి గబగబా తయారయ్యాను. గుడ్ గర్ల్! బాగానే ప్రవర్తిస్తోంది.

ఆటో ఎక్కి బయల్దేరుతూ నేను సరోజ గురించే ఆలోచించాను.... రాత్రి ఆమె గురించి చాలా తెలిసింది. నేను కారుతో తిరిగి వచ్చేశాక ఇల్లంతా చక్కబర్చాం. అప్పుడామె తన వెధవ తమ్ముడి గురించి అంతా చెప్పింది. ఆ జాట్టుపోలిగాడి కోసం ఆమె చాలా కష్టాలుపడింది. తల్లి చిన్నతనంలోనేపోయి, తండ్రి తాగి తాగి ఇల్లూ వళ్ళూ గుల్ల చేసుకుని చెక్కేసి, అక్కా తమ్ముళ్ళిద్దరూ దిక్కులేని పక్షుల్లా వీధిలో పడ్డారట.

విధిలేక పొట్ట పోసుకోవడానికీ, తమ్ముడి చదువు కోసమూ, తెలిసీ తెలీని వయసులో ఆమె కాలు జారిందట డబ్బుకోసం.

బుద్ధి పెరిగేదాకా ఆ సంపాదనే సుఖమనిపించి, అలాగే గడిపేసిందట కొన్నాళ్ళు. కానీ, తనని అర్థం చేసుకోని తమ్ముడు, తనూ జులాయి అయిపోతూంటే, చదువు మానేసి దమ్మిడీకి కొరగానివాడయిపోతూంటే, విడిచిపెట్టి మరో ఊరు వెళ్ళిపోయిందట తను.

అప్పుడు మనసు మారి, మంచి మార్గంలో బ్రతకాలనుకుని, తను నేర్చిన చదువుతో నల్గురు పిల్లలకి పాఠాలు చెపుతూ పొట్టపోసుకుందట.

అలా అలా ఆర్థికంగా నిలదొక్కుకొని, టైపూ షార్టుహేండూ పూర్తిచేసి ఉద్యోగ ప్రయత్నాల్లో పడిందట. రెండేళ్ళ క్రితం మచిలీపట్టణం వదిలి హైదరాబాదులో అన్వేషిస్తూ ఈ రావ్ దగ్గరకొచ్చినపుడు, అతడి పంజరంలో చిక్కుకుందట. సాంఘికభద్రతకోసం అతడితో వివాహం తప్ప మరో గత్యంతరం తోచలేదట.

ఇదంతా చెప్పి ఆమె తన గతాన్ని ముందే నాకు చెప్పనందుకు బాధపడింది. ఇప్పుడు తనమీద విరక్తి కలిగితే మర్చిపోయి వెళ్ళిపొమ్మంది. నేను వెళ్ళనన్నాను. తీసికెళ్తానన్నాను. ఆమె గతంతో నాకవసరంలేదన్నాను. వర్తమానం బాగుంటే చాలన్నాను. ఆమె నా బాహువుల్లో గువ్వలా ఒదిగిపోయింది. నేనామెలో సంపూర్ణంగా లీనమయ్యాను.

అప్పటి మా సంసర్గం కొత్త అనుభూతుల్ని సంతరించుకుంది. ఎన్నో భయాలను దూరం చేసింది....

సిగరెట్ వెల్గించుకొని నేను, ఆటో వెతుకుతోంటే,

జుట్టుపోలిగాడి గురించి ఆలోచించాను. వాడి బ్లాక్ మెయిల్ ప్లాట్‌లో మొదటి అంకం బాగానే పూర్తయింది. ఆ ఫోటోలు బాగానే తీశాడు వాడు. ఇక పైకం వసూలు చేసుకునే భాగం వుంది. వాడిప్పుడు యెలా రియాక్టవుతాడు, రావ్ చావు గురించి తెలిస్తే? ఆ సంతా అక్కు పరమైందన్న దుగ్ధ వాడికుంటుంది.... డిమాండ్ పెంచేస్తాడు. ఆ ఫోటోల్ని రావ్ స్నేహితులకీ, ఇటు సరోజ ఫ్రెండ్స్‌కీ పంపి పరువుతీసే అవకాశం ఇప్పుడూ వుంది వాడికి. అలాటిది జరగడం మా ప్రాణాలు పోయినా భరించలేం.

రవూఫ్ కేఫ్‌లో వాడ్ని కలుసుకున్నప్పుడు తెలుస్తుంది, కొత్త మలుపు ఏమిటో. ఇప్పుడీ పోలీసుల్ని ఎదుర్కోవాలి.... పోలీసుల్ని! వాళ్ళు నా సృష్టిని నమ్మతున్నారా? లేక అనుమానాలతో వచ్చారా? గుండె వేగంగా కొట్టుకుంటూంటే, అప్పుడే ఇంటిముందు ఆగింది ఆటో.

దిగి డబ్బులిచ్చేసి, గేటులోంచి వేగంగా వెళ్ళాను.

బాట మధ్యలో పోలీసు కారు ఆగివుంది.

అదురుతున్న గుండెతో గబగబా నడిచి ఇంట్లోకెళ్ళాను.

వాళ్ళంతా హాల్లో కన్పించారు, సోఫాల్లో కూర్చుని. సరోజ తలదించుకుని వుంది. ఆమె ముఖం బాగా నీరసించిపోయివుంది, రాత్రంతా నిద్రలేక. చిన్నారి ఆమెను చుట్టుకుపోయి తికమకగా దిక్కులు చూస్తోంది. ఎదురు సోఫాలో ఇద్దరు పోలీస్ ఇన్‌స్పెక్టర్లున్నారు. కింద నేలమీద ముసలి రాజయ్య వున్నాడు. అతను విలపిస్తున్నాడు.

నన్ను చూసి గొల్లుమంటూ లేచి వచ్చాడు.

"అయిపోయింది, బాబయ్యా.... ఇక అయిపోయింది!"

అతడ్ని కంగారుపడుతూ పట్టుకున్నాను. "ఏం జరిగింది తాతా?"

"మిష్టర్ సురేష్?" అడిగాడొక ఇన్‌స్పెక్టర్ నన్ను చూస్తూ.

తలూపాను. అతను కూర్చోమన్నాడు. ముసలి రాజయ్యని వదిలి నేను కూర్చుంటూ సరోజని చూశాను. ఆమె తలెత్తలేదు.

"మిష్టర్ సురేష్, నేను ఇన్‌స్పెక్టర్ శివశేఖన్‌ని. వీరు కమాలుద్దీన్. మేము మీ బాస్ గురించి ఒక చెడు వార్త తీసుకొచ్చాం...." అన్నాడు ఇన్‌స్పెక్టర్ మళ్ళీ.

నేను ఉలికిపడుతూ చూశాను. "ఏమిటి, ఇన్‌స్పెక్టర్?"

"మీ బాస్ ఎక్కడికెళ్ళారో తెలుసా?"

"ఎందుకు, కోయంబత్తూరు వెళ్ళారు కదా...."

"యస్, సరోజగారు కూడా అలాగే అంటున్నారు. కానీ...."

"కానీ...ఇన్‌స్పెక్టర్?" అని వాళ్ళిద్దర్నీ ధైర్యంగా, పరీక్షగా చూశాను. అవి అనుమానిస్తున్న ముఖాల్లా లేవు. లేక నేను పొరబడుతున్నానా? ముఖభావాలతో చక్కటి గేమ్ ఆడతారీ పోలీసులు!

"ఆయన మీరనుకుంటున్నట్లు కోయంబత్తూరు వెళ్ళలేదు, మిష్టర్ సురేష్" అన్నాడతను ముందుకు వంగి, "ఆయన దగ్గర ఏ టిక్కెట్లూ లేవు. ఆయన దేనికి హోటల్లో బసచేశారో చెప్పగలరా ఇక్కడ?"

వెల్, వీళ్ళు నటిస్తున్నారో లేదో నాకిప్పుడే

తెలియదు. కానీ నేను నటిస్తున్నట్టు వీళ్ళకనిపించకూడదు. వీలయినంత ఎక్కువగా ఆశ్చర్యాన్ని ముఖంలోకి తెచ్చుకుని నోరు తెరిచాను. "ఆయన హోటల్‌లో బస చేశారా?"

తలూపాడతను. "హోటల్ మౌర్య, రూం నెంబర్ 98లో నిన్న ఉదయం పదిగంటలకి దిగారు."

"అర్థంగావడంలేదు, ఇన్‌స్పెక్టర్, ఫ్లయిట్ కాన్సిల్ అయితే ప్రయాణం మానుకుంటే హోటల్‌లో ఎందుకు దిగుతారు, ఇంటికి తిరిగిరాక?"

"మీరాయనతోపాటు ఏర్‌పోర్టుకి వెళ్ళారా?"

"లేదు. ఒక్కరే టాక్సీలో వెళ్ళారు. మా స్టాఫ్ కందరికీ చెప్పారు, బిజినెస్ ట్రిప్ మీద కోయంబత్తూరు వెళ్తున్నట్టు, ఎల్లుండి తిరిగిరానున్నట్టు. ఇంట్లో కూడా చెప్పి వెళ్ళారు, కదూ మాడమ్?"

తలూపింది సరోజ, ఎత్తకుండానే.

"లేదు, హోటల్‌లో ఆయన సూట్‌కేసులో బిజినెస్‌కి సంబంధించిన కాగితాలేవీలేవు" అన్నాడు శివనేశన్, "బట్టలు మాత్రమే వున్నాయి."

"అయితే హోటల్ గది ఎందుకు తీసుకున్నారు? ఇంతకూ ఆయనకేమైంది?" అడిగాను ఆందోళన నటిస్తూ.

అప్పుడు కమాలుద్దీన్ నోరు విప్పాడు. "హోటల్‌లో ఎందుకున్నారో వూహించగలం, మిస్టర్ సురేష్. ఇంతకు ముందెప్పుడైనా ఇలా ఊరెళ్తున్నట్టు చెప్పి ఇక్కడే ఏ హోటల్‌లోనో గడపటం మీకు తెలుసా?"

"తెలియదు, ఇన్‌స్పెక్టర్."

"మిసెస్ సరోజ కూడా అలాగే అంటున్నారు. కానీ నా అనుమానం నిజమైతే, మీకెవరికీ తెలియకుండా ఆయనలా చేస్తూనే వుండాలి. అయితే ఇప్పుడే మీకు

తెలిసింది. దేనికని నిలదీసే అవకాశం ఆయన మిసెస్‌కి లేకుండా, ఆయన శాశ్వతంగా వెళ్ళిపోయారు....."

"ఇన్‌స్పెక్టర్?"

"మీ బాస్ ప్రమాదానికి గురియై మరణించారు."

అదిరిపడి చూశాను. "ప్రమాదమా! బాస్‌కా! మరణించారా! ఎప్పుడు? ఎక్కడ?

"అయాం సారీ, మిష్టర్ సురేష్" కమాలుద్దీన్ అస్పష్టంగా గొణిగాడు, "మీ బాస్‌కి హోటల్ ముందు యాక్సిడెంట్ జరిగింది. వెంటనే యెవరూ చూడలేదు. ఉదయం నాలుగు గంటలకి ఒక ఆటో డ్రైవర్ చూసి రిపోర్టు చేశాడు. మీ బాస్ హోటల్ కాంపౌండు గోడ చివరగా, యెడమవైపు, బయట పేవ్‌మెంట్ మీద పడిపోయి వున్నారు. చాలా రక్తం పోయింది. తల చిట్లింది. దురదృష్టవశాత్తూ ఆయన అటుగా నడిచివెళ్తూ అరటితొక్క మీద కాలువేశారు. జారింది. పేవ్‌మెంట్ కూడా వర్షంపడి స్లిప్పరీగా ఉండడంవల్ల ఆయన బాలన్స్ తప్పి ముందుకు పడ్డారు....పడుతూ అక్కడే వున్న ఎలక్ట్రిక్ స్తంబానికి కొట్టుకున్నారు తల....

"అంతే, ఆయన విస్కీ కూడా తీసుకొని వుండడంవల్ల లేచే శక్తిగానీ, సహాయంకోసం అరిచే తెలివిగానీ లేకపోయాయి. అక్కడే, అలాగే బోర్లా పడిపోయి స్పృహ తప్పారు. తర్వాత ప్రాణాలు వదిలారు...."

నేను ఆతృతని అణచుకున్నాను. నేననుకున్నట్లుగానే భావిస్తున్నారు వీళ్ళు!

"ఓహ్! అసలాయన బయటికెందుకొచ్చారు?" అడిగాను జాగ్రత్తగా.

"అదే చెప్పబోతున్నాను...." ఇప్పుడు శివనేశన్

అన్నాడు, "ఆయన హోటల్‌లో ఎందుకున్నారో కూడా మీకు తెలుస్తుంది. మీ బాస్ ఆడ స్నేహితుల గురించి మీకు తెలుసా, మిస్టర్ సురేష్?"

"తెలీదు, ఇన్‌స్పెక్టర్. వుంటారనుకోను. ఆయనకంత టైం లేదు...."

"సరోజగారు కూడా అలాగే నమ్ముతున్నారు.... ఇప్పుడు మీ నమ్మకాల్ని మార్చుకోవల్సిన అవసరంవుంది. ఆయన స్నేహితురాలిని కలుసుకోడానికే హోటల్‌లో దిగారు."

"ఎలా అంటున్నారు, ఇన్‌స్పెక్టర్?" అడిగాను. ఇన్‌స్పెక్టర్ నేను ఏర్పరచిన మార్గంలోనే పోతున్నాడు.

"చెప్పగలను, మిస్టర్ సురేష్. ఆధారాలున్నాయి. ఆమె ఎవరో, ఎప్పుడొచ్చిందో, ఎలా వచ్చి వెళ్ళిందో యెవరూ చూడలేదు. కానీ ఆమె వున్నట్లు ఆధారాలున్నాయి. గదికి రహస్యంగా వచ్చి గడిపివెళ్ళింది, మీ బాస్‌తో. మీ బాస్ తర్వాత రాత్రెప్పుడో ఎవరికంటా పడకుండా ఆమెను బయటచేరవేస్తూ కిందికి వచ్చారు. ఎవరూ చూడలేదు. నా వూహ మాత్రమే. నా వూహ తప్పుకాదని నా నమ్మకం."

"చెప్పండి, ఇన్‌స్పెక్టర్."

"అప్పుడు బయట ఆటోలోనో, టాక్సీలోనో ఆమెను ఎక్కించి, గుడ్‌నైట్ చెప్పివస్తూ.... వస్తూ జారిపడ్డారు."

"ఓహ్, ఆధారాలన్నారు.... ఏమిటవి?"

"ఆ గదిలోనే దొరికాయి. ఆ ఆధారాలతోనే ఆయన స్నేహితురాలిని వూహించాం. బాత్‌రూంలో కొన్ని వెంట్రుకలు దొరికాయి.... పొడవైనవి, స్త్రీవనుకోవచ్చు. అక్కడే ఒక మల్లెదండ కూడా పడివుంది.... అది

స్త్రీదని కచ్చితంగా అనుకోవచ్చు. గదిలో బెడ్ షీట్స్ బాగా నలిగి వున్నాయి. రెండు వైట్ హార్స్ సీసాలు పూర్తిగా ఖాళీ వున్నాయి, గ్లాసులు లేవు. ఇవేగాక అన్నిటికీ మించి, ఆయన, కంఠం కిందుగా ఒక మరక వుంది....లిప్‌స్టిక్ మరక. అది స్త్రీదే అని గాక, ఆమె ఎంత సన్నిహితురాలో తెలియజెపుంది...."

"ఓహ్, ఇక వుండనీయండి, ఇన్‌స్పెక్టర్! బాస్ గురించి ఇలాటివి వినలేకపోతున్నాను .... ఆయన పడి పోవడం ఎవరూ చూడలేదా?"

"లేదు, ఆ ప్రాంతం పగలే నిర్మానుష్యంగా వుంటుంది ..."

"ఇప్పుడు దీనిగురించి మీరేం చేస్తున్నారు, ఇన్‌స్పెక్టర్?"

కమాలుద్దీన్ అందుకున్నాడు, "ఇందులో వేరే అనుమానించడానికి ఏదీలేదు. అఫ్‌కోర్స్, పి.ఎమ్. రిపోర్టు వచ్చేవరకు ఆగడం మంచిదైనా, ఇది ప్లెయిన్ అండ్ సింపుల్ యాక్సిడెంట్ అని నేను చెప్పగలను. మరొకటి జరిగిందనుకోడానికి మోటివ్ కన్పించడం లేదు. ఆయన జేబుల్లో డబ్బూ, వస్తువులూ అలాగే వున్నాయి, గది తాళంచెవితో సహా. చేతికి వాచీ ఉంగరాలూ భద్రంగా వున్నాయి. ఏ దొంగోడో ఆయన్ని కొట్టి దోచుకున్నాడనుకోవడానికి వీల్లేదు.

ఎవరో అక్కడ అరడజను అరటిపళ్ళు తిని తొక్కలు పారేశాడు. సివిక్‌సెన్స్ లోపిస్తోంది జనాలకి .... ఆ అరటి తొక్కలూ, వానపడి జారుడుగా వున్న పేవ్‌మెంట్, వాడిగా వున్న రక్తం మరకలంటిన స్తంభం అంచులూ....ఇవి చాలు అది ప్యూర్ యాక్సిడెంట్ అన

డానికి. దీనికెవర్ని నిందించగలం? ఆ పళ్ళు తిన్నవాడ్ని పట్టుకొని శిక్షించడం సిల్లీగా వుంటుంది కదూ...."

నా ముఖంలో రంగులు మారడం అతను గమనించ లేదు.

వాళ్ళిద్దరు లేచి నిలబడ్డారు. శివనేశన్ అన్నాడు. "మా తీర్పులో మీకేవైనా అభ్యంతరాలుంటే తెలుపండి. మేము దీన్నిలాగే క్లోజ్ చేయాలనుకుంటున్నాం... ప్రస్తుతానికి. బాడీ మీకు మధ్యాహ్నం ఒంటిగంటకి అందజేయబడుతుంది. ఇక మేం సెలవు తీసుకుంటాం."

వాళ్ళు వెనుదిరిగి చకచకా నడుచుకుంటూ వెళ్ళి పోయారు.

అనుమానాల్లేవు, అపోహల్లేవు, అనుకున్నట్టే జరిగింది. వాళ్ళు మళ్ళీ ఇక తిరిగి రాకూడదని మనసులో ప్రార్థించాను.

లేచి సరోజని చూశాను. ఎవరూ మాట్లాడే స్థితిలో లేరు. చిన్నారిని ఎత్తుకున్నాను.

"డాడీ ఏడి, అంకుల్? ఏమైంది డాడీకి?"

"డాడీ మమ్మీ దగ్గర కెళ్ళిపోయాడు...." అన్నాను జాలిగా చూస్తూ.

"మమ్మీ ఇక్కడే వుందిగా, అంకుల్?"

"ఏదీ?"

ఆమె సరోజని చూపించింది. "అదిగో, మమ్మీ ఇక్కడే వుందంకుల్!"

నేనామెని గట్టిగా హత్తుకుని ముద్దుపెట్టుకున్నాను. "చిన్నారీ!"

"ఏమిటంకుల్?"

"నువ్వు మంచి పాపవి! ఇక వెళ్ళి ఆడుకో మ్మా...."

ఆమెని దింపి వదిలి పెట్టాను. ఆమె కేకలేస్తూ వరండాలోకి పురికింది.

ముసలి రాజయ్య కదిలి నా దగ్గరకొచ్చాడు. "నేను నమ్మలేకపోతున్నాను, బాబయ్యా! నా కేమనా లో తెలియడంలేదు....."

అతన్ని సానుభూతిగా చూశాను. అతను గొణుక్కుంటూ లోపలికి వెళ్ళిపోయాడు.

సరోజ నన్ను చూసింది, కళ్ళలో అభినందనతో.

"నువ్వెలా చేశావు, సురేష్!"

"వాళ్ళనుమానించలేను. ప్రస్తుతానికి రిలీఫ్."

"ఇకముందేం కాగుగా?"

నే జవాబివ్వలేదు. నా మనసును ఒకటి తొలుస్తోంది. అది చిక్కులు తేకూడదని ప్రార్థించాను.

"ఏమీ కాదు, సరోజా, అన్నీ యెదుర్కోవచ్చు. నువ్వింక నిశ్చింతగా వుండు. ఈ వార్త ఎవరికి కబురు చేయాలో చేసి నువ్విక్కడ ఏర్పాట్లు చూస్తూండు. నేను మధ్యాహ్నం వచ్చేస్తాను."

తలూపిందామె నిట్టూరుస్తూ.

## 6

జాట్టుపోలిగాడు రవ్వాఫ్ కేఫ్ కి నాకంటే ముందు చేరుకున్నాడు.

వాడు హుషారుగా కన్పిస్తూండడాన్ని బట్టి అర్థంజేసుకున్నాను పరిస్థితిని. కేఫ్ లోపల ఓ మూల గోడవార టేబుల్ దగ్గరికి తీసుకెళ్ళాడు నన్ను.

"కూర్చో లవర్ బాయ్, కులాసేనా?"

కూర్చుంటూ సూటిగా చూశాను. "సంగతి చెప్పు త్వరగా!"

వాడు నవ్వి సప్లయర్‌ని పిల్చాడు. "దో సమోసా. దో చాయ్ లావ్!" అన్నాడు.

"నేను తినను, నువ్వే తిను" అన్నాను.

"ఏక్ సమోసా, దో చాయ్ లావ్!" అన్నాడు వాడు.

"అది కూడా నువ్వే తాగు!" అన్నాను మళ్ళీ.

"ఏక్ సమోసా, ఏక్ చాయ్ లావ్!" అన్నాడు ఆఖరికి.

సప్లయర్ తలూపి వెళ్ళిపోయాడు.

"నువ్వెందుకు తినవు, లవర్ బాయ్?" అడిగాడు చుంచు కళ్ళు చిట్లిస్తూ.

"నేను తినను, తినిపిస్తాను" అన్నాడు పొడిగా, వాడి కళ్ళు ఎగిరిపడ్డాయి. రాత్రి తిన్నది గుర్తొచ్చి వుంటుంది. "నేను వెళ్ళాలి, త్వరగా సంగతి చెప్పు!" అన్నాను మళ్ళీ.

"కాస్త నెమ్మది....ఎవరైనా వింటారు.." అన్నాడు వాడు చుట్టూ చూస్తూ. జనం యెవరి తిండిలో వాళ్ళున్నారు. "నువ్వే చెప్పాలని రాత్రి మనం అనుకున్నట్లు గుర్తుంది... లవర్ బాయ్. కాబట్టి నువ్వే చెప్పాలి."

"నీకెప్పుడు కావాలి, ఆ రెండు లక్షలు?"

"రెండు లచ్చలా!" వాడు ఆశ్చర్యంగా అన్నాడు. "నేను అయిదు లచ్చలు వస్తాయనుకుంటున్నాను...."

"చూడూ, నీ చచ్చు భాష మాను. డబ్బు నాది కాదు. నువ్వామెతో నే ఎందుకు బేరమాడకూడదు?" అన్నాను, వాడి కొత్త ఆలోచన నాకర్థమయిపోయి.

వాడు తల అడ్డంగా వూపాడు. "ఇప్పుడామె ఇవ్వక పోవచ్చు...మనసు మారవచ్చు."

"ఎందుకు మారుతుంది?"

"నువ్వు చేసిన పనికి ఆమె మనసు మారవచ్చు...."

వాడి కళ్ళలోకి చూశాను. అవి హేళనగా నవ్వు తున్నాయి. ఏమిటి వీడన్నదానికి అర్థం? ఏమిటి నేను చేసిన పని అని వీడి ఉద్దేశ్యం?

"నువ్వేమంటున్నావో అర్థంగావడం లేదు...." అన్నాను ఇంకా జాగ్రత్తగా చూస్తూ.

వాడు నవ్వుతూ జేబులోంచి ఓ కవరుతీశాడు.

దాన్ని నాకిస్తూ, "ఇందులో చూడు. నన్ను మెచ్చు కోకుండా ఉండలేవు! ఆమె ఎందుకు మనసు మార్చు కుంటుందో, నేనెందుకు అయిదు లక్షలు రావాలను కుంటున్నానో అంతా అర్థమవుతుంది...." అన్నాడు చాలా తగ్గు స్వరంతో.

తికమకపడ్తూ కవరు విప్పి చూశాను.

అందులో ఫోటోలున్నాయి, రెండు.

ఒకదాంట్లో నేను రావ్ మీదకూర్చుని కొడుతున్నాను.

రెండోదాంట్లో రావ్ శరీరాన్ని కాళ్ళోంచి పేవ్ మెంట్ మీది కీడుస్తున్నాను.

రెండూ బాగున్నాయి. చక్కగా స్పష్టంగా వచ్చాయి.

అప్పుడు నా మనస్థితి యిలా వుందో చెప్పలేను. రాయిలా కూర్చుండి పోయాను.

వాడికేం పట్టనట్టు సమోసా అరగిస్తున్నాడు. వాడ్ని చూస్తూంటే గొడ్డు గ్రాసం నముల్తూన్నట్లుంది. నాకు వాడి గొంతు పట్టుకొని పిసికెయ్యాలనిపించింది! పడుతున్న చెమట, అదురుతున్న గుండె, వణుకుతున్న శరీరమూ నన్ను మూర్ఛవచ్చేలా చేస్తున్నాయి.

అతికష్టం మీద నన్ను నేను కంట్రోలు చేసుకొని, వాటిని కవరులో పెట్టాను. అప్పుడు గొంతు సరిచేసుకుని వాడిని అడిగాను.

"ఎలా తీశావు, వెధవా? అక్కడికెలా వచ్చావ్?"

వాడు తలెత్తి పళ్ళు బయటపెట్టాడు. "నిజానికి నేను నిజాయితీగా మీ ఇద్దరి బెడ్‌రూం సీన్‌లు తీసుకుందామనే వచ్చాను. కానీ లవర్ బాయ్, బలేవాడివే.. బావగార్ని అలా సత్కరిస్తావా? బాల్కనీ కిటికీ పక్కన దాక్కొని చూస్తున్నాను........ఇంతలో బావగారు ఎలా వచ్చాడో మీ యిద్దరి మధ్యా వచ్చిపడ్డాడు. చూస్తూండగానే నువ్వు కింతపడేసి తల పగలగొట్టేశావు! ఏవో భారీ డైలాగులు కూడా కొట్టేశావు.... నేనదే బంగారు గని అనుకుని నా బుల్లి కేమెరాని నొక్కేశానంతే."

వాడంతవరకు చెప్పి తినడం పూర్తి చేశాడు.

"అప్పుడు లవర్ బాయ్, మిమ్మల్ని జాగ్రత్తగా వాచ్ చేశాను. నువ్వు శవాన్ని కార్లో వేసుకుని వెళ్ళినప్పుడు నిన్ను వెంటాడాను. దాన్నేం చేశావో చూసి మళ్ళీ నా బుల్లి కేమెరాని నొక్కాను....బంగారు గని! అయిదు లక్షలు వస్తాయి! రాత్రంతా నాకు నిద్ర లేదు పో."

నేనలాగే కూర్చున్నాను చూస్తూ, వీడు గుంటనక్కలా తేలాడు! నా కొంప ముంచాడు! పోలీసులతో విజయవంతమైందనుకున్న నా నాటకం—ఇప్పుడు ఈ వెధవ చేతిలో అభాసు కాబోతోంది!

వెయిటర్ టీ తెచ్చిపెట్టి వెళ్ళిపోయాడు.

"లవర్ బాయ్, నిన్నటి లవ్ సీన్‌లు క్యాన్సిల్. ఈ మర్డర్ సీన్‌లు పర్మనెంట్!" అన్నాడు వాడు కప్పు

లాక్కుంటూ.

తేరుకుని వాడ్ని చూశాను. "నీ తెలివి బాగానే వుంది, వెధవా!"

"ఇప్పుడు నన్నలా పిలవకు!" అన్నాడు టీ తాగుతూ. అది తాగుతోంటే గొడ్డు కుడితి తాగుతున్నట్టుంది.

నేనది చూస్తూ, "నువ్వు వెధవకంటే ఎక్కువేమీ కావు" అన్నాను.

"మరి ఇతరుల పెళ్ళాల్ని దొంగిలించే మీరేమవుతారు?"

నా చెయ్యి విసురుగా వెళ్ళి ఫెడీమని వాడి గెడ్డం మీద తగిలింది.

వాడు కప్పు పడేసి, కుర్చీతోపాటు వెనక్కి దొర్లి పడ్డాడు దభీమని.

జనం ఇటు చూసి, లేచి పరుగెత్తుకొచ్చారు ఏమైంది, ఏమందంటూ. కొందరు వాడ్ని పట్టి లేపి కూర్చోబెట్టారు. అందరూ గోలగా మాట్లాడుకోసాగారు.

"ఏమీ లేదు. విష్ చేసుకుంటున్నాం, అంతే. మీరు వెళ్ళండి...." అన్నాను.

"విష్ చేసుకుంటున్నారా!"

"కొంచెం ఉద్రేకపడ్డాం, చాన్నాళ్ళయింది కలిసి."

జాట్టుపోలిగాడు గెడ్డం రుద్దుకుంటూ వాళ్ళని చూశాడు కుహామాటంగా.

"అవును, చాన్నాళ్ళయింది కలిసి..." అన్నాడు బిడియంగా.

వాళ్ళు మమ్మల్ని విచిత్రంగా చూసుకుంటూ, నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

"వెధవా, నీ అక్క నరకం అనుభవించిందిరా! ఆమె

సుధరిస్తున్నానని చెప్పడానికి సిధపడను" అన్నాను కర్కశంగా, సిగరెట్ వెలిగించుకుంటూ.

వాడు మాట్లాడలేదు. వాడి కళ్ళనిండా భయం, షాక్.

"నన్ని జనంలో కలుసుకుంటే కొట్టలేననుకున్నావా, వెధవా? జనాన్ని పజిల్‌లో పెట్టి ఎలా కొట్టగలనో తెలుసుకున్నావా ఇప్పుడు?"

వాడు కోపంగా చూసి పళ్ళు నూరాడు.

"నన్ను మళ్ళీ కొట్టు—అంతా కక్కేస్తాను!"

నేను చెయ్యి లేపాను. వాడు వెనక్కి వంగాడు భయపడిపోయి.

"నాతో మర్యాదగా మాట్లాడాలి, వెధవా. ఏదీ, మళ్ళీ చెప్పు ఏమన్నావో?"

"మీరు మళ్ళీ కొడితే, నేనంతా కక్కేస్తాను, సురేష్ ...."

"మిస్టర్ సురేష్ అనాలి."

"మిస్టర్ సురేష్, నే చెప్పింది విన్నారు...."

"విన్నాను. కానీ నువ్విప్పుడే ఆ పని చేయలేవు, వెధవా. నీకా అయిదు లక్షలు కావాలి. ముందు నా చేత తన్నులు తినీతినీ, ఇక తట్టుకోలేననుకున్నప్పుడే నువ్వా కక్కడం గురించి ఆలోచిస్తావు."

"మీ రెందుకు తంతారు నన్ను?"

"నీకెంత తట్టుకునే శక్తి వుందో పరీక్షిద్దామని. అప్పుడు డబ్బు రిలీజ్ చేయిస్తాను."

"అప్పుడే ఎందుకు రిలీజ్ చేయించాలి డబ్బు?"

"ఎందుకంటే అప్పుడు నువ్విలా వుండవు. ఓ మంచం ఏర్పాటు చేసుకుంటావు. డబ్బు నీముందే వుంటుంది

కవ్విస్తూ. కానీ నువ్వేం చేయలేవు. అనుభవించలేవు. అప్పటి నీ పరిస్థితి చూసి నాకు కసిదీరా ఆనందించాలని వుంది!"

వాడు చటుక్కున ముందుకు వంగి, బెదిరింపుగా చూశాడు. "అయితే వినండి, మిష్టర్ సురేష్! నా గురించి మీకేం తెలీదు! నేనంత వెధవననుకున్నారా తన్నులు తినడానికి? నన్ను నేను రక్షించుకోగలను! వింటున్నారా? నన్ను రక్షించుకోగలను! ఈ క్షణంనుంచీ నా వెంట ఎప్పుడూ ఇద్దరూ వుంటారు, కంత్రీలు! చెయ్యివేస్తే దాన్ని తెగనరికి దాంతోనే చావ బాదుతారు! అర్థమవు తోందా? ఇది గుర్తుంచుకోండి! మరొకటి, ఆ ఫోటోలు మరో సెట్టు సీలు చేసి నా ఫ్రెండ్ కిచ్చాను — నేను చస్తే పోలీసులకిమ్మని!"

నాక్కావల్సింది తెలుసుకున్నాను.

వాడ్ని తదేకంగా చూస్తూ సిగరెట్ పీల్చసాగాను. నాకిప్పుడిదంతా మరో విధంగా కన్పిస్తోంది. నేను భావిస్తున్న రూపం ఇప్పుడు దీనికి లేదు! అంతేగాక నా చుట్టూ ఏదో వల బిగుసుకుంటున్నట్లు భావన కలుగు తోంది. యెవరో నన్ను బొమ్మనుచేసి ఆడిస్తున్నట్లని పిస్తోంది....

ఇదంతా ఓ పెద్ద గూడుపుఠాణీగా, దీని వెనుక ఓ పెద్ద దుష్టకూటమి పనిచేస్తున్నట్లుగా మనసు శంకిస్తోంది. ఇది వీడొక్కడి పని కానేకాదు. వాడివల్ల అయ్యేది కాదు. వీడికి జత వున్నారు....ముందే పటిష్టంగా పథకం వేసుకొని నన్నీ పరిస్థితుల్లో ఇరికించారు! అది వీడి మాటల వల్లే తెలుస్తోంది....

ఈ జాట్కాకోలిగాడు సరోజతో నన్ను బెడ్రూం

ఫోటోలు తీయడానికి వచ్చానంటున్నాడు రాత్రి! కానీ అంతకుముందు తీసిన ఫోటో లుండగా మళ్ళీ ఎందుకావాల్సొచ్చాయి నిన్న రాత్రి? బ్లాక్ మెయిల్ కి ఆ కారులో తీసినవే బాగా పనికొస్తాయి. కానీ మళ్ళీ ఎందుకవసరమయ్యాయి రాత్రి? అర్థంలేని పని! అందులో బుకాయింపు తెలిసిపోతూనే వుంది!

రాత్రి వీడు ఇంటికొచ్చిన అసలు ఉద్దేశ్యం, సరోజతో నా శృంగారాన్ని గాక, రావ్ తో శౌర్యాన్ని రికార్డు చేయాలనా?

అంతే....!! వీడు రావ్ తో నన్ను మర్డర్ ఫోటోలు తీయడానికే వచ్చాడు! అంటే వీడికి మర్డర్ జరుగబోతోందని ముందే తెలుసు! అలా అంతా ప్లాను ప్రకారం పకడ్బందీగా జరిపించారు వీడి జతగాళ్ళు! రావ్ కి ముందే మా వ్యవహారం తెలియజేసి, రాత్రి ఫలానా టైములో వెళ్ళి చూడమని టిప్ ఇచ్చారు! అతడలా వచ్చేస్తే నేను చంపేస్తానని వాళ్ళకి తెలిసివుండాలి.... అలాగే జరిగిపోయింది!

అది కాకతాళీయం కాదు, కల్పన!

రావ్ తనకి తెలియకుండా దుష్టుల ట్రాప్ లో అడుగు పెట్టి నా చేతిలో చచ్చాడు!

అయితే ఎవరు వీళ్ళంతా? ఈ దుష్టకూటమిలో ఎవరెవరున్నారు? వూహించలేకపోతున్నాను .... వాళ్ళని వూహించడం కంటే నా పరిస్థితి ఆందోళన కలిగిస్తోంది! ఒక ఆలోచన వచ్చింది. ఈ జాట్టుపోలిగాడ్ని కనిపెట్టాలి. వీడి కదలికల్ని, చర్యల్ని, కలుసుకునే వ్యక్తుల్ని జాగ్రత్తగా కనిపెట్టాలి.... అప్పుడు తెలియవచ్చు. ఆ ముఠా స్వరూప స్వభావాలు.

"ఇప్పుడేమంటారు, మిస్టర్ సురేష్?" వాడిమాటలకి తేరుకుని చూశాను.

"సరోజకి చెప్తాను. ఇప్పుడు అయిదు లక్షలు ఆమెకు సమస్య కాదు. నువ్వు నా చేత మామూలుగా అడిగించినా ఇచ్చేది .... నేనెలాగో నచ్చచెప్పి ఇప్పించేవాడ్ని. ఆఫ్టరాల్, నువ్వామెకు తమ్ముడివి."

"ఇలా అడిగితే పని తొందరవుతుందనుకున్నాను."

"సరే, నాక్కొంచెం టైమివ్వు, రేపటివరకు, అవతల నీ బావగారికి ఇంకా జరిపించవలసి వుంది...."

"అలాగే, మిస్టర్ సురేష్, వాడికి మీరు మంచి శాస్తి చేశారు. మెచ్చుకోకుండా వుండలేను."

వాడు లేచి గబగబా వెళ్ళిపోయాడు. కౌంటర్‌లో బిల్లు చెల్లించి బయటకెళ్ళి తన సైకిలెక్కాడు.

శాస్తి చేశాను సరే, కానీ ఇప్పుడు నాకీ గతేమిటి! ఆందోళనగా లేచి బయల్దేరాను. తొందరపడ్డాను. నేను చాలా తొందరపడి చేశాను....

బయట ఆటో ఎక్కి వాడి సైకిలుని జాగ్రత్తగా అనుసరిస్తున్నప్పుడు, ఆలోచనలు తిరిగి ముసురుకున్నాయి. కుట్రదారుల్ని తృప్తిపరిచినంతవరకు, నాకు పోలీసుల బెడదలేదు. పోలీసులు నేను సృష్టించినదాన్ని బాగా నమ్ముతున్నారు. దాన్నలాగే మూసివేసే ఆలోచనలో కూడా వున్నారు. ఆ విధంగా జరగాలని నేను బాగా ఆలోచించే చేశాను, జరిగింది. మళ్ళీ ఏదో వ్యతిరేక సాక్ష్యం లభిస్తే తప్ప వాళ్ళు పరుగెత్తుకురారు. అటువంటి సాక్ష్యం ఒక్కటే ఒక్కటి వుంది—అది నా జేబులో ఫోటోలు.

ఇవి చూస్తే సరోజ ఎలా రియాక్టవుతుంది? పూర్

డియర్, బెదిరిపోయి వెంటనే అడిగినంత ఇచ్చేయమంటుంది. ప్రమాదం తనకూ లేదూ? సందేహం లేదు. కానీ నాకేదో తట్టింది .... కానీ, జుట్టుపోలిగాడే మనాన్నడిందాక?....ఏమిటది?....

'ఇప్పుడామె ఇవ్వకపోవచ్చు, మనసు మారవచ్చు'.... వాడికెందుకొచ్చింది సందేహం? ఏమిటది? ఇంకేదైనా అరముందా వాడి మాటలకి?....'నువ్వు చేసిన పనికి ఆమె మనసు మారవచ్చు' .... ఓహ్, నాకిప్పుడర్థమైంది! ఈ అక్కా తమ్ముళ్ళు కలిసి నాటకం ఆడడంలేదుకదా?

చటుక్కున సిగరెట్ పారేశాను. నిటారుగా కూర్చున్నాను. నా గుండె ఉండిఉండి కొట్టుకుంటోంటే, కొంతదూరంలో వేగంగా సైకిలు తొక్కుతున్న జుట్టుపోలిగాడ్ని చూస్తున్నాను. వాడు నయాపుల్ దాటి ఓల్డు సిటీవైపు సాగిపోతున్నాడు....

వాడు అక్కతో చేయి కలిపాడా? సరోజే స్వయంగా దీనికి పూనుకుందా? భర్త బాధలు పడలేక ఇలా చేయాలనుకుందా. ఇలా భర్తని తొలగించడానికే నన్ను సాధనంగా వాడుకుందా? అందుకే రాత్రి అసాధారణంగా, ఇంటి కాహ్వానించిందా? భర్తకి తమ్ముడి ద్వారా తనే టిప్ ఇచ్చి రప్పించిందా?

అవును! అవును! అవును!

ఆమె చంపించాలనుకుంది! యిందులో యే మాత్రం సందేహంలేదు! ఆమె నన్ను ఇంటికి ఆహ్వానించడం అదే సమయంలో బాస్ రావటం అంతా ఆమె చేసిన ప్లానే! అంతకుముందే ఆమె ఏమని మాట్లాడింది? చిన్నారి అనాథ అవుతే....తండ్రి కూడా చచ్చిపోతే....ఈ మాటలు దేనికి ప్రతీకలు? ఆమె మనసులో పథకాన్ని ప్రతిబింబించే

భావాలు! నేనెంత ఫూల్‌ని! ఆమెని ఎలా నమ్మాను! ఇప్పుడు నీ ముఖం చూడను పొమ్మంటుంది! అవసరం తీరింది!

కానీ—

మరి ఈ బ్లాక్ మెయిల్ ప్రహసనం ఏమిటి? ఇదామె పథకంలో ఎక్కడ, ఎలా ఇముడుతుంది?....కాస్సేపటి వరకు నా కర్థంగాలేదు. నన్నిలా బెదిరించి, భయపెట్టి, తను పొందే ప్రయోజనమూ లేదు, ఆ అవసరమూ లేదు. ఇలా తన బాక్కసంలోంచి తన డబ్బే తీసి తనవాడికే చెల్లించడంలో అర్థముందా?

అలా కాదు.

ఆమె ఏ పదివేలో ఇస్తానని వుంటుంది. వీడికి 'లచ్చల' మీద ఆలోచనలున్నాయి. అందుకని అక్కని డబుల్ క్రాస్ చేశాడు. ఆమెకు తెలీయకుండా ఈ ఫోటోలు తీశాడు. దీంతో వాడికి కోరినంత డబ్బు వచ్చి పడుతుంది!

అందుకే ఆమె 'ఒప్పుకోదు' అని సూటిగా చెప్పే దాన్ని, 'మనసు మారవచ్చు' అని పరోక్షంగా సూచించాడు. ఆమెను ఒప్పించే బాధ్యత, అగత్యం వచ్చినట్టు నాకే వున్నాయి!

ఆందోళనలోంచి తేరుకుంటూ వాడ్ని చూశాను. వాడు ఒక్కసారి వెనక్కి చూడకుండా అర్జంటుగా మాసుకుపోతున్నాడు. ఓల్డు సిటీలో ఓ పేట చేరుకుని ఒక వీధిలోకి తిరిగాడు. ఆ మొదట్లో నేను ఆటో ఆపించి చూశాను. వాడు తిన్నగా పోతున్నాడు....ఆ వీధిని చూస్తే ఇట్టే తెలిసిపోయింది రెడ్‌లైట్ ఏరియా అని. శృంగార వనితలు అప్పుడే వ్యాపారాలు తెరిచారు...

వాడు ఎడమవైపు తొమ్మిదవ ఇంటిముందు సైకిలాపి

దిగాడు. మెట్లెక్కి వెళ్ళి తలుపు కొట్టాడు. కొన్ని క్షణాల్లో ఎవరో ఒకామె తలుపు తీసి చూసింది. వాడు లోపలికెళ్ళాడు. తలుపు మూసుకుంది.

నిట్టూర్చాను. ఆ యింటిని గుర్తుపెట్టుకొని ఆటోని వెనక్కి పోనివ్వమన్నాను.

నేను తిరిగివచ్చేటప్పటికి రావ్ మృతదేహం ఇంటికి వచ్చి వుంది. అంతా గందరగోళంగా వుంది. బంధువు లెవరూ లేకపోయినా, తెలినవాళ్ళు చాలామంది వచ్చారు. సరోజ అప్పుడు నిజంగా ఏడ్చేసింది. ఆమెమీద నాకే మాత్రం సానుభూతి కలగలేదు. మనసులో అనుమానాల పెను తుఫాను ఒకటే చెలరేగుతూంటే ఆమెకు దూరం దూరంగా వుండిపోయాను. చిన్నారిని ఎత్తుకొని. ముసలి రాజయ్య ధారలుగా కన్నీరు కార్చాడు.

ఆ సాయంత్రం ఘనంగా అంత్యక్రియలు జరిగాయి నా బాస్‌కి.

అక్కడ నాకు తెలియకుండానే రెండు కన్నీటి చుక్కలు రాల్చాను.

## 7

చీకట్లో తల వంచుకుని నిశ్శబ్దంగా కదుల్తూ సాగి పోతున్నాను....ఏ కాస్త తల ప్రక్కకు తిప్పినా రక రకాల సంజ్ఞలతో, అసభ్య చేష్టలతో, పిలుపులతో ఆహ్వానిస్తున్నారు వాళ్ళు.

నేను తిన్నగా వెళ్ళి ఆ ఇంటిముందాగి, లోపల శబ్దాల కోసం విన్నాను. ఏవీ లేవు. అప్పుడు తలుపుమీద చిన్నగా కొట్టాను. వెంటనే గాజుల గలగలలు, ఆ తర్వాత అడుగుల సవ్వడి విన్పించాయి. తలుపు తెరుచుకుంది.

నా ముందు నిల్చున్న ఆమె వయసు పద్దెనిమిదికిమించి

వుండదు.

ఆమె నవ్వుతూ చూస్తోంది. ఆ నవ్వు నాకు కొత్తగా వుంది.

"రా, చిన్నోడా!" ఆమె ఆహ్వానించింది.

నేను విస్తుపోతూ లోపలికి అడుగుపెట్టాను. అదేం పిలుపు?

ఆమె తలుపు మూసి నన్ను చురుగ్గా చూసింది. ఆ కళ్ళల్లో కొంటెతనముంది. ముఖంలో చలాకీతనం వుంది. అందచందాలెలా వున్నా సొష్టవాలు మాత్రం చిల్లర జాతి వాళ్ళని ఆకట్టుకునేలాగానే వున్నాయి.

నేనూ అదే వేషం కట్టి ఉన్నాను. నన్ను చూస్తే జేబులు కొట్టేవాడనుకుంటారు. నా చేతిలో ఒక ప్లాస్టిక్ ఏర్ బ్యాగు వుంది.

ఆమె నవ్వి, "రాత్రంతానా, చిన్నోడా?" అనడిగింది.

"కాదు, ఓపికున్నంతదాకా! ఎంత?" నేనన్నాను.

ఆమె చొరవగా నా నడుము చుట్టేసి తీసికెళ్ళింది లోపలి గదిలోకి, "అయితే పద, చిన్నోడా! ఎంతో అంత ఇద్దువుగాని!"

వీళ్ళిలాగే పిలుస్తారేమోననుకుంటూ నేనామెతో గదిలోకెళ్ళాను.

ఆ గదిని నేను వర్ణించదలచుకోలేదు.

మీలో సెన్సిటివ్స్ ఉంటే డోకు వచ్చేస్తుంది.

నన్ను మంచంమీద కూలదోసి, "మందు కావాలా?" అనడిగిందామె.

"తెచ్చాను" అన్నాను బ్యాగుని తట్టి చూపిస్తూ.

"తెచ్చావా? అయితే తీయ్, చిన్నోడా!"

"తీస్తాను, మధ్యలో ఎవరూ రారు కదా?"

“పోలీసులా? నీకా భయంలేదు, చిన్నోడా!”

“ఆ భయంకాదు, నాకిది అలవాటే. మరేదైనా గిరాకీ వచ్చేస్తుందేమోనని....”

“ఒకరుండగా ఎవర్నీ రానివ్వను!” అందామె నా ప్రక్కన, నన్నానుకుని కూర్చుంటూ. నేను ఊపిరి బిగబట్టాను. ఏం వాసన అది? ఆమె నా మెడని చుట్టేసి, “ఏ ఊరు మనది, చిన్నాడో?” అంది బ్యాగుమీద కన్నేస్తూ.

“పక్క ఊరే, పల్లెటూరు” అన్నాను దాన్ని స్టూలు మీద పెడ్తూ.

“ఏం పనిమీద వచ్చావు?”

“పట్నం పిల్లలు బాగుంటారంటే చూసిపోదామని.”

“మరి నేను నచ్చానా?”

“నచ్చడానికివి పెళ్ళిచూపులా? టెంపరరీ వ్యవహారం.”

“అయితే వచ్చేయ్, చిన్నోడా!”

“ముందు నన్నలా పిలవకు, నీకంటే పెద్దవాడ్ని.”

ఆమె కిలారున నవ్వింది ఊగిపోతూ, “నాకలవాటు చిన్నోడా! అలవాట్లు మానుకోలేం, అవునా?”

“అవును.... అందుకే ఇలా ఉన్నావు.”

“చిన్నోడా! ఇలా ఉండడంలోని మజా నీకేం తెలుసు?”

“అవును.... రుచులు చూడవచ్చు, రోగాలంటించుకోవచ్చు.”

“అలా మాట్లాడకు, చిన్నోడా! నా దగ్గర నీకా భయంలేదు!”

“నాకెవరి దగ్గరా భయంలేదు.”

"ఎందుకులేదు, చిన్నోడా?"

"నాకందరూ భయపడతారు."

మళ్ళీ కిలారుమందామె, నన్ను పట్టుకొని ఊగిపోతూ. "నిన్ను చూసి భయపడతారా! నిన్ను చూసి! పో చిన్నోడా, నేన్నమ్మను! నువ్వు రిషీకపూర్‌లా వున్నావు! చూస్తే పరుగెత్తుకొచ్చి ముద్దు పెట్టుకుంటారు నిన్ను-"

"కాదు, శక్తికపూర్‌లా చూస్తానని పారిపోతారు. మా అమ్మ తప్ప నన్నెవరూ ముద్దుపెట్టుకోలేదు."

"అయితే ఇప్పుడు నేను ముద్దు పెట్టుకుంటాను.... అయాం ఫస్ట్!" ఆమె చటుక్కున ముఖం దగ్గరకు తెచ్చి నా పెదాల్ని తన పెదాల్తో అదిమిపట్టేసింది. నేనొక్క తోపుతో ఆమెను మారంగా తోసేసి అసహ్యంతో పెదాల్ని తుడుచుకున్నాను. ఒక్కసారి వంట్లో ఎలాగో అయిపోయింది....

"లవ్లీ బాయ్!" ఆమె దగ్గరకొచ్చి నా చెంపలు నిమిరింది, "ఎంత రుచిగా ఉన్నావు! యూ ఆర్ స్వీట్! యూ మై హీరో, ఐ యువర్ హీరోయిన్-పూనమ్‌ఢిల్లాన్! ఓ.కే?"

"కుర్ర హీరోయిన్‌లంటే నాకు కంపరం."

"నీకు నాలాటి కుర్రదే కావాలి, చిన్నోడా!"

"కానీ మధ్యలో నీ మాజీ హీరో విలన్ అయి పోతాదేమో?"

"ఎవరు చిన్నోడా, మాజీ హీరో?"

"నాగేష్....ఆ జుట్టుపోలిగాడు."

"ఓహ్, వాడా!" కిలారుమందామె, "బలే పేరు పెట్టావులే, చిన్నోడా! నేను చిన్నోడా అని పిలిస్తే నే వాడు చెంప పగలగొడ్తాడు. నువ్వలా చేయవు, మంచి

వాడివి!"

నేనూ పగలగొడ్తాను యూ బిచ్, మళ్ళీ నా పెదాల్ని తాకితే! అనుకున్నాను మనసులోనే.

"వాడెక్కడున్నాడు?" అడిగాను మామూలుగా చూస్తూ.

"ఇప్పుడు వాడిగోల ఎందుకు, చిన్నోడా! మందు తీస్తావా? ఇక మంచాన్నుపయోగించుకుంటావా?"

"మంచం నా ఇంట్లోనూ వుంది. దాన్ని నేనుపయోగించే తీరు వేరు. మందు తీస్తాను. నీక్కావల్సింది డబ్బు. నాక్కావల్సింది కాలక్షేపం. మందుకొట్టి నీ ఇష్టమొచ్చినంతసేపు వాగు!"

బ్యాగు తెరిచి వైట్ హార్స్ సీసా తీశాను. ఆమె దాన్ని చూస్తూనే పెదవులు చప్పరిస్తూ లేచివెళ్ళి రెండు గ్లాసులూ ఒక నీళ్ళ జగ్గుతో వచ్చింది.

నేను చిప్స్ ప్యాకెట్ తెరిచి స్టూలుమీద పెట్టాను. సీసా సీలు విప్పి ఆమె గ్లాసులో కొంత పోశాను. ఆమె వెంటనే నీళ్ళు కలుపుకుని, "మరి నువ్వు?" అంది.

"నేనిలాగే...." అంటూ సీసా పైకెత్తాను.

ఆమె గ్లాసు పైకెత్తి గటగటా శబ్దంచేస్తూ పూర్తిగా తాగేసింది.

నేను రెండు గుక్కలు తాగి సీసా కిందపెట్టాను. నాలుగు చిప్స్ అందుకున్నాను.

"బాగుంది, చిన్నోడా!" అందామె మళ్ళీ గ్లాసులోకి వంపుకుంటూ, ఆమెకు నిషా బాగా తలకెక్కింది.

"మీ మగాళ్ళంతా మోసగాళ్ళే! పచ్చి దుర్మార్గులు! ఆడదాన్ని హింసించేవాళ్ళు! నన్నిలా యెవరు చేశారో తెలుసా, చిన్నోడా? నీకు తెలుసా, చిన్నోడా? వాడే!

ఆ దమ్మిడీకి కొరగానివాడు—ఆ జుట్టుపోలిగాడే....!" నిషాలో అరవసాగింది.

"ఏ చేశాడు వాడు?" అడిగాను, ఆమె అరుపుల మధ్య.

"నన్ను నమ్మించి తీసుకొచ్చాడు....సంవత్సరమైంది, చిన్నోడా! వాడ్ని నమ్మి నావాళ్లనందర్ని వదిలి వచ్చేశాను! వాడు చెప్పింది చేయలేదు! వాడికో పనీ లేదు, పాటా లేదు! నాకు చేయిస్తానన్న నగలూ లేవు, కొనిస్తానన్న చీరలూ లేవు! నన్నీ కూపంలో పడేసి నా మీద ఇలా సంపాదించి తింటున్నాడు, చిన్నోడా! నేను పారిపోతే ఎక్కడున్నా వెతికి చంపుతానంటాడు! ఈ పని కాదంటే కంతాడు! తన అక్క కూడా ఇలాగే చేసిందంటాడు, చిన్నోడా, తనకోసం! మగాడ్ని నమ్ముకున్న ఆడది గడ్డు కాలంలో ఇలా సాయపడటంలో తప్పు లేదట! చిన్నోడా, నేనిక భరించలేను! చచ్చిపోతాను! ఇలా బ్రతకలేను! మీ మగాళ్ళ ప్రపంచంలో నాకీ బ్రతుకొద్దు—"

ఆమె తల బాదుకుంటూ ఏడ్వసాగింది....

"ఆవేశపడకు, అలా ఏడ్వకు. నేను నిజంగా చెడ్డ వాడ్ని కాను. నీ కథేమిటో తెలుసుకుందామని రెచ్చగొట్టాను....ఇప్పుడు నీ గురించి అంతా చెప్తే, నీకు సాయపడగలనేమో ఆలోచిస్తాను."

"నిజంగానా, చిన్నోడా?" అందామె కళ్ళు తుడుచుకుని ఆత్రుతగా చూస్తూ, "వాడు నన్ను చంపకుండా కాపాడతావా?"

"నిన్ను వాడు చంపడు. వాడి గురించి పూర్తిగా చెప్తే, వాడి సంగతి నేను చూసుకుంటాను" అంటూ

బ్యాగులోంచి టేప్ రికార్డర్ తీసి నూలుమీద పెట్టాను.

ఆమె విచిత్రంగా చూసింది. "అదేమిటి చిన్నోడా?"

"ఇది సింగారం పెట్టె" రికార్డింగ్ ప్లే బటన్ లు కలిపి నొక్కాను.

"దాన్ని నాకిచ్చేస్తావా?"

"నువ్వు అన్నీ చక్కగా మాట్లాడితే ఇచ్చేస్తాను."

"ఇచ్చేయ్, చిన్నోడా! నా గేవ్ నాకేమీ తెచ్చివ్వడు. నా దగ్గర డబ్బు లాక్కుపోతాడు ..."

"వాడెక్కడుంటాడు? ఇక్కడుండడా?"

"ఊహూ. మలక్ పేటలో వేరే ఇల్లు తీసుకున్నాడు."

"ఎక్కడదది?" అడిగాను తిరుగుతున్న టేప్ ని చూస్తూ.

ఈ టేప్ నినింపి ఆ బొట్టుపోలిగాడి మాడుమీద కొడితే, వాడి బెదిరింపులేమిటో తెలిపోతుంది!

"గవర్నమెంట్ ప్రెస్ వెనుక....రిక్షాలు తొక్కే లంబాడీలుంటారు .... అక్కడే చిన్న పెంకుటిల్లు" చెప్పిందామె.

"వాడితో పాటు ఇంకెవరుంటారు?"

"ఏమో తెలియదు, చిన్నోడా. ఇక్కడికెవర్నీ తీసుకురాడు. వాడేం చేసేవాడో కూడా తెలిసేదికాదు. కానీ మెున్నొకరోజు ఏవేవో పెద్ద పెద్ద విషయాలు మాట్లాడాడు...."

"ఏం మాట్లాడాడు?"

"లక్షలు సంపాయిస్తాడట! నాక్కావల్సినవన్నీ కొని పెట్టి ప్రేమగా చూసుకుంటాడట. అసలిక్కడ ఉండమట మేము. యెక్కడికో వెళ్ళిపోయి పెద్ద వ్యాపారం పెడ్తాడట...."

"ఇంకా?"

"తనకో అక్క వుందని చెప్పాడు, చిన్నోడా. శ్రీమంతురాలట. ఆమె ఇస్తుందట డబ్బు. వూరికే ఎలా ఇస్తుందని అడిగాను. అప్పుడేదేదో చెప్పాడు. భయమేసింది. తాగివున్నాడు చిన్నోడా, బాగా! చాలా చెడ్డగా వాగాడు...."

"ఏం వాగాడు?"

"తన అక్క దేవత ఏమీ కాదట. నాకూ ఆమెకూ తేడా ఏమీ లేదట. ఎవరితోనో తిరుగుతోందిట, భర్త నుంచుకుని, ఆ తిరుగుళ్ళ తను ఫోటోలు తీశాడట. వాటిని చూపిస్తే ఇస్తుందట అయిదు లక్షలు....నీవన్నీ పిచ్చి మాటలని కొట్టిపారేశాను. ఏదీ చేయలేక వాడలాగే కలలు కంటాడు, చిన్నోడా. అవీ చాలా చెడ్డగా కంటున్నాడనుకున్నాను....

"కానీ చిన్నోడా, నా హేళనచూసి వాడు అరిచాడు. లక్షలు గడిస్తా చూడమన్నాడు. అలాగాకపోతే ఇంకెలాగో....ఇంకేదో పెద్ద ఆలోచన కూడా వుందట. దానికి తిరుగేలేదట! అదేమిటో చెప్పనన్నాడు. డబ్బు తెచ్చి చూపిస్తా చూడమన్నాడు ...అంతే, ఆ తర్వాత ఆ విషయమే ఎత్తలేదు వాడు. తాగిన మైకంలో ఆ రోజు ఏదో వాగాడు. నేను కూడా అది మర్చిపోయాను...."

ఆమె పరీక్షగా చూసింది నన్ను. "కానీ నువ్వేం చేస్తావు, చిన్నోడా? నన్నెలా కాపాడతావు వాడి బారి నుంచి?"

తేరుకుని రికార్డర్ ఆఫ్ చేశాను. "ఆలోచిస్తాను. ప్రస్తుతానికి వాడ్నీ ఛాయలకి రావద్దని హెచ్చరిస్తాను.

తప్పక బెదురుతాడు. ఒక వేళ మొండికేస్తే రేపే నిన్ని క్కడ్నించి తీసికెళ్ళిపోయి మరోచోట వుంచుతాను, అక్కడికెలా వస్తాడో చూస్తాను. కానీ నువ్వేం చేద్దామనుకుంటున్నావిప్పుడు?"

ఆమె కళ్ళు విషాదాపూరితాలయ్యాయి. "ఏమో చిన్నోడా, ఈ బ్రతుకేం అర్థంగావటంలేదు!"

"ఏం చదువుకున్నావు?"

"నా చదువు పనికిరాదు, చిన్నోడా?"

"చదువక్కర్లేదు. నీకో ఉద్యోగం ఇప్పిస్తాను, వస్తావా?"

ఆమె కళ్ళు వెలిగాయి. "ఎక్కడ చిన్నోడా?"

"నా బాస్ ఇంట్లో అతనికో చిన్న కూతురుంది. నువ్వు ఆయాగా వుంటావా?"

సంతోషంగా చూసిందామె. "అలాగే చిన్నోడా, నీకెంతో ఋణపడి వుంటాను."

"గుడ్!" నేను లేచి బ్యాగు సర్దుకున్నాను. "రేపొక సారి కలిసి నీకే విషయం చెప్తాను. వాడికి నువ్వీ సంగతి తెలియనివ్వద్దు."

"ఊంహు, వాడికేం చెప్పను."

ఆమె చేతిలో యాభైరూపాయలు పెట్టాను.

"ఎందుకు చిన్నోడా, నీకు నేనేం ఇవ్వలేదు."

"ఇప్పుడు నువ్వెవ్వరికీ ఇలా ఇవ్వవు. ఎవరైనా లోపలి కొస్తూంటే వాడి మొహాన తలుపు వెయ్యి."

బ్యాగు తీసుకుని బయటికి నడిచాను. ఆమె తలుపు వరకూ వచ్చి సాగనంపింది. నేను వీధిలో నడవసాగాను. రాత్రి బాగా గడిచిపోయింది. వీధి అంతా నిర్మానుష్యంగా వుంది. ఇప్పుడు నా మనసు కొంత నిర్మలంగా

వుంది. నాకో సాధనమంటూ దొరికింది ఎదుర్కోవ డానికి. వాడి ఆట పట్టించడానికి ఇంతకంటే అవసరం లేదు—

హఠాత్తుగా నా వెనుక అడుగులు విన్పించాయి.

నా సిక్స్త్‌సెన్స్ వెంటనే నన్ను వెనక్కి తిరిగేలా చేసింది. కానీ అప్పటికే ఆలస్యమైపోయింది....విసురుగా వచ్చిన ఆ రెండు ఆకారాలూ నన్ను చుట్టేశాయి. చీకట్లో వాళ్ళెవరో కన్పించలేదు. ఒకడి చెయ్యి నా శ్వాగుని లాక్కుంది. మరొకడి హస్తం నా నడినెత్తి మీద పడింది. ఠంగ్‌మని నా మెదడులో శబ్దమూ శూన్యంతో పాటు, కళ్ళముందు ఓ మెరుపు, తర్వాత చీకటి—

తిరిగి కళ్ళు తెరిచినప్పుడు నేను కిందపడిపోయి వున్నాను. క్షణాల్లో తేరుకొని ఏం జరిగిందో గ్రహించాను. లేచి పరుగెత్తాను వెనక్కి, రాణి ఇంటి వైపు.

ఇంట్లో ఆమె రక్తపు మడుగులో పడివుంది, కత్తి పోట్లు తిని.

# 8

టెలిఫోన్ గణగణా మోగుతోంటే బద్ధకంగా కళ్ళు తెరిచాను.

కిటికీలోంచి ముఖంమీద పడి ఎండ చురుక్కుమం టోంది.

లేచి మత్తుగా రిసీవరందుకున్నాను. రెస్పాన్స్ యిచ్చాను.

"ఏయ్, ఏమనుకున్నావో మల్లా! నువ్వు పిచ్చివేషాలు మానకపోతే పోలీసులకి పంపిస్తాం ఆ ఫోటోలు! గుర్తుంచుకో మల్లా, ఇది ఆఖరి వార్నింగ్!"

"ఎవరు—ఎవర్రా నువ్వు?"

"నోర్మూసుకోమల్ల!" ఫోన్ పెట్టేశాడు.

ఎవడు వీడు? ఆలోచిస్తూ నేనూ పెట్టేశాను. వీడెవడో కత్తులరత్తయ్యలా వున్నాడు. జుట్టుపోలిగాడు కాదు. వాడి అనుచరుడు, రాత్రి రాణిని చంపినవాళ్ళలో ఒకడు.

నిట్టూరుస్తూ టైము చూశాను. ఎనిమిది కావస్తోంది... రాత్రికూడా నిద్రలేదు. రాణి చాలా డిస్టర్బ్ చేసేసింది. చిన్నోడా, నువ్వు వాళ్ళ అంతు చూడకపోతే నిన్ను క్షమించను!—అని పదే పదే వచ్చి చెప్పింది కలలోకి.

ఈసరికి ఆ పేటలో ఆమె చావు తెలిసిపోయివుంటుంది. పోలీసులు వచ్చి వుంటారు. పేటలో వాళ్ళు జుట్టుపోలిగాడి గురించి చెప్పివుంటారు. పోలీసులు వాడి కోసం వెతుకుతూ వుండివుంటారు. రాత్రి వాడిల్లు వెతుక్కుంటూ నేను వెళ్ళాను. కానీ తాళం వుంది. ఎక్కడికైనా పరారయ్యాడా?

వాడెక్కడున్నా నన్ను కలిసితీరుతాడు!

టవలందుకొని బాత్ రూంకి బయల్దేరబోతున్నాను.... అప్పుడు మళ్ళీ మోగింది ఫోన్.

ఆగిపోయి, తటపటాయిస్తూ వెళ్ళి ఎత్తాను.

"ఓహ్, సురేష్!" అరిచింది అవతలి గొంతు.

ఉలిక్కిపడ్డాను గుర్తుపట్టి. "హలో, ఏమిటి?" అన్నాను, ఇప్పుడామెను పేరుతో పిలవాలంటే ఎలాగో వుంది.

"నువ్వొంటనే రా!"

"ఎందుకు?"

"మాట్లాడాలి!"

"ఏం మాట్లాడాలి?"

"నువ్వు త్వరగా రా, చెప్తాను!"

మళ్ళీ నేనేదీ అనే లోపు పెట్టేసింది ఫోను. ఆలోచిస్తూ నేను కూడా పెట్టేసి కదిలాను....

ఏమిటది, వెను వెంటనే ఇలా రెండు ఫోన్‌లు కాకతాళీయమా? ఇప్పుడు వీళ్ళిద్దరు ఒకేచోట వున్నారా? యెలా సంభవం? ఆ రత్తయ్య జుట్టుపోలిగాడి అనుచరుడైతే ఈమెకెలా తెలుసు? లేక ఆమే పెట్టుకుందా ఈ మనుషుల్ని? ఆమే చంపించిందా రాణిని? ఆమె తమ్ముడి ఈ కొత్త బ్లాక్ మెయిల్ నేనింకా చెప్పకముందే పసిగట్టిందా? మొన్న రాత్రి, వాడు మా యిద్దరి ఫోటోలతో వచ్చినప్పుడే అనుమానించి మనుషుల్ని నియమించిందా వాడిమీదా, నామీద?

ఆటో ఎక్కి నేను హోటల్ మార్క్యుకు పోనివ్వమన్నాను. అక్కడ నే నొకటి నిర్ధారించుకోవాలి. అదొక్కటే కేవలం నేనింతవరకు ఊహించుకుంటున్న శత్రు పథకం యొక్క అస్తిత్వాన్ని నిరూపిస్తుంది.... ఇప్పుడు నన్నెవరైనా వెంటాడుతూంటే, హోటల్‌లో నా ఎంక్వయిరీ ఏ విధంగా తనకు ప్రమాదకరమో వాళ్ళు ఊహించందరు. నా పొరపాటును ఏదో దిద్దుకుంటున్నాననుకుంటారు. నా శ్రేయస్సే వాళ్ళ శ్రేయస్సు కదా?

ఆ తర్వాత సరోజని కలవాలి—ఒకప్పుడు నాకున్న సర్వస్వాన్ని.

ఆమె ఎందుకు పిలిచింది నన్ను? ఏమిటంత అర్జంటుగా మాట్లాడాలంటోంది? నాకు నీరసం వచ్చేసింది....రాత్రి సంఘటన నన్ను నిర్వీణ్యుడ్ని చేసింది. రాణి ప్రాణాలు పోయాయి సరే, నన్ను రక్షించే అతి ముఖ్యమైన సామగ్రీ

పోగొట్టుకున్నాను—తిరిగి వాళ్ళ బందీనై పోయాను!

వారిపాడవునా నన్నెవరైనా వెంటాడారేమో తెలియదు. ఆటో దిగినప్పుడు వెనుక వందగజాలదూరంలో అనుమానాస్పదంగా ఏ కదలికా కన్పించలేదు. వేగంగా హోటల్లోకి నడిచి సరాసరి మేనేజర్ గదిలోకెళ్ళి పోయాను. అతడితో మాట్లాడాను.

"సర్, నిన్న మృతిచెందిన మిష్టర్ బి.జె.పి. రావ్ నాకు బాస్ అవుతారు. నేనాయన పర్సనల్ సెక్రటరీ మిష్టర్ సురేష్ని. మా బాస్ కలాపాలు ఇక్కడ మమ్మల్ని చాలా అప్ సెట్ చేస్తున్నాయి .... మాకు తెలిసి ఆయన ఇటువంటి పని యెన్నడూ చేయలేదు. ఆయన హై మోరల్స్, నీట్ క్యారెక్టర్ అందరినీ చాలా ఇంప్రెస్ చేసుంటాయి....కానీ నిన్న జరిగిందానికి.... ఆయన ఇక్కడెవరో స్త్రీని కలుసుకోవడాన్ని ....నమ్మలేకపోతున్నాం.

ఆయన బుద్ధిపూర్వకంగా చేసివుండరు. ఆయన బుద్ధిని ఎవరో మళ్ళించి వుంటారని నా అనుమానం. ఆఫ్టరాల్, ఆయన మగవాడు. పైగా మొహమాటస్తులు. ఎవరైనా ఆయన్ని బలవంతంగా ఆకర్షించి లొంగదీసుకోవచ్చు.... తనకుతానుగా ఆయన సాహసించలేరు. అందుకే ఇలా లొంగిపోయి ఈ పని చేశారు....కానీ పరిణామం ఆలోచించలేదు. ఆయన బ్రతికివుంటే ఆ పరిణామాన్ని ఎదుర్కోలేకపోయేవారని నా నమ్మకం...."

"ఏ పరిణామం అని మీ ఉద్దేశ్యం?"

"బ్లాక్ మెయిల్" అన్నాను వివరిస్తూ, "అందుకోసం తప్ప మరిదేనికీ ఆయన్నిలా లొంగదీసుకునే కారణం

కన్పించటంలేదు. బిజినెస్‌లో ఆయన చాలా కాంపి టీషన్‌ని యెదుర్కోవలసివచ్చేది....ఆయన్ని దెబ్బతీయ డానికి యెవరైనా ఇలా ప్రయత్నించవచ్చు. లేకపోతే బిజినెస్‌కి సంబంధించిన ప్రైవేట్ వ్యవహారం కావచ్చు. యెవరో బ్రతకనేర్చిన జాణ వలపన్ని డబ్బుకోసం బ్లాక్ మెయిల్‌కి పూనుకోవచ్చు...."

"బ్లాక్ మెయిలా? అదెలా చేస్తారు?"

"నాలుగు ఫోటోలు తీస్తే చాలు."

"ఓహ్, ఇంట్రెస్టింగ్‌గా వుంది."

"ఇలాటివి జరుగుతాయి. మీరు మిస్టరీస్ చదవరను కుంటాను—"

"చదవను. సామాజిక స్పృహ లేని సాహిత్యం సాహిత్యంకాదు."

"అయితే మీ తెలివి పెరగదు. ఇంతకూ నేచెప్పొచ్చే దేమిటంటే, డియర్ మేనేజర్, ఆమె గనుక అలాటి ఫోటోలు తీసివుంటే ఎకాంప్లీస్ సహాయంతో, వాటివల్ల మా బాస్ పరువు మర్యాదలకి మోసం వుంది. ఇప్పు డాయన లేకపోవచ్చు. కానీ ఆయన పత్నికి పంపి బెది రించే అవకాశం వుంది. ఏ పత్నీ తన పతి దుష్ప్రవర్తనని బయటపడనివ్వదు, ఏమంటారు? ఆమెకలాటి ఇబ్బంది ఏర్పడకూడదనే దృష్టితో, ముందు జాగ్రత్తకోసం ఆ యువతి జాడ తెలుసుకోవడం మంచిదనుకున్నాను .... దీనికి మీ తోడ్పాటు చాలా ముఖ్యం. అంతే!"

"ఆల్‌రైట్, అయితే ఏమిటో చెప్పండి."

నిట్టూర్చాను తేలికగా. అనుమానాలు కలక్కుండా ఇతను కన్విన్స్ అవడానికే ఈ వాగుడంతా కావల్సి వచ్చింది. ఇప్పుడు నా ఈ ఎంక్వయరీ పోలీసులకు తెలిస్తే

వాళ్ళు నన్నేం అపార్థంచేసుకోరు. యెంత విశ్వాస పాత్రుడైన సెక్రటరీ అనుకుంటారు. నేనీ ముసుగును ఇలాగే వుంచి కొనసాగాలి.

అతన్ని చూస్తూ అన్నాను. "నేను ఫోన్ కాల్స్ గురించి తెలుసుకోవాలి, మేనేజర్, ఆయన గదికి ఎన్ని కాల్స్ వచ్చాయో, యెన్ని వెళ్ళాయో వాటి వివరం కావాలి."

"కానీ..దీన్ని పోలీసులు చూస్తున్నారనుకుంటాను?"

"లేదు, వాళ్ళకు సంబంధించినంతవరకు కేసు ముగిసి నట్టే. ఇప్పుడే దర్యాప్తు లేదు. ఈ యువతి గురించి నాకొచ్చిన అనుమానం. ఆమె ఉద్దేశ్యం కచ్చితంగా నాకు తెలియదు. అందుకని పోలీసులకి చెప్పలేదు. తెలిస్తే అప్పుడు చెప్పవలసి వుంటుందేమో...."

అతను తలపంకించి, ప్రక్కనున్న క్లర్క్‌కి రెండు నిమిషాలు ఏదో వివరించాడు.

క్లర్క్ లేచి బయటికి వెళ్ళిపోయాడు.

"ఆపరేటర్ని కనుక్కొని వస్తాడు.... మిస్ రీనా మొన్న రాత్రి డ్యూటీలో వుంది" అన్నాడు మేనేజర్ నాతో.

థాంక్స్ చెప్పాను. అప్పుడు నా మనసును ఏదో దొలచసాగింది....మరణ సమయం. పోస్ట్ మార్టమ్ ఏమైందో నాకంతవరకు తెలియదు. ఇన్స్పెక్టర్స్ మళ్ళీ రాలేను. అందులో వాళ్ళకి అనుమానాలు రాలేదా? ఎందుకు రావు? రావ్ పదకొండుగంటల ప్రాంతాల మరణిస్తే శవం నాలుగు గంటలకి కనుగొనబడింది. ఈ మధ్యన నాలుగైదు గంటలు అక్కడ అలా బహిరంగంగా ఎలా పడివుందని వాళ్ళనుమానించటం లేదా?

ఆ రాత్రి హోటల్ ప్రాంతాల ట్రాఫిక్ పూర్తిగా తగ్గి, నిర్మానుష్యం అయ్యేదాకా నే నాగవల్లి వచ్చింది. అంతసేపూ కారుని దగ్గర్లోని చిన్న గల్లీలో నిలిపి ఉంచాను. ఈలోగా హోటల్ కెళ్ళి రావ్ గదిలో పని పూర్తిచేశాను. ఇంటినుంచి తెచ్చుకున్న రెయిన్ కోటూ, క్యాపుతో నన్ను బాగా మరుగుపరచుకున్నాను. రిసెప్షనిస్టు అడిగినప్పుడు గంభీర స్వరంతో కీరింగ్ టాగ్ ని తలక్రిందులుగా తిప్పి పట్టుకుని చూపిస్తూ, "రూం 98!" అన్నాను.

అతను నిద్రకళ్ళతో కీబోర్డువంక చూసి, పొమ్మని చెయ్యి ఊపాడు. నేను వేగంగా 98లో పని ముగించుకుని, అప్పుడే వచ్చిన కస్టమర్స్ తో బిజీగా వున్న అతడిముందు నుంచి కంటపడకుండా వచ్చేశాను.

అప్పుడు బయట నాకనుకూల వాతావరణం ఏర్పడే టప్పటికి మూడుగంటలై పోయింది. కారులోంచి శవాన్ని ఫుట్ పాత్ మీద ప్లాంట్ చేసి, ఆధారాలు సృష్టించి తృప్తిగా తిరుగుముఖం పట్టాను.

అది కాదు సమస్య—

మరణ సమయం తప్ప ఇతర అన్ని విషయాల్లో జాగ్రత్త తీసుకున్నాను. మరణ సమయంతో ఛాన్సు తీసుకోక తప్పలేదు. దాన్ని టాంపరింగ్ చేయటం సాధ్యంకాదు. అంతా పోలీస్ లాజిక్, వాళ్ళ శ్రద్ధను వదిలేశాను. వాళ్ళా యాక్సిడెంట్ ని బాగా నమ్ముతూంటే, మరణ సమయం ముఖ్యం కాదనుకుంటే, అంతా బాగానే వుంటుంది. అలాగాక పదకొండు ప్రాంతాల ఆ సంఘటన జరిగితే, అప్పుడంత రద్దీగావుండే ఆ ప్రాంతంలో ఎవరూ యెందుకు చూడలేకపోయారని కుతూహలం కలిగి బయ

తేరారంటే .... నాకు సమస్యలేర్పడుతాయి. అప్పుడు వాళ్ళనెలా కన్విన్స్ చేయాలి?

తీవ్రంగా ఆలోచిస్తోంటే వెళ్ళిన క్లర్కు తిరిగి వచ్చాడు.

ఆతృతగా చూశాను.

అతడన్నాడు. "రూం 98 నుంచి మిష్టర్ రావ్ ఆ రోజంతా యెవరికీ ఫోన్ చేయలేదు. మొన్నంతా ఒకే ఒక్క కాల్ బయటనుంచి వచ్చింది."

"ఏ సమయంలో."

"రాత్రి పదింపావుకి."

"యెక్కడ్నించి వచ్చింది?"

"తెలియదు. కానీ ఆ మాట్లాడిన వ్యక్తి గొంతు చిత్రంగా ఉండడంవల్ల బాగా గుర్తుండిపోయిందట ఆపరేటర్ కి...."

"యెలావుందా గొంతు?" అడిగాను ఆతృతని అణచుకుంటూ.

"పిట్ట అరిచినట్టు కీచుగా వుంది...."

ఉలిక్కిపడ్డాను. ఔట్టుపోలిగాడు! వాడి గొంతే అది!

వాడే రావ్ కి ఫోన్ చేసి రప్పించాడన్నమాట మా మధ్యకు!

నేనూహించిన కుట్ర నిజమని రుజువై పోయిందిప్పుడు!

వాళ్ళకి 'థాంక్స్' చెప్పి వేగంగా బయల్దేరాను అక్కడ్నుంచి.

# 9

ఈమేనా నే కెరిగిన సరోజని యెవరంటారు?

ఈమేనా యెప్పటి మనిషిలాలేదు. పోల్చుకోలేక పోతున్నాను. మొన్నటికీ ఇవ్వాల్టికీ యెంత తేడా! ఇది

నటన అనుకోవాలో, నిజంగానే భర్త చావు అంతగా కుంగదీసిందో తేల్చుకోలేకపోతున్నాను. నటన అయితే అది లోకానికి అవసరమన్న దృష్టి ఆమెకుండటం అవసరమే, ఒప్పుకుంటాను. కానీ నాముందు నటించనవసరం లేదే? నిజంగానే ఇంత బాధ పడిపోతూంటే ఈమె అంతరంగమేమిటో చాలా విచిత్రమైనదిగా వుండాలి! ఇప్పుడీమె గురించి లోతుగా ఆలోచించాలంటే నే భయంగా వుంది.

ఈమెనా నా శత్రువు?

ఈమెనా నాకీ పరిస్థితులు కల్పించింది? ఈమె ప్రయోజనాలకేనా నేను పావుగా ఉపయోగపడ్డది? నేనింత గుడ్డివాణ్ణా మోసపోవడానికి? నాకు మించిన తెలివి తేటలున్నాయా ఈమెకి?

లేదు, ఇప్పుడు నన్ను గురించి విచారించి లాభం లేదు. నడుం కట్టాలి. ఇక యెదురు దెబ్బ తీయాలి!

"సురేష్, నువ్వేం చేస్తున్నావో యెక్కడున్నావో తెలియదు....నిన్నట్నుంచీ కనిపించలేదు...." అందామె నన్ను ఆందోళనగా చూస్తూ.

"నో! నేనేం చేశానో, చేస్తున్నానో ఈమెకు బాగా తెలుసు! నంగనాచి! ఈమె నియమించిన రోగ్స్ అనుక్షణం నన్ను కనిపెడుతూ తెలుసుకుంటూనే ఉన్నారు. ఈమె ప్రతి చర్య తీసుకుంటూనే వుంది. నేనేం చేయబోతున్నానో, నా ఆలోచనలేమిటో ఇప్పుడీమెకు చెప్పబోవటం లేదు!

ఇదే మాట ఆమెకు చెప్పాను.

ఆమె చూసింది గాభరాగా. "యెందుకు? యెందుకు చెప్పలేవు? నేన్నీకు తోడ్పడాలనుకుంటున్నాను...."

"తోడ్పడాలనుకుంటున్నావా? అయితే యెవడో రోగ్ ఉదయం ఫోన్ చేసి బెదిరించాడు నన్ను.... వాడెవడో చెప్పగలవా?"

ఆమె చిన్నగా ఉలికిపడింది తెల్లబోతూ, కళ్ళలో ఏదీ దాచుకోవాలన్న విశ్వప్రయత్నాన్ని పసిగట్టలేక పోయాను. అలా వున్నాయి కళ్ళు. వాటినిండా భయం. ఈమె నటనా కౌశలానికి అభినందించాలా!

"యెవరు సురేష్? యెందుకు బెదిరించాడు?"

నవ్వాను. "లోకంలో యెవరైనా యెందుకు బెదిరిస్తారు? తమకేదో మూడుతుందని, లేకపోతే తామేదో మూటగట్టుకోవాలని. వాళ్ళకీ రెండిటి విచారముంది. అందుకే రాత్రి నామీద దాడి జరిపారు. ఒకర్ని చంపారు. నా ప్రయత్నాలు మానకపోతే ఆ ఫోటోలు పోలీసులకి పోతాయని ఉదయం బెదిరించాడు...."

ఆమె అవాక్కయిపోయింది. "ఎవరట? ఇంకెవరున్నారిందులో? నీమీద యెందుకు దాడిచేశారు? యెవర్ని చంపారు?

"నామీద యెవరు దాడిచేశారో, యెవర్ని చంపారో చెప్పి నిన్ను అప్ సెట్ చేయలేను. కానీ ఇందులో నీ తమ్ముడొక్కడే కాదు, మరిద్దరున్నారని తెలుసుకో. వాళ్ళు కంట్రోల్ చేస్తున్నారు. ఇప్పుడు అయిదు లక్షలు కావాలి వాళ్ళకు."

ఆమె కళ్ళు పెద్దవిగా చేసింది ఆశ్చర్యంతో. "అయిదు లక్షలా! యెందుకు, రెండు లక్షలే కదా...."

"కాదు. వాళ్ళకిప్పుడు ఇంకో పెద్ద పట్టు చిక్కింది. దిగిరారు."

"ఇంకేమిటి చిక్కింది!" అర్చిందామె అయోమ

యంగా.

అచ్ఛా, ఈమె నటనా సామర్థ్యాని కిప్పుడు పరీక్ష పెడతాను.

జేబులోంచి ఆ ఫోటోలు తీశాను నెమ్మదిగా....

అవి మడతపడి, నలిగి వున్నాయి. ఆమెని జాగ్రత్తగా గమనిస్తూ వాటిని వళ్ళోకి విసిరాను. ఆమె రియాక్షన్ కోసం వళ్ళంతా కళ్ళు చేసుకున్నాను.

వాటిని చూసిందామె. చూసి కళ్ళు విశాలంగా చేసింది, అవి చిన్నగా ఉలిక్కిపడ్డాయి. ముఖమంతా యెలాగో అయిపోయింది.... వాటిని పడేస్తూ గబుక్కున దగ్గరికి జరిగి నన్ను చుట్టేసింది చేతులతో, నా భుజం వెనుక ముఖాన్ని దాచేసుకుంటూ—తన భావాలు మోసపుచ్చకుండా! గుడ్ ట్రిక్! ఇది నేనూహించలేదు. ఆమె ముఖం, వళ్ళు చల్లగా తాకుతున్నాయి. చేతులు సన్నగా కంపిస్తున్నాయి....అవి నన్నింకా చుట్టివేస్తున్నాయి.

అలా కొన్ని క్షణాలు ఉండిపోయింది.

తర్వాత, "ఓహ్, సురేష్! భరించలేను...." అని అస్పష్టంగా మాత్రం గొణిగింది.

"వదులు!" అన్నాను విడిపించుకుంటూ, "మనం హాలులో వున్నాం, ముసలి రాజయ్య ఇటు రాగలడు.."

ఆమె వదిలేసి అలాగే దూరంగా జరిగింది సోఫాలో. అప్పుడామె కళ్ళలో నిస్సహాయత, ముఖంలో బేలతనం చూస్తే చక్కని అభినేత్రి అనిపించింది.... ఈమె ముందు ఏం పనికొస్తుంది వాణిశ్రీ? పరీక్ష నెగ్గింది. పుణ్యస్త్రీ కదూ?

ఆ ఫోటోలుతీసి నా జేబులో పెట్టుకున్నాను.

"యెలా ఇప్పుడు....ఎలా తీశాడు వాడా ఫోటోలు?"

"వాడి తెలివి వాడిది....నిన్ను డబుల్ క్రాస్ చేశాడు."

ఆమె ఏమాత్రం కంగారుపడలేదు, "డబుల్ క్రాస్ చేశాడా?" అంది అలాటిది తానేమీ యెరగనట్లు మామూలుగా.

ఇహ ఈమెను చీట్ చేయటం సాధ్యంకాదని తెలిసి పోయింది.

"అవును. వాడు ముందు వేరే ఫోటోలతో వచ్చి రెండు లక్షలు కావాలన్నాడు. ఇప్పుడీ ఫోటోలతో అయిదు లక్షలంటున్నాడు..నిన్ను డబుల్ క్రాస్ చేయడం కాదా?"

"ఓహ్, ఇచ్చేద్దాం! వాడి మొహాన పారేద్దాం! మనం క్షేమంగా వుంటే చాలు! అయిదు లక్షలో లెక్కకాదు, మన శ్రేయస్సుకంటే!"

ఆమె ఉద్రేకంగా అంటున్న ఈ మాటలు విని ఉలిక్కిపడ్డాను. జుట్టుపోలిగాడి మాటలు గుర్తొచ్చాయి రవూఫ్ కేఫ్‌లో. ఈమె అంత సులభంగా డబ్బివ్వదను కున్నాడు వాడు. చాలా ఒప్పించాలనుకున్నాడు. అలాగే నేనూ అనుకున్నాను. నా ఖర్మకొద్దీ యెలాగో ఒప్పించి వాడికా డబ్బింప్పించాక, ఇహ నన్ను దరిచేరనివ్వదను కున్నాను. కానీ ఇప్పుడు తనే డబ్బిచ్చేద్దామని అంటోంటే నాకరంగాలేదు, ఏమిటీ మార్పు? ఏదైనా అంతరార్థముందా? అయిదు లక్షల్ని అంత తేలిగ్గా వదులుకుం టుందా?

అప్పుడు నా మెదడులో ఏదో మెరిసింది.

"ఏమిటది? .... అసలా జుట్టుపోలిగాడు బ్రతికే వున్నాడా అని! లేక తాళంవేసిన వాడింట్లో చచ్చి

పడున్నాడా? ఆ వేళ వాడా రెండు లక్షలకోసం వచ్చి నప్పుడే, వాడి బ్లాక్ మెయిల్ టెండెన్సీని పసిగట్టి, ముందు ముందు కూడా ఈ ప్రమాదం వుంటుందని, ఈమె వాడి నోరు శాశ్వతంగా నొక్కేయించిందా తన రోగ్స్‌కి పురమాయించి?

అందుకే తమ్ముడితో కలిసి తను కుట్రపన్నినట్లు తెలిపే సాక్ష్యం ఆ టేప్ రికార్డింగ్‌ని నా దగ్గర లేకుండా చేసి, రాణినీ చంపించింది? ఇదేనా రాణి హత్యకు మోటివ్?

అందుకేనా డబ్బు గురించి ఇంత తేలిగ్గా మాట్లాడుతోంది?

ఓహ్, అయితే యిప్పుడు నన్నెందుకు పిలిచినట్టు? అసలు నాకు నేనుగా వస్తే తప్ప తను పిలవదనుకున్నాను. అలా నేను వెళ్తే పోలీసనగా నవ్వి గేటు చూపిస్తుందనుకున్నాను. తనకేమిటి ఇప్పుడు నా అవసరం? తను ఛీ కొడితే నేను చేసేదేముంది, వెర్రి మొహం వేసుకుని పోవడం తప్ప?

అయితే ఇప్పుడెందుకు పిల్చిందో తనే పిల్చింది. అంటే ఆ పని అప్పుడే చేయదు, నాతో చేయించుకునే పనులు ఇంకేవో మిగిలివున్నట్టున్నాయి. అవయ్యాకే చూపిస్తుంది గేటు! అంతవరకు ఇలాగే జాగ్రత్తగా వ్యవహరిస్తుంది, రంగు బయటపడకుండా!

"సురేష్! నాకెదంతా ఏదో భయంగా వుంది...." అని ఆమె చటుక్కున నన్ను పరీక్షగా గమనించడం మొదలుపెట్టింది. "ఏమిటది? యెందుకలా వున్నావ్? సురేష్! యెందుకలా నన్ను కొత్తగా చూస్తావ్.... ఇదంతా నావల్లే జరిగిందని కోపమా?"

"నీవల్ల ఏం జరిగింది? నేనే పొరపాటు చేశాను...."

"ఓహ్, విచారించకు ఇప్పుడు! డబ్బు గురించి ఆలోచించకు! వెధవ డబ్బు, ఎంత కావాలన్నా ఇస్తాను! వాళ్ళ నోళ్ళు మూయించు—"

"ఇంకా?"

"ఓహ్, అసలు నీకు ఇంకో పని — విషయం చెప్పడానికే పిల్చాను."

"అదే.... చెప్పు, ఏమిటది?"

"అతను ఉదయమే వచ్చాడు, ఏడుగంటలకి...."

"ఎవరు?"

ఆమె కణతలు నొక్కుకుంటూ చెప్పింది. "ఇన్స్పెక్టర్."

# 10

ముసలి రాజయ్య.

అతను చేతులు తుడుచుకుంటూ హాల్లోకొచ్చి, మమ్మల్ని చూసి ఆగిపోయి, తిరిగి తల వంచుకుని సాగిపోయాడు విచారవదనంతో.

యజమాని చావు మా అందరికంటే అతన్నే ఎక్కువ బాధిస్తున్నట్లులా వుంది. అవును మరి, యజమానితో అతడికున్న అనుబంధంతో పోల్చుకుంటే మేమెంత? చెడ్డవాడో, క్రూరుడో, ముప్పై ఏళ్ళుగా కనిపెట్టుకుని వున్నాడు విశ్వాసంగల జాగిలంలా. మరి మేము? మా గురించి యెంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది.

తేరుకుంటూ ఆమెను చూశాను. "ఇన్స్పెక్టర్ వచ్చాడా? ఏ ఇన్స్పెక్టర్?"

ఈ ప్రశ్న అడుగుతున్నప్పుడు నేను కేవలం మానవ రూపంలో వున్న యంత్రాన్ని. రోబాట్ ని. సర్వేంద్రి

యాలూ వాటి స్పందన మేరకు స్తంభించిపోయాయి. మాటలు యాంత్రికంగా వస్తున్నాయి...."

"ఇన్‌స్పెక్టర్ శివశేఖర్" చెప్పిందామె.

"యెందుకు? ఏమన్నాడు వచ్చి?"

"పోస్టుమార్టమ్‌లో ఏదో చిక్కు ఏర్పడిందట.... వాళ్ళు ముందు అనుకున్నట్లు చావు నాలుగు గంటలకు జరగలేదట. అంతకు చాలాముందే, అర్ధరాత్రి ప్రాంతాలే ప్రాణాలు పోయాయట! ఇది నిజమే కదూ? కానీ నేనేం చెప్పలేదు. అతను చెప్పిందే విన్నాను... "

"చెప్పు! ఇంకేమన్నాడు?"

"ఆయన యెప్పుడు చనిపోయినా చనిపోయినట్టుకిందే లెక్క, ఇక యెలా చనిపోయారో తామూహించినదానికి పోస్టుమార్టమ్‌లో భిన్నంగాలేదన్నాడు. మరణ సమయం ఒక్కటే తేడా వచ్చిందట. ఆ గాయం స్తంభంవల్లనే అయిందట, సురేష్. దాన్ని యాక్సిడెంట్‌గా తప్ప మరోలా అనుమానించలేమంటున్నాడు పోస్టుమార్టమ్ లోనూ, సర్కమ్‌స్టేన్‌షియల్‌గానూ!

శవంపైన వస్తువులు యధాతథంగా వున్నాయి. బహుశా ఆ స్తంభం మీద లైటు వెలగకపోవడం వల్లనే అన్ని గంటలు శవం యెవరికంటా బడలేదేమో అన్నారు. ఆ చూసిన ఆటో డ్రైవర్ కూడా నిజాయితీ పరుడు కావడంవల్ల శవాన్ని తాకకుండా తిన్నగా పోలీసులకి ఫోన్ చేశాడట. అదే మరెవరైనా నీచబుద్ధి గలవాడైతే శవంమీద వస్తువులన్నీ దోచుకుని తనదారిన పోవడమో, లేకపోతే ఉడుతా భక్తిగా ఓ ఫోన్ కొట్టి పోవడమో చేసేవాడట! అప్పుడది యాక్సిడెంటా లేక

దారి దోపిడీయా కచ్చితంగా తెలిసేది కాదన్నాడు...."

నేను మాట్లాడలేదు. చెవులు రిక్కించి వింటున్నాను.

"అంతే, సురేష్. అర్ధరాత్రి సమయంలోనే ఆ సంఘటన జరిగిందన్నాడు ఇన్స్పెక్టర్. అప్పుడే ఆయనా స్త్రీని బయట ఆటోలోనో, టాక్సీలోనో యెక్కించి పంపించేస్తూ యాక్సిడెంట్ పాలయ్యాడన్నాడు. కానీ నాలుగైదు గంటలవరకూ శవం యెవరికంటా పడకుండా వుండటం కొంచెం వింతగా వున్నా, వింతలెందుకు సాధ్యం కావూ అన్నాడు. మోటివ్ ఏదీ లేనప్పుడు, చావుకు కారణం స్పష్టంగా తెలుస్తున్నప్పుడు, మరణ సమయం ఒక్కదాన్ని పట్టుకుని తర్కించుకుంటూపోతే అర్ధంపర్ధంలేని అనుమానాలు చాలా వస్తాయన్నాడు. ఏమిటి ప్రయోజనం?"

నేనామె ముఖంలోకి ఆశగా చూశాను.

"అందుకని అంతసేపూ యెవరూ చూడకపోవడమనే అనవసర ప్రశ్నని లెక్కలోకి తీసుకోకుండా, దాన్ని యాక్సిడెంట్‌గానే నిర్ణయించి ఫైలు మూసేస్తానన్నాడు. నాకేవైనా అభ్యంతరాలూ, అనుమానాలూ వుంటే చెప్పమన్నాడు. చెప్పడానికింకేముంది? ఒక పరాయి స్త్రీతో ముడిపడివున్న ఈ వ్యవహారం యెంత తొందరగా ముగిస్తే అంతమంచిదన్నాను. అతను అర్ధం చేసుకుని అలాగే చేస్తానన్నాడు. అయితే మున్ముందు ఏమైనా కాంప్లికేషన్స్ ఏర్పడితే మళ్ళీ దర్యాప్తు గురించి ఆలోచించవల్సి వుంటుందన్నాడు.... కానీ కాంప్లికేషన్స్ ఏమున్నాయి, సురేష్? ఏమీ ఏర్పడవుకదూ..?"

అప్పుడు నేను తేరుకుని ఉద్రేకపడ్డాను. అంతవరకూ అణచుకున్న ఉత్సుకతతో లేచి గంతులేయాలనిపించింది!

ఇంకొక్కటి కాంప్లికేషన్స్! ఇదొక్కటే నేను భయపడ్డ కాంప్లికేషన్! ఈ గండమూ గడిచింది!'' ఆరాటాన్ని అణచుకోలేక ఆమెను లేపి గిరగిరా తిప్పేస్తూ ఉక్కిరి బిక్కిరి చేసేయాలనుకున్నాను. ఇలాంటి ఘట్టంలో ఓ ఆడమనసు అవసరం ఆనందాన్ని పంచుకోడానికి. మేం ఇప్పుడున్న స్థానాల్లో లేకపోతే అంతపనీ చేసేవాడ్ని. ఈ ఆడది నాకు తగలేదు. కలిసిరాలేదు.

"మంచి సంగతి చెప్పావు, సరోజా. థాంక్స్. ఇప్పుడు నా కెంతో రిలీఫ్‌గా వుంది! కానీ—నువ్వసలు ముందు చెప్పబోయింది ఇదికాదు—అవునా? ఉదయం నాకు ఫోన్ చేసింది యిందుకు కాదు—ఏమిటి? ఇందాక నువ్వేదో పని—అని చెప్పబోతూ మనసు మార్చుకున్నట్లున్నావు?"

ఆమె కళ్ళు చిటపటలాడిస్తూ చూసింది.

"అవును, సురేష్....నిన్ను మరొకందుకే పిల్చాను. ఇంత చేసినవాడివి నువ్వీపని చేయకపోతే ప్రమాదం....ఇది నాకెలా తట్టిందో-ఉదయం నేనాలోచిస్తూంటే మొన్న మనం చేసినదాంట్లో లోసుగులేమన్నా వున్నాయేమోనని-అనుకోకుండా ఇది తట్టింది...."

"ఏమిటది?"

"ఇది నీకూ తట్టిందనుకోను — అది, ఆడి—రాత్రి ఆయన యింటికి వచ్చినప్పుడు ఎలా వచ్చాడూ అని!"

నేనామె ముఖం చూస్తూండిపోయాను. ఏమిటీమె మాటలకర్థం?....అదిరిపడ్డాను! ఓ మై గాడ్! ఇది నాకు తట్టనేలేదు! యెంత పెద్ద పొరపాటు!

రావ్ యింటికెలా వచ్చాడు మొన్నరాత్రి హోటల్ నుంచి? టాక్సీలోనా? ఆటోలోనా? ఇప్పుడా డ్రైవర్

నా బాస్ మరణవార్తతో సహా ఫోటో, జీవిత వివరాలూ చూసి పోలీసులవద్దకి పరుగుపెడితే నా గతేం కాను!

"అర్థమైందా, సురేష్?" అందామె ఆందోళనగా చూస్తూ "ఆయన ఆటోలెక్కడు, టాక్సీలోనే వచ్చి ఉంటాడు. ఆ టాక్సీవాడ్ని మనం పట్టుకోవాలి!"

"ఎందుకు?" అన్నాను తేరుకుంటూ.

"ఓహ్, వాడు మన పక్కలో టైం బాంబులా వుంటాడు! యెప్పుడు పేలుతాడో, అసలు పేలుతాడో లేదో తెలియదు! అదేదో తెలుసుకుంటే మన ప్రాణాలకు హాయి కదూ, ఇలా భయపడుతూ కూర్చునేకంటే?"

"అవును.... అవునవును.... పేలుతాడని తెలిస్తే?"

"చంపెయ్యడం మంచిది. ఒకర్ని చంపావు, మరొకడ్ని చంపలేవా?"

ఉలిక్కిపడి ఆమెని చూశాను. ఎంత తేలికగా అనేసిందీమాటలు..ఆవేశంతో పళ్ళు కొరికాను. అర్థమైంది... అర్థమైంది, దొంగలరాణీ! నీ తొత్తులకి ఇది చాతవదు. ఆ డ్రైవర్ని గాలించి పట్టుకోవడం నా తెలివితేటలతో, నాతోనే సాధ్యపడుతుందనుకుంటున్నావు. వాడ్ని చంపే అవసరం, అగత్యమూ నాకే వున్నాయనుకుంటున్నావు. సరే,సరే, దొంగలరాణీ, నీకు నా క్షేమంకాదు ముఖ్యం. నావల్ల నీ యోగక్షేమాల కెక్కడ ముప్పు వస్తుందోనని నాకీ సలహా పారేసి పరోక్షంగా నిన్ను రక్షించుకుంటున్నావు. నేను దొరికిపోతే మనిద్దరి రంకు బయటపడుతుందని కాబోలు నీ జంకు.

ఆవేశం అణచుకుంటూ, "వాడ్ని పట్టుకునే ప్రయత్నం చేస్తాను" అన్నాను.

ఆమె తేలికపడింది. "ప్రమాదమనుకుంటే ప్రాణం

తీయడానికి వెనుకాడకు!"

"ఇహ ఇప్పుడు దేనికీ వెనుకాడను!"

"రాత్రి యెవర్నో హత్యచేశారన్నావు, ఎవర్ని?"

చాలా అమాయకంగా ఈ ప్రశ్న అడిగిన ఆమె ముఖంలోకి సాలోచనగా చూశాను. ఓహ్, నన్నెలా టాకిల్ చేయాలో ఈమెకు బాగా తెలుసు! నేను చెప్పే మాటలకి అతి జాగ్రత్తగా ట్రాక్ వుంచుకుంటోంది.... అనుమానాలు వేరే కలక్కుండా వాటిని అడిగేస్తోంది...

నేనన్నాను తీక్షణంగా, ఏవగింపుగా చూస్తూ. "నీ గతంలాంటిదే ఆమె వర్తమానం కూడా! నీ వెధవ తమ్ముడికోసమే తను బలియై వాణ్ని బ్రతికిస్తూ వెన్నుపోటు తింది, చాలా?"

ఆమె బిత్తరపోయి చూస్తూంటే నేను లేచి గబగబా వచ్చేశాను. ఎవరితో దాగుడుమూతలాడాలనుకుంటోందీ దొంగలరాణి?

బయట ముసలిరాజయ్య యెదురై కన్నీరు కార్చాడు.

"నేను సూడలేను, బాబయ్యా! అయమ్మగోర్నలా సూడలేను!"

"నన్నేం చేయమంటావు?"

"ఏంసేయగలం బాబయ్యా, దేముడు దయలేనోడు!"

"నువ్వు బాధపడకు తాతా, నువ్వే ఆమెకు ధైర్యం చెప్పాలి."

"నాకంత శక్తి యెక్కడిది, బాబయ్యా?"

"వుంది తాతా, నువ్వే ఆమెకు ధైర్యం చెప్పాలి..."

నేను చటుక్కున అక్కణ్నుంచి కదిలాను. అతన్ని 'తాతా' అని పిలిచేందుకు నేనిప్పుడు తగనన్పించింది.... నేనేంచేశానో తెలిస్తే ఎంత ఏవగించుకుంటాడీ ముసలి

తాత! పెద్ద వయసులో ఒకరి మనసు కష్టపెట్టే ఖర్మ నాకెందుకు పట్టించావు భగవాన్!

ఇంతకంటే చచ్చిపోవడం మేలు!

# 11

హోటల్ మార్య ఇంటర్నేషనల్ ముందు ఆటో దిగి చుట్టూ చూశాను.

నాకెక్కడా ఆ పరిసరాల్లో టాక్సీ స్టాండ్ కన్పించ లేదు. ఈ చివరనుంచీ ఆ చివరదాకా ఎక్కడా లేదు. బహుశ ఏ రన్నింగ్ టాక్సీలోనో ఎక్కివుంటాడు రావ్. ఎలా దాన్ని కనుక్కోవడం?

ఎదురుగా క్యాంటీన్‌లో వెళ్ళి కూర్చుని, ఒక స్ట్రాంగ్ టీకి ఆర్డరిచ్చి, లెక్క వేసుకున్నాను.... వెల్, యుగంధర్ - మొట్టమొదటి నా అభిమాన డిటెక్టివ్ పాత్ర—పుట్టిన నాలుగేళ్ళకు నేను పుట్టివుంటాను. మామూలు సెక్రటరీని బిజినెస్ తప్ప మరో వ్యాపకం తెలియనివాడ్నె, ఇప్పుడు యుగంధర్‌లా ఆలోచించాల్సిన పరిసితి నాకేర్పడింది. నేను యుగంధర్‌లా ఆలోచించి సక్సెస్ కాలేనా? చూద్దాం....

టీ తాగుతూ, ఒక సిగరెట్ కూడా వెలిగించుకుని, సీరియస్‌గా ఆలోచనల్లో పడ్డాను....ఆ టాక్సీ డ్రైవర్ కంటే జుట్టుపోలిగాడే డామినేట్ చేయసాగాడు ఆలోచనల్లో.

నిజంగా ఆ డ్రైవర్ వల్ల ప్రమాదముందోలేదో దేవు డెరుగు! కానీ జుట్టుపోలిగాడివల్ల నిశ్చయంగా వుంది! వాడా ఫోటోల్ని సెలుచేసి ఫ్రెండ్‌కిచ్చానన్నాడు, తను చచ్చిన పక్షంలో పోలీసులకి పంపమని. అది నిజంగా చేశాడా? లేక బుకాయింపేనా? వాడి దృష్టితో కేసు

తీవ్రతనిబట్టి చూస్తే చేసివుంటాడనే అనిపిస్తోంది. వాడి జీవన్మరణ సమస్య అది. ఎందుకు రిస్క్ తీసుకుంటాడు?

కాబట్టి ఇప్పుడు ప్రశ్నేమిటంటే—వాడిప్పుడు సజీవంగా వున్నాడా లేదా అనేది. వుంటే నన్నెందుకు కలుసుకోలేదింతవరకూ? రాత్రి నా దగ్గర యెవిడెన్స్ దోచుకుని, రాణీని హత్యచేస్తే, ఆ వెంటనే వచ్చి బెదిరించాలి కదూ—వ్యవహారాన్ని తానెంత సీరియస్‌గా తీసుకుంటున్నాడో కాంపిల్ చూడమని! తన కంత్రీల్ని నాకు పరిచయంచేసి ఇంకా భయపెట్టించాలికదా? అసలు డబ్బు గురించి మా ఆలోచన ఏమైందో తెలుసుకుందుకైనా రావాలి కదూ?

అందువల్ల, ఇలా ఇవేమీ జరుగకపోవడాన్నిబట్టి చూస్తే — ఆ రోగ్స్‌తోగానీ, రాణి హత్యతోగానీ వీడికేం సంబంధం లేదనిపిస్తోంది. ఆ పార్టీ వేరు, వీడు వేరు. కాబట్టి ఆ పార్టీ చేతిలో వీడి చావుకి అవకాశం ఎంతైనా వుంది. అప్పుడే నాకు ప్రమాదముంది—ఒకవేళ నిజంగా ఆ ఫోటోలు పోలీసులకి చేరే ఏర్పాటు జరిగి వుంటే, అప్పుడు సరోజా వుంటుంది, నాతోపాటు జైలు గోడలమధ్య. ఆమెనెందుకు వదుల్తాను?

సరోజ తమ్ముడ్ని చంపించివుంటే, పప్పులో కాలేసింది! తన చావును తనే తెచ్చుకుంది!

నవ్వుకున్నాను కసిగా.

నా పరిస్థితి ఏమిటో ఇప్పుడు స్పష్టమైపోయింది—ఆమెమీద నాకే గెలుపుకు అవకాశాలున్నాయి!

ఒకటి—ఆ ఫోటోలవల్ల నేను జైలుపాలవుతే తనూ అవుతుంది.

రెండు-ఒకవేళ ఆ ఫోటోల ఏర్పాటు బూటకమైతే,

మరే రూపంగానూ నాకు ప్రమాదం లేకపోతే, తనకూ వుండను కాబట్టి, ఆ ధైర్యంతో ఆమె నన్ను ఛీకొట్టి గేటు చూపించే అవకాశమే లేకుండా, నా దగ్గరా రంకు ఫోటోలున్నాయి!

ఇప్పుడు తేల్చుకోవల్సింది — ఈ పై రెండిట్లో ఏది జరగనున్నదో అనేది.

జుట్టుపోలిగాడి చావు తెలియనంత కాలం వాడి ఫ్రెండ్ దగ్గరా ఫోటోలు అలాగే వుంటాయి. వాడెవడో తెలుసుకుని నేను పట్టుకోగలిగితేనా.... వాడా పని చేయకుండా ఆపుతాను. అందుకవసరమైతే చంపుతాను. నేనెందుకు వెనుదీయాలిప్పుడు, నా భద్రతని గాలికొదిలేసూ? సరోజ ఏమంది? ఒకర్ని చంపావు, మరొకడ్ని చంపలేవా? వెల్, తప్పకుండా చంపుతాను. ఒక తప్పు చేశాక దాన్ని కప్పిపుచ్చడానికి ఎన్నో చేయాలి, తప్పదు.

ముందీ జుట్టుపోలిగాడి చావు నిర్ధారించుకోవాలి.

లేచి బిల్లు చెల్లించేసి గబగబా బయటకొచ్చి ఆటో యెక్కాను. ఇప్పుడా రోగ్స్ నన్ను వెంటాడుతున్నారనుకోను. నేను నాకు ప్రమాదాన్ని తొలగించుకునే ఎసైన్‌మెంట్ మీద వున్నాను—ఆ టాక్సీ డ్రైవర్ని పట్టుకోడానికి, అదీ సరోజ సూచనమీదనే, కాబట్టి నన్ను వెంటాడరు. నేను జుట్టుపోలిగాడింటికి పోతానని ఊహించరు.

## 12

ఆ వీధి నిర్మానుష్యంగా వుంది. వాడింటికి ఇంకా తాళం వేలాడుతూనే వుంది.

నన్నెవరూ గమనించటంలేదని నిశ్చయించుకుని,

కుడివైపు మూలాన్నుంచి పడుతున్న లైటు స్తంభం వెలుగుకి ముఖం ఇటు తిప్పుకుని తాళాల గుత్తితీసి చకచకా పని మొదలెట్టాను డిటెక్టివ్ వర్క్. ఆ పాత అలీగఢ్ తాళంకప్ప ఆల్చిప్పలా విచ్చుకుంటుంది, రాయి తీసుకుని ఓ దెబ్బకొడితే. కానీ అలాటి పని దొంగలు చేస్తారు. దొంగలకూ నాకూ తేడా వుంది. అందుకని అయిదు నిమిషాలు కష్టపడ్డా, ఆ యింటి ఆసామీలా లోపలికి అడుగు పెట్టాను.

తలుపు మూసేశాను వెంటనే. లైటు వేయకుండా లైటర్ వెలిగించాను. ఆ వెలుగులో ఆ ముందు గదిని చూశాను. అక్కడేమీ లేదు. కూర్చునేందుకు చిన్న స్టూలు కూడా లేదు. జైలు గదిలా నిరాడంబరంగా వుంది.

దాని వెనుక గదిలోకి వెళ్ళాను. అక్కడ సామానులున్నాయి. కింద పక్క పరచివుంది. అది చెదిరిలేదు. దుప్పటీ, దిండూ బాగా మాసివున్నాయి. పక్కనే నీళ్ళ కూజా, ఒక గ్లాసూ వున్నాయి. వాటి పక్కన చిన్న సూట్‌కేసు.

నేను పక్కనీ, దిండునీ తనిఖీచేసి సూట్‌కేస్ తెరిచాను. దానికి తాళంవేసిలేదు. లోపలబట్టలున్నాయి. రెండు సెక్స్‌పత్రికలూ, రెండు సినిమాతారల అర్థనగ్న చిత్రాలతోపాటు ఒక బ్రాసిరీ వుంది. షాక్ తిని లేచి పోయాను.

గాడ్, ఎలాటి కొంపలో వచ్చిపడ్డాను! అదెవరిది? ఆ వెధవ జీవితంలో ఈ మరో ఆడదెవరు? ఆమెకేమేం తెలుసు? ఇల్లు చూస్తే ఇంకా యెవరూ సోదా జరపనట్లు కన్పిస్తోంది, కానీ కేమేరా, ఫోటోలులాంటివి ఏవీలేవు. యెక్కడ దాచాడు వాటిని?....హఠాత్తుగా దుబ్బుమని

ఏదో శబ్దం! వెంటనే దగ్గరవుతున్న అడుగుల సవ్వడి! ఇంటి వెనుకభాగంలో చప్పుడు అవుతోంది! చటుక్కున లైటర్ నార్పేసి ఆ గది వెనుకవైపు తలుపు దగ్గరికి కదిలాను.

అడుగులు అక్కడే తలుపవతల తచ్చాడుతున్నాయి.

తలుపుకున్న సందులోంచి అవతల చూశాను. చీకటి. అంతలో తలుపు నానుకునే యెవరో నిలబడి వేగంగా ఊపిరితీసుకుంటున్న సవ్వడి!

నేను నిశ్శబ్దంగా పక్కకు జరిగి, గోడనానుకుని నిలబడ్డాను.

తలుపు లోపలినుంచి గడియ వేసి వుంది. గదిలో చిమ్మ చీకటి.

అప్పుడే ఏదో చప్పుడు కిరకిరమంటూ....

తలుపు సందులోంచి ఏదో వస్తోంది పాడుచుకొని..

దగ్గరికి జరిగి దాన్ని పరీక్షగా చూశాను. సన్నగా, అస్పష్టంగా ఏదో కనిపించింది. కడ్డీలాంటిది. పుల్ల— సైకిలు పుల్ల.

దాన్ని ఆసక్తిగా చూడసాగాను కదులుతూంటే.

అది చాలా లోపలికి పాడుచుకొచ్చి, గడియను పైకి లేపుతోంది.

తలుపు తెరచుకోబోతోంది!

నేను గబుక్కున పక్కకు జరిగి మళ్ళీ గోడకానుకున్నాను. ఆయుధంకోసం జేబులు చూసుకున్నాను. పొరపాటు! ఒక కత్తి వుంచుకోవాల్సింది.

నేనాలోచిస్తూండగానే గడియ పూర్తిగా లేచి ప్రక్కకుపడింది.

తలుపులు ఒక్కసారి తెరచుకున్నాయి!

ఊపిరి బిగబట్టి చేతులతో దాడికే సిద్ధమయ్యాను.

ఆ ఆకారం గప్ చిప్ గా లోపలికొచ్చేసింది....

అది నా పక్కనే గోడకున్న స్విచ్ నొక్కబోతూంటే—చటుక్కున ప్రక్కకు జరిగిపోయాను—దాడికి వెలుతురైతేనే బాగుంటుందన్న ఆలోచనతో.

హఠాత్తుగా లైటు వెలిగి గది ప్రకాశవంతమైంది.

కానీ నాకు దాడిచేసే అవసరం కన్పించలేదు—ఆ ఆకారానికి అసలా ఆలోచనే లేదు.

మేమిద్దరం ఒకర్నొకరం రెప్పవేయకుండా చూసుకున్నాం.

నాకంటే ముందు వాడే తేరుకుని, "నువ్వా!" అని నోరు తెరిచాడు.

నేను తలూపి నవ్వాను అవునన్నట్లు.

"నువ్విక్కడికెలా వచ్చావ్?" అన్నాడు ఈసారి ఆశ్చర్యమేగాక భయపడిపోతూ.

"నువ్వు మర్యాద తప్పుతున్నావు...." అన్నాను తీక్షణంగా చూస్తూ.

మా ఇద్దరిమధ్య అయిదడుగుల దూరముంది.

"సారీ, మిష్టర్ సురేష్, మీరిక్కడికెలా వచ్చారు?" వాడన్నాడు ఒక అడుగు వెనక్కువేస్తూ.

"ఎలా రాలేనో చెప్పు నువ్వు!" అన్నాను ముందుకు కదుల్తూ.

"అక్కడే ఆగండి! నన్ను కొట్టకండి!" అరిచాడు వాడు చేతు లడ్డంపెట్టి. "మీరెలా వచ్చారసలు? ఈ ఇల్లు యెవరికీ తెలీదు, ఆ చచ్చినదానికి తప్ప!"

"ఆ చచ్చినదే నాకు చెప్పింది" అన్నాను నేనాగి

పోయి, వాడికి హాని చేయనన్న నమ్మకం కలిగిస్తూ.

వాడు ధైర్యంగా చూశాడు. "ఓహ్, అయితే ఫరవాలేదు. పోలీసులకి యెక్కడ తెలిసిపోతుందోనని నేను భయపడ్డాను. అందుకే ముందు తాళంవేసి వుంచి వెనకదారి ఉపయోగించుకుంటున్నాను. పగలంతా బయటే గడిపి, రాత్రి పడుకోడానికి మాత్రమే వెనక గోడ దూకి వస్తున్నాను, సార్."

"నీ తెలివి బాగానే వుంది, దొడ్డిదారి వెధవా!"

"కానీ మీరిక్కడేం చేస్తున్నారు, సార్? మీరూ పారిపోయి వచ్చారా?" అన్నాడు వాడు పూర్తిగా భయం తొలగించుకుని, "రండి సార్, యిక్కడ కూర్చుందాం. మంచినీళ్ళు తాగుతారా?"

"వుండనీ.... రాత్రి అక్కరకొస్తాయి."

"దేనికి, సార్?"

"నీ కొత్త లవర్ కోసం కావద్దూ...."

వాడు ఉలిక్కిపడి చూశాడు. అంతలోనే తేరుకుని కోపంగా చూశాడు, "మిస్టర్ సురేష్, మీరిక్కడికెందుకొచ్చారో చెప్పడంలేదు. మీకీ విషయాలన్నీ యెలా తెలుసు?"

"ఏ విషయాలు, వెధవా?"

"లవర్ అంటున్నారు...."

"కొత్త లవర్ అన్నాను, నీ పెట్లో వెతికాను."

"ఓ, అదా!" వాడు నవ్వాడు, "అది నా లవర్ కాదు, మిస్టర్ సురేష్. నాకు లవర్స్ ఎవరూ లేరిప్పుడు. ఆ చచ్చినదాన్నుంచి పాఠం నేర్చుకున్నాను, లెంపలేసుకున్నాను. లవర్స్‌కెన్ని కోరికలు! యెన్ని ఆర్డర్సు! ఎన్ని సాధింపులు! ఓహ్ బ్రదర్, యెంత బోరు! సరిపడా

డబ్బులు పారేస్తే ఓ రాత్రికి కావల్సిందంతా ఇచ్చిపోయే బరితెగించిన భామలుండగా, వేరే యెవర్నో ప్రేమించడ మెందుకు? తలనొప్పి తెచ్చుకోవడ మెందుకు? నాన్సెన్స్ అంతా!"

వాడ్ని సూటిగా చూశాను కళ్ళలోకి. "రెండు పదులకే నలభై నిండిన మాటలు మాట్లాడుతున్నావు....ఏం భావరా అది? నీకిప్పుడే యెందుకురా ఇవన్నీ. అప్రాచ్యుడా!"

"అదిగో, నన్ను తిట్టే అధికారం మీకు లేదంటున్నాను! నా అక్కతో మీరు కులుకుతున్నారు.... ఏమన్నా అన్నానా నేను? యెవరి బ్రతుకు వారిదని సర్దుకుపోవాలి—ఫూరుకోవాలంతే!"

"వెధవా, నువ్వు సరోజకి తమ్ముడి వయ్యావు కాబట్టి సరిపోయింది. నా తమ్ముడివే అయివుంటే ఆనాడే— ఎప్పుడు?—తిరగమరిగినప్పుడే మక్కెలిరగ్గొట్టి కప్పెట్టేసే వాణ్ని."

"మీరు—మీరిప్పుడెందుకొచ్చారసలు?"

నవ్వాను. "ఓహ్, మాటల్లోపడి మర్చిపోయాను. నువ్వు ఉదయంనుంచీ కన్పించకపోతే నేనే బయల్దేరి వచ్చాను, డోస్ ఇచ్చిపోదామని."

"డోసా?"

"దేహ శుద్ధి .... వాయిదాల పద్ధతిపై చేస్తానని చెప్పానుగా?"

"మిస్టర్ సురేష్, మీకిదేం బాగాలేదు!"

"ఎందుకని లేదు, వెధవా?"

"ఆ ఫోటోలు పోతాయి పోలీసులకి!"

"ఛీ, నోర్మూయి! నువ్వింకా కళ్ళు మూసుకుని

వున్నావు. అవి నువ్వెక్కడికి పంపినా భయపడను, తెలిసిందా? నీకు తగినశాస్తి చేసే పోతానప్పుడు."

"ఏంచేస్తారు మీరు?"

"నీ అక్క పంపింది నన్ను — పట్టుకుని చంపమని నిన్ను. కానీ ఆ పని చేయను ఇంకోరకంగా నిన్ను శిక్షించిపోతాను. అప్పుడా ఫోటోలు పంపడం మంచిదా కాదా అని నువ్వే ఆలోచిస్తావు. కచ్చితంగా పంపమని నా భరోసా, నువ్వు బాగుండాలనుకుంటే!"

"ఏమిటది....అక్క డబ్బివ్వనందా?"

"కచ్చితంగా ఇవ్వనంది."

"ఎంత ద్రోహం?"

"నువ్వు చేయలేదూ? అందుకే యిప్పుడనుభవిస్తున్నావు?"

"ఇప్పుడు మీవల్ల ఏమిటి నాకు ప్రమాదం?"

"ఉంది, చాలా వుంది, నా షరతు ఒప్పుకుంటే చెప్తాను."

"ఏమిటా షరతు?"

"ఆ ఫోటోలు — నీ దగ్గరున్న అన్ని ఫోటోలూ నాకిచ్చేయాలి నెగటివ్స్‌తో సహా!"

"భలేవారే....బలేబాగు! ఎంతాశ....!"

"వెధవా, అనుభవిస్తావు .... నీ కిది తెలుసా? ఈ న్యూస్ బులెటిన్ విను....నీ బావగారు దిగిన హోటల్ గదికి ఆ రాత్రి ఫోన్ వచ్చిందట, పదింపావుకి. ఆ గొంతు గమ్మత్తుగా అనిపించటంవల్ల బాగా గుర్తుండిపోయిందట ఆపరేటర్ కి. కీచుగొంతు. వింటున్నావా? పిట్టలా అరిచాడట. ఆ తర్వాత నీ బావగారు కిందికి

వెళ్ళి టాక్సీకోసం చూస్తున్నప్పుడు, ఆ టాక్సీవాడు అప్పుడే వూడిపడి ఎక్కించుకుపోయాడట ఇంటికి.

ఆ టాక్సీవాడు బక్కగా నల్లగా, పొట్టిగా వుంటాడట. వయసు ఇరవై మించదట. నెత్తిమీద పెద్ద జుట్టువుంటుందట, పెంటకుప్పలా, వాడ్ని చూసిన ఒకడు జుట్టుపోలిగాడని పేరు పెట్టేశాడు. ఇంతకూ ఆ టాక్సీ వాడి స్వంతం కాదట. దొంగిలించి తెచ్చాడట..."

వాడి ముఖంలో రక్తం మాయమై ఏడుపు మొహం పెట్టేశాడు.

నేను నవ్వాను. "ఇప్పుడేమంటావు చెప్పు, హీరో!"

వాడదే మొహంతో ఏదో చెప్పాలని నోరు తెరిచాడు. వెంటనే మూసుకున్నాడు చటుక్కున.

రంకెలు వేయకుండా నిశ్శబ్దంగా, కత్తులు పట్టుకుని లోపలికొచ్చేశారు రత్తయ్యలిద్దరూ.

## 13

అప్పుడు చూశాను వాళ్ళిద్దర్నీ నేను—

ఒకటవ రత్తయ్య జాదు చక్రవర్తిలా కన్పించాలని ప్రయత్నిస్తున్నాడు.

రెండవ రత్తయ్య సీజర్‌లా కన్పించడానికి అవస్థ పడుతున్నాడు.

వాళ్ళిద్దరి చేతుల్లో కత్తులు తళుక్కున మెరుస్తున్నాయి.

జుట్టుపోలిగాడు భయకంపితుడై చూస్తున్నాడు వాళ్ళని.

వాళ్ళ ఆకారాలు మరీ విడ్డూరంగా, అసహ్యంగా వున్నాయి. మొన్న రాత్రి చీకట్లో సరిగ్గా చూడలేక

పోయాను.

జారు చక్రవర్తి శరీరం నిగనిగలాడుతూ, నల్లగా, గొడ్డు తోలులా వుంది.

సీజరుగారి శరీరం దుమ్ముకొట్టుకుంటూ, గుబురుగా, గొర్రె తోలులా వుంది.

వాళ్ళవైపు కన్నార్పకుండా నేను చూస్తూంటే, గొడ్డు తోలు అన్నాడు.

"ఏందిరా చెలరేగిపోతున్నావ్, చస్తావా?"

నేను తలూపాను అలాగే చూస్తూ, "అవున్రా, చంపు."

"ఓర్నీయవ్వ, అంత మొనగాడివా?"

"నీ మొహం, నువ్వంత మొగాడివా?"

"బొమ్మల్ల, చూస్తావా?"

"తప్పాదియ్యా, చూస్తాన్రా!"

నాది తెగింపని తెలుసు. నిజానికి వాళ్ళనెదుర్కొనే శక్తియుక్తులు నాకు లేవు. వాళ్ళలో ఒక్కడు చాలు సునాయాసంగా నన్ను లేపేయడానికి! అయినా నేనిప్పుడు వెనుదీయదల్చుకోలేదు. ఇలాటి పరిస్థితి ఎదురైతే చంపాలి లేదా చచ్చిపోవాలి—

జుట్టుపోలిగాడు తేరుకుని దూరంగా జరిగిపోతూ అరిచాడు.

"నామీద చెయ్యి వేశారంటే చూడండి, ఏమవుతుందో!"

"ఏమవుతుంది, బే?" గొడ్డుతోలు అడిగాడు.

"దాన్ని తెగనరికి దాంతో నే చావబాదుతాడు" అన్నాన్నేను.

"కాదు! ఆ ఫోటోలు పోలీసులికి పోతాయి!

పాలోమని జైలుకెళ్ళిపోతారు మీరంతా!"

"పోరా బచ్చా! పిచ్చిగా వాగక! నీ పిట్టమాతలకి బెదురుతామనుకున్నావా! నువ్వు ప్రతిఘటించేనే మాకు డేంజరు....లొల్లి చేయక చచ్చిపో!"

జుట్టుపోలిగాడి కళ్ళలో భయం మెరిసింది. ధైర్యం కోల్పోయి బయటికి పరుగుతీయబోయాడు. గొర్రెతోలు మెరుపు వేగంతో కదిలి వెనకనుంచి వాడి జూలుపట్టి లాగాడు. వాడు అమాంతంగా వచ్చి గదిలో కింద పడ్డాడు. వాడిమీద గొర్రెతోలు పడ్డాడు. ఇద్దరూ ఫైట్సు చేయనారంభించారు...

గొడ్డుతోలు నన్ను సమీపిస్తున్నాడు, కత్తిని తిప్పుతూ.

వాడి కదలికల్ని జాగ్రత్తగా గమనిస్తూ నేను దెబ్బ తీసే మార్గాన్ని ఆలోచిస్తున్నాను వేగంగా.

అవతలి టీములో పోటీ విపరీతంగా పెరిగింది. రొప్పుతూ రోజుకుంటూ ఒకరిమీద ఒకరుపడి దొర్లుతున్నారు. కత్తితో పెనుగులాడుతున్నారు.

కరాటే, జూడో, కుంగ్ ఫూలాంటి ఫైట్స్ ఏవీ నాకు తెలియవు. నాకు తెలిసిందల్లా పిడిగుద్దులూ, చెంప పెట్లూ. అలాగని నేనింతవరకూ ఏ దొమ్మీల్లోనూ పాల్గొనలేదు. ఎవరితోనూ పోరాడలేదు. ఇప్పుడీ ప్రాణ రక్షణ సమస్య వచ్చింది. ముందు వీడిచేతిలో కత్తిని ఎగరగొట్టగలిగితే, వీడి గొడ్డు కాయంతో ఎలాగో పట్లు పట్టి నేల కరిపించవచ్చుననుకుంటూ, కరాటే పద్ధతిలోనే పైకెగురుతూ కాలెత్తాను.

వాడు దాన్ని పుచ్చుకుని లాగేశాడు.

గుభీ గుభీమంటూ అవతలి టీమునుంచి పిడిగుద్దులు వినిపించాయి.

వెల్లకిలా విరుచుకు పడిపోతున్న నేను ప్రమాదాన్ని గ్రహించి, నామీదకి అడవి దున్నలా వచ్చి పడబోతున్న వాడి జిడ్డు ముఖంమీద, జాయింట్ పిడికిలిగా రెండు చేతులూ బిగించి మోదాను జమాయించి! ఠప్-ఫట్ మన్న ఆ దెబ్బకి వాడొక్క మూల్గుమూల్గి పక్కకు దొర్లి పోయాడు. కత్తి వెళ్ళి అవతల టీముదగ్గర పడింది. కింగ్స్ ఆఫ్ ది స్క్వేర్ రింగ్ సినిమాలో ఆంటోనియో ఇనోకిలా బొక్క బోర్లాపడి, తలతో నా ముఖాన్ని బద్దలు కొట్టేయాలనుకున్నాడు వాడు! నేనా సదవకాశం ఇవ్వలేదు.

వెంటనే నేను కిందనుంచి లేస్తున్న క్షణంలో, అవతలి టీములో ఏం జరిగిందో, జుట్టుపోలిగాడి ప్రతాపానికి అమాంతం వచ్చి నా మీదపడ్డాడు గొర్రెతోలు!

కత్తీ కొమ్ములూ లేవుగానీ వాడిదగ్గర, తలతో నా కడుపులో కుమ్మిన కుమ్ముకు పేగులు వెళ్ళుకొచ్చేసినట్లయింది! కళ్ళు తేలవేసి బాధగా అరవబోయాను. గొంతు పెగల్లేదు. వాడప్పటికే నా గొంతును బలంగాపట్టి నొక్కేస్తున్నాడు. ఊపిరికోసం ఉక్కిరిబిక్కిరి అయ్యాను. కళ్ళముందు చీకటి! చెవిలో రొద! కాళ్ళు చేతులూ ఆడటంలేదు... గొంతు నలిగిపోతోంది.... వాడు ఆయాసపడుతూ ఇంకా నొక్కుతున్నాడు. ఒక్కక్షణం ఇదే నా అంతం అనుకున్నాను....

అప్పుడు — కడుపుమీద దెబ్బనుంచి కొంతవరకు కోలుకున్న నేను, నా చేతులు ఫ్రీగా ఉండటంచూసి, వేళ్ళతో వాడి కళ్ళలో పొడిచాను.

ఒక విచిత్రమైన ధ్వని గదిలో మార్మోగింది. ఏ జంతువు అరుస్తుందలా? హఠాత్తుగా నామీద బరువు, గొంతుమీద పట్టూ తొలిగాయి. గబగబా ఊపిరిఅందింది.

అవయవాలు అదుపులోకొచ్చాయి. క్షణంలో మామూలు అయ్యాను. అవుతూనే స్ప్రింగులాలేచి ప్రక్కనే బోర్లా పడుకుని ముఖం పట్టుకుని బాధపడుతున్న వాడి తలమీద లాగి బలంకొద్దీ తన్నాను. వెల్లకిలా తిరిగి వాడు దొర్లుకుంటూ దూరంగా వెళ్ళాడు బాధగా అరుస్తూ.

టీము మారింది—

అవతలి టీములో గొడ్డుతోలూ, జుట్టుపోలిగాడూ, ఇద్దరూ కలిసి యమకొట్టుకుంటున్నారు. ఇద్దరి చేతుల్లోనూ కత్తులున్నాయి. రక్తాలు కారుతున్నాయి....

నేనాలస్యం చేయకుండా మళ్ళీ తన్నడానికి గొర్రెతోలుని సమీపించబోయాను—వాడంతలోకి చెవికోసిన నక్కలా లేచి కాలు విసిరాడు. ఆ దెబ్బ సరిగ్గా నాభికి తగిలేదే తప్పించుకోకపోతే, నేను పక్కకు తొలగడంతో వాడదే విసురుగా వెళ్ళి గోడని కొట్టుకుని కెవ్వుమని అరిచాడు.

వాడి అరుపుతో మరోకేక కలిసింది. నేను గొర్రెతోలు దగ్గరికి వురుకుతూ తలతిప్పి చూస్తే, అవతలి టీములో హోరాహోరీ పోరాటం జరుగుతోంది. ఆ కేక వేసింది గొడ్డుతోలు. వాడు కింద వెల్లకిలాపడి యెదురొక్కంటున్నాడు. జుట్టుపోలిగాడు వాడిమీద పడి యెక్కడపడితే అక్కడ పొడిచేస్తున్నాడు. గొడ్డుతోలు నుంచి పోట్లు తింటున్నాడు. కత్తులు, గాయాలు, మూల్గులు, రక్తాలు, భీభత్సం.

గొర్రెతోలు మెడపట్టి లేపి వాడ్ని గోడకేసి బాదాను. ముక్కులోంచి నెత్తురు కారి కెవ్వుమన్నాడు. మాగోసారీ అలాగే చేశాను. వాడి పళ్ళు కదిలిపోయాయి. పట్టు విడవకుండా మరోసారి బాదబోయాను, కానీ అవతలి

టీములో నిశ్శబ్దం నన్ను అటు చూసేలా చేసింది.

ఆ ఒక్క క్షణంలో గొర్రెతోలు కోలుకుని వూహించని దెబ్బతీశాడు. పొట్టలో పేగులు కదిలినట్లయి దూరంగా వెళ్ళి పడ్డాను. వాడు తలుపు దగ్గరికి పరుగు తీసేలోగే తిరిగిలేచి వాడ్నందుకున్నాను. కానీ వాడి చేతిలో కత్తివుందని నాకు తెలియదు. చెయ్యి విసిరాడు. వచ్చి తగిలింది. నా కుడిచెయ్యి మణికట్టుమీద కసిక్కున దిగింది. జివ్వుమని రక్తం చిమ్మింది.

వెర్రి ఆవేశంతో వాడిమీదికి వెళ్ళేలోగా వాడు బయటికి పరుగుతీశాడు, తలుపులు దగ్గరికి లాగేస్తూ. నేనాలస్యం చేయలేదు, చచ్చి ఒకరిమీద ఒకరు పడి వున్న గొడ్డుతోలు, జుట్టుపోలిగాళ్ళని దాటుకుంటూ, తలుపుతీసుకుని బయటకురికాను.

వీధి చీకటిగా, నిర్జనంగా వుంది. వాడు యెడమ వైపుగా ఉరుకుతున్నాడు. వంట్లో శక్తి తెచ్చుకుంటూ పరిగెత్తాను వాడి వెనుక. వాణ్ని తప్పించుకో నివ్వదు!

చూస్తూండగానే గొర్రెతోలు సందులన్నీ దాటేసి మెయిన్‌రోడ్డెక్కేశాడు. మధ్య మధ్యలో వెనక్కి చూస్తూ, వెంబడిస్తూన్న నన్ను పోల్చుకుని ఇంకా వేగం పెంచుతున్నాడు.

కొత్త కొత్త సందులూ, కొత్త కొత్త దారులూ, నాకందకుండా వాడు దౌడుతీస్తోంటే, వాడెక్కడో మాయంకాకుండా కాయశక్తులా వాడి ట్రాక్‌లో వుంటున్నాను. అలా పరిగెడుతూ పరిగెడుతూ, చివరికి మలక్‌పేట రైల్వేస్టేషను ముందు తేలాడు.

ఇహ చెంగు చెంగున మెట్లెక్కసాగాడు.

ఎత్తుమీదున్న ఆ స్టేషన్‌లోకి అన్ని మెట్లెక్కి నేను

ఈ పరిస్థితిలో రాలేనని వాడి ఆలోచన కావచ్చు. నిజంగానే నా పరిస్థితి అలాగే వుంది. ఆయాసంతో యెక్కడన్నా కూలబడాలనిపిస్తోంది. అయినా శక్తిని కూడదీసుకుని వురికాను మెట్లమీదికి, జనాన్ని తోసుకుంటూ.

అది చూసి వాడు నిజంగానే బెదిరిన గొర్రెపిల్లలా చిన్న కేక వేసి, దబదబమని పైకి చేరుకుని స్టేషన్‌లోకి దూరాడు.

అప్పుడు ఇంకో ప్రమాదాన్ని గ్రహించాను. వాడే రైల్లోనో ఎక్కిపోతే కష్టం! దాగుడుమూతలాడాలి. రైలు కదిలితే సాహసాలు చేయాలి. రైలు లేకపోతే ప్లాట్‌ఫాంమీదే వాడు జనంతో కలిసిపోయి జారుకోవచ్చు...

నా పట్టుదల మరింత పెరిగింది. వాడలాటి గుంపులోకి చేరకముందే చిక్కించుకోవాలి! వేగం పెంచి నేను స్టేషన్‌లోకి చేరుకోగానే, వాడు పదిగజాల దూరంలోనే కన్పించాడు, ప్లాట్‌ఫాంకడ్డంగా వురుకుతూ. అదృష్టవశాత్తూ ఏ రైలూ లేదు! జనమూ ఎక్కువ లేరు! వాడిక స్లిప్ ఇవ్వలేదు.

మేమలా ఉరుకుతూంటే జనం ఏమిటి? ఏమైంది? అంటూ కేకలేయసాగారు. జేబు దొంగ! నన్ను పొడిచి పారిపోతున్నాడు! అంటూ నేనాగకుండా వురకసాగాను.

వాడు ప్లాట్‌ఫాంమీంచి పట్టాలమీదికి దూకేశాడు. నేనూ దూకాను. నా వెనుక యెవరూ రాలేదు. అంతా ముందుకొచ్చి చూస్తున్నారు.

వాడు ఆగకుండా కుడివైపు యెంతో నేర్పుగా,

వేగంగా వురుకుతూంటే — పట్టాలకింద ప్లాంక్స్‌మీద అడుగులు సరిగా వేయలేక అవస్థపడుతూ నేను వెళ్తున్నాను. వాడ్ని వెంబడించడం ఇలా అసాధ్య మనిపించింది.

ఇద్దరి మధ్య యెడం క్షణక్షణానికీ మించిపోతోంది.. ఇరవై, యాభై, డెభై గజాల దూరంలోకి వెళ్ళి పోయాడు. అప్పుడు నేనలాగే అవస్థపడుతూ పరిగెడుతున్న వాడినల్లా, వందగజాల దూరంలో ఠక్కున ఆగిపోయాను వాడ్ని చూసి.

# 14

డాక్టర్ మనోహర్‌రావు చిరునవ్వుతో చూసి, "ఇప్పుడు నీకేం ఫరవాలేదు....ఒక యింజక్షన్ ఇస్తాను, నయమైపోతుంది—" అంటూ కదిలాడు, నా వీపుతట్టి.

బాధగా నా చేతిని చూసుకున్నాను. కట్టు బాగానే వుంది. కుట్లువేస్తానంటే వద్దన్నాను. ఇంజక్షను తప్పదు. ఇలా నా వంటిమీద డాక్టర్ చేయి వేయించుకుని చాలా ఏళ్ళయింది. రోగాలూ గాయాలూ నాకెందుకో తగలవు. ఇప్పుడీ సాహసకృత్యంతో తగిలించుకున్నాను.

ఇంజక్షనుకూడా ఇచ్చి ఆయన, "అయితే అప్పుడేం జరిగింది?" అనడిగాడు, తన కుర్చీలో వెళ్ళి కూర్చుంటూ.

అప్పటికి నేనింకా పూర్తిగా చెప్పలేదు.

నేనన్నాను, "వాడలా నా చేతిమీద పొడిచి పారి పోతూంటే పట్టుకుందామని వెంటాడాను, డాక్టర్. నేనక్కడ ఆటోకోసం చూస్తూ నిలబడ్డాను, మలక్ పేటలో ఫ్రెండ్ ఇంటినుంచి వస్తూ. అప్పుడా వెనుక నుంచి వాడు నా జేబులో చేయివేస్తే పట్టుకున్నాను. వాడు వేగంగా కత్తితో నా చేతిమీద పొడిచి పారి

పోయాడు....వాడ్ని వెంటాడుతూ నేను మలక్ పేట రైల్వేస్టేషన్ లో వరకూ వెళ్ళాను....వాడు ప్లాట్ ఫారం దూకేసి పట్టాలమీదికి వురికాడు. వాడ్ని వదలకూడదని నేనలాగే వెంబడించాను. కాని కొంతదూరంలో ఏమైందో కాలుజారి పడిపోయాడు...."

"పట్టాలమీద నే?"

"కాదు. వాడప్పటికి ఓవర్ బ్రిడ్జిమీద వున్నాడు. అక్కడ్నించి జారి కింద రోడ్డుమీద పడ్డాడు. అప్పుడే సిటీలోకి వస్తున్న సరుకుల లారీ వాడ్ని కాపాడలేక పోయింది...మీదకెక్కేసింది....చచ్చిపోయాడు అక్కడి కక్కడే."

"ఓహ్, వెరీ సారోఫుల్ డెత్!" కళ్ళు మూసుకుని అన్నాడు డాక్టర్, "తర్వాతేమైంది? నువ్వేంచేశావ్?"

"నేనక్కడ వుండలేదు. వాడి ప్రాణాలు పోతే నా బాధ్యత కాదు. పోలీసుల్ని కలవలేదు. వాళ్ళు వచ్చేలోపునే వచ్చాను....నా బాస్ చావుతో నాకు చాలా సమస్యలున్నాయి, ఇంకా ఆ తలనొప్పి ఎందుకు?"

"సమస్యలా?"

"కంపెనీ సమస్యలు" అంటూ లేచాను.

"అవును...మీ బాస్ కిప్పుడు వారసులెవరు?"

"అదింకా లాయర్ చెప్పలేదు. విల్లు రాశాగో లేదో కూడా తెలియదు. థాంక్స్ డాక్టర్. నా అయామ్ ఫైన్, మీ ఫీజుకు అంత డబ్బు ఇప్పుడు నా దగ్గరలేదు... మళ్ళీ వచ్చి ఇస్తాను."

బయటికి నడిచాను లేచి.

వర్షం కురుస్తోంది బయట హోరున...వెంటనే ఒక ఆటో ఎక్కి పోనివ్వమన్నాను. ఎక్కడికన్నాడు వాడు.

నీ యిష్టం ఎక్కడికైనా పోనివ్వమన్నాను. నేను చెప్పే వరకూ అలా తిప్పుతూనే ఉండమన్నాను. వాడు విచిత్రంగా చూశాడు. చేతిలో అయిదు రూపాయలు పెట్టి, వెళ్ళి మోడ్రన్ బ్రెడ్ అరటిపళ్ళూ తెమ్మన్నాను. ట్రాన్స్‌లో వున్నవాడిలా వెళ్ళి తెచ్చాడు. ఇక పోనివ్వమన్నాను ఆలస్యం చేయకుండా. వాడు తికమక పడిపోతూ స్టార్టు చేశాడు.

ఆటో పోతోంటే ఆహారం అరగిస్తూ నేను తిరిగి ఆలోచనల్లో పడ్డాను. ఆలోచనలకి ఒక్కోసారి మూడ్ మారుతుంది. నాకిప్పుడు ఇలా తిరుగుతూ ఆలోచించాలని వుంది...

వర్షాన్ని, ట్రాఫిక్‌నీ, లైట్లనీ చూస్తూ, రోడ్లన్నీ చుట్టేస్తూంటే ఆలోచనలు అలా సాగిపోతున్నాయి...

రాణి హంతకుల చావు మూడటం తృప్తిగానే వున్నా, నన్ను శత్రువు దగ్గరికి చేర్చే వాళ్ళిద్దర్నీ కోల్పోవడం నిరాశగా వుంది...

జుట్టుపోలిగాడూ చచ్చాడు. ఫోటోల గురించి వాడిదంతా బుకాయింపని ఇప్పుడు తెలిసిపోయింది. అందుకే చంపేశారు. వీడు అబద్ధాలాడుతున్నాడని అంత నమ్మకంగా ఎలా తెలుసు సరోజకి? తెలిస్తే ఎప్పుడో చంపేయకుండా నేను పట్టుకునేంతవరకూ ఎందుకాగింది? అసలా డ్రైవర్‌ని పట్టుకోమని నన్నెందుకు కోరింది— అదామె తమ్ముడే అయితే? తన కుట్ర ఇలా నాకు తెలిసిపోయేలా యెందుకు చేసుకుంది? నాకర్థంకావడం లేదు.

ఆమె తెలివిగా ఏదో గేమ్ ఆడుతోంది. అదింకా అంతుబట్టడంలేదు. ఆమె ఆలోచన ఏమై వుంటుంది?

టైమ్ చూసుకున్నాను. తొమ్మిదవుతోంది. ఇప్పుడు ఈ రాత్రి! ఆమె తన గుట్టంతా కక్కేయాలి! తమ్ముడ్ని చంపమని తనే పంపింది గనుక వాడి చావు ఆమెకు షాక్ కాదు. కానీ ఆ రోగ్స్ చావు వెయ్యి వోల్టేజిల షాక్‌లా తగుల్తుంది ఇప్పుడు తెలిస్తే....

నాకో అనుమానం వచ్చింది. ఆమె నన్ను కూడా చంపించాలనుకుందా? అవును, గొడ్డుతోలు ముందు నాతోనే సవాలు చేశాడు. రావడంతోనే చస్తావా అని బెదిరించాడు. నాకిప్పుడర్థం అయిపోయింది....తమ్ముడెక్కడున్నాడో తెలియదు వాళ్ళకి, నాద్వారా వాడి జాడ తెలుసుకుని మా ఇద్దర్నీ మట్టుబెట్టాలనుకుందామె!

నన్ను చంపాలనుకుంది! అదే ఆమె ఆలోచన.

ఆటోవాడికి ఆమె ఇంటికి దారిచెప్పి సిగరెట్ వెల్గించుకున్నాను....

ఇప్పుడామె బుద్ధి తెచ్చుకుని రాజీకొచ్చినా అది పరస్పరం మా ఇద్దరి రక్షణకొరకే కావాలి. ఆమెతో ఇంకే సంబంధాలూ వద్దు. ఆమె నన్ను ఛీకొట్టకముందు నేనే కొట్టాలి. నా విలువ దక్కుతుంది. ఆమె యెవరు నన్ను ఫూల్‌ని చేయడానికి? ఆమెను ఏ దృష్టితో చేరదీశాను నేను? తనేం చేస్తోంది నాకిప్పుడు!

ఆటో పోతోంటే ఆలోచనల్నాపి వర్షంలోకి చూశాను...మరింత యెక్కువైంది వర్షమిప్పుడు. అలా చూస్తూంటే మొన్న రాత్రి జ్ఞాపకం వచ్చింది...ఈ వర్షంలోనే నా బాస్‌ని కొట్టి చంపేశాను, ఈ ఆడదాని కోసం! నాకేడ్వాలనిపించింది....

నిజంగా నేను అతడు శాడిస్టు అన్న కసితోనే చంపానా, లేక సరోజ నాది కావాలన్న స్వార్థంతోనా?

కాదు — స్వార్థంకంటే అప్పుడతనికి శాస్తి చేయాలన్న ఇచ్ఛ కొంత, ఆత్మరక్షణాభావం కొంతా కలిసి నన్నాపని చేయించాయి! ఇద్దరు భార్యల్ని పొట్టన బెట్టుకున్నాడు కదూ అతను? స్వార్థంతో చేసినా వాళ్ళ ఆత్మలకి శాంతిని చేకూర్చాను—అది చాలు.

నేనొకడ్ని చంపానంటే నేనే నమ్మలేకపోతున్నాను. అనూహ్యంగా నేను హత్య చేస్తాననుకోలేదు. కానీ చేసేశాను. ఆ సమయం అలా వచ్చింది.... అందరు హంత కులకిలాగే ఇప్పుడీ పాట్లన్నీ! కానీ—

హత్యచేసిన రాత్రి .... ఆ దృశ్యమంతా కళ్ళముందు కదులోంది సినిమా రీలులా. అందులో నాకేదో అసహ జంగా కన్పిస్తోంది....నిజం. ఏమిటది? ఎక్కడ? ఆ సమ యంలో జుట్టుపోలిగాడిరాక! అవును, వాడెందుకొచ్చా డప్పుడు? హత్య ఫోటోలు తీయడానికి, కానీ ఇంట్లో కెందుకొచ్చాడసలు? ఆ ఫోటోలు తీసుకుని రహస్యంగా వెళ్ళిపోవచ్చునే? ఆ ప్రేమ ఫోటోలతో అప్పుడే వచ్చి వ్యర్థంగా బెదిరించడమెందుకు? అ స హ జ ం కదూ? ఏకంగా మర్నాడే వచ్చి ఆ హత్య ఫోటోలతో బెది రించవచ్చుగా?

నాకిందులో ఏదో కిటుకు వుందని నిశ్చయమైపోయింది- ఏమిటది? వాడి రాకలోని అంతర్యమేమిటి?

సిగరెట్ దమ్ము లాగుతూ ఆ రాత్రి సంఘటనను మళ్ళీ గుర్తు చేసుకున్నాను. రావ్ ని కిందపడేసి మీదెక్కి కూర్చున్నాన్నేను. చేత్తో పక్కనే ఫ్లవర్ వేజ్ అందుకుని అతని నెత్తి మోదాను. అది పట్టుతప్పి నా చేతి లోంచి దూరంగా పడింది. దాన్నందుకోబోతున్నాను. అదే క్షణంలో కింద కాలింగ్ బెల్ మోగింది. సరోజని

చూడమని కిందికి పంపాను. నేను గదిలోనే కొద్ది సేపు వున్నాను. రావ్ నేను కొట్టినప్పుడే స్పృహతప్పి పడి వున్నాడు. తర్వాత నేను కూడా గది తలుపులేసి కింది కెళ్ళాను. సరోజ అప్పుడే తలుపు తీసింది. జుట్టుపోలి గాడు లోపలికొచ్చాడు టార్చి పట్టుకుని.

—టార్చి పట్టుకుని.

—నేను బాస్‌ని కొట్టిన రెండు మూడు క్షణాల్లోనే కింద బెల్ మోగింది.

—సరోజ కిందికి వెళ్ళి తలుపు తీయడానికి కనీసం రెండు నిమిషాలైనా పట్టింది.

ఇప్పుడు ప్రశ్నేమిటంటే—నేను రావ్‌ని కొట్టినప్పుడు కిటికీ దగ్గర బాల్కనిలో వుండి ఫోటోలు తీస్తున్న జుట్టుపోలిగాడు, అదే క్షణంలో కిందికి వెళ్ళి ఎలా బెల్ నొక్కాడా అన్నది!

ఫోటోతీసి, బాల్కని దిగేసి వెళ్ళి ముందు తలుపును చేరుకోడానికి కనీసం రెండు మూడు నిమిషాలైనా పడు తుంది. కానీ క్షణాలే పట్టింది వాడికి. ఎలా సాధ్యం?

మాంత్రికుడు కాదు వాడు. బాల్కనీ అప్పుడే దిగ లేదు వాడు. బెల్ నొక్కనే లేదు వాడసలు. వాడి తరపున నొక్కారెవరో.

ఇక్కడ ఫోటో తీసిన వెంటనే అక్కడ కింద వున్న తన మనిషికి సంకేతం పంపాడు బెల్ నొక్కమని!

టార్చివేసి సూచించాడు అలా!

వాడిచేతిలో అప్పుడు టార్చికదే అర్థం!

తర్వాత బాల్కని దిగి సరోజ తలుపు తీసేలోగా చేరుకున్నాడక్కడికి!

అంతే! ఇంతకంటే మరో వివరణలేదు దీనికంతటికీ!

ఇలాగే జరిగింది కచ్చితంగా!

కానీ — యెందుకు జరిగింది? యెందుకలా చేయాలి అప్పుడు? అదే క్షణంలో బెల్ యెందుకు నొక్కాలి? మమ్మల్ని యెందుకు డిస్టర్బ్ చేయాలి?

నాకిప్పుడు తెలిసిపోయింది .... వాడా సమయంలో ఫోటోలతో రావడమన్నది ఉట్టి నాటకం! మమ్మల్ని కొంతసేపు కింద ఆపి వుంచడానికి వచ్చాడా వంక పెట్టుకుని! లేకపోతే హత్య ఫోటో తీశాక ఆ ప్రేమ ఫోటోలు ఏమంత పనికొస్తాయి?

వాడు మమ్మల్నా గదిలోంచి కిందికి రప్పించి, కొంత సేపు ఆపి వుంచడానికే ఆ ఫోటోలతో దండగ బేర మాడాడు!

అయితే—మరో ప్రశ్న—మమ్మల్ని యెందుకలా ఆపాలి?

దీనికి ఇక ఒక్కటే జవాబు వుంది ...నా గుండె అదిరిపడసాగింది. కొయ్యబారిపోయాను. నిజమా! అలా జరగడం సాధ్యమా! బాస్‌ని పూర్తిగా చంపడానికే మమ్మల్నా స్థలాన్నుంచి తప్పించారా! వాడి జతగాడు అప్పుడు పైకి చేరుకుని రావ్ తల బద్దలు కొట్టాడా!

దిమ్మెరపోయి కూర్చున్నాను.

వాళ్ళ ఉద్దేశ్యం రావ్‌ని నాచేత చంపించాలని కాదా? నేను చంపుతానని నమ్మలేదా? నేనే ఆ చండ శాసనుడి చేతిలో చస్తానని అనుకున్నారా? ఒకటి రెండు దెబ్బలు వేస్తూండగానే ఫోటో తీసి, నన్నక్కడ్నుంచి క్షణంలో తప్పించి, మిగతా పని తాము పూర్తి చేశారా!

ఇంత వర్షంలోనూ చెమట విపరీతంగా పట్టేస్తోంది నాకు.... నేను కొట్టిన దెబ్బకు రావ్ చావలేదన్నమాట!

స్పృహ తప్పాడు. నేనా గదిలో కాస్సేపు వున్నాను. అంత సేపూ రక్తంలేదు. అప్పుడే తల పగిలివుంటే రక్తం రావాలి! దేహం చిట్లిన క్షణంలో నే రక్తం చిమ్ముతుంది! దానికాలస్యం లేదు! ఈ కామన్ సెన్స్ నాకింతవరకూ స్ఫురించలేదు! ఇంత మానసిక శ్రమా, భయాందోళనలకు అనవసరంగా లోనయ్యాను!

ఆ సమయంలో తల చిట్లలేదంటే, రావ్ నా చేతిలో చావలేదు!

ఓ మై గాడ్, అయితే రావ్‌ని చంపింది నేను కాదా?

నేనంత అదృష్టవంతుడ్నా!

నా వళ్ళు పూర్తిగా చల్లబడిపోయింది....

ఎలా నమ్మాలి—దీన్నెలా నిరూపించాలి?

ఆటో వర్షాన్ని చీల్చుకుంటూ దూసుకుపోతోంది.

## 15

వర్షాన్నీ, చీకటినీ చీల్చుకుంటూ ప్రసరిస్తున్నాయి నా చూపులు తీక్షణంగా—ఆ ఇంటిమీదకి.

ఆ పెరటి గోడమీద పదినిమిషాలనుంచీ కూర్చుని వున్నాను, ఎదురు చూస్తూ.

వర్షానికి తడిసిపోతున్న స్పర్శ, చలికి వణికిపోతున్న స్పృహ నాకేమీ లేదు. నా గుండెల్లో రగిలిపోతున్న అగ్నికి ఇవేవీ తెలియడంలేదు. ఇంతటి వ్యధకు లోనైన మనసు వీటిని వెంటనే ఖాతరు చేయడంలేదు.

ఇప్పుడొక్కటే నా లక్ష్యం!

నాకు సాక్ష్యం కావాలి. నేను నిర్దోషినని నిరూపించుకునే సాక్ష్యం కావాలి. ఈ హత్య నేను చేయలేదు. ముమ్మాటికీ చేయలేదు. మనస్సాక్షి చెప్తోంది గట్టిగా. ఆ

రాత్రిని మననం చేసుకున్నకొద్దీ ఇంకా బలంగా నమ్మకం కలుగుతోంది నేను హంతకుడ్ని కానేకాను! అయ్యో అంత కాశం లేనేలేదు!

బిజినెస్ మాగ్నెట్ మిష్టర్ బి.జె.పి. రావ్‌ని హత్య చేసింది అతని పర్సనల్ సెక్రటరీ సురేష్‌కుమార్ కాదు. కానేకాదు.

నూరుపైసల నిర్దోషి సురేష్‌కుమార్. ఇది నిరూపించుకోవాలి.

ఇంట్లో ఏ శబ్దాలూ లేవు. పెరట్లో లైటు కూడా లేదు. టైము పదిదాటి అయిదు నిమిషాలు. సరోజ ఈ పాటికి నిద్రపోయి వుంటుందా? రోగ్స్ కోసం యెదురు చూస్తోందా?

గోడ దిగుతూ ఆలోచించాను .... జుట్టుపోలిగాడి ఆ జతగాడెవరు? బెల్ నొక్కించెవరు? పైకి వచ్చి హత్య చేసిందెవరు? ఆ రోగ్స్‌లో ఒకడా? గొడ్డుతోలుగాడా? సరోజకి తమ్ముడు బాల్కనిలో వున్న సంగతి తెలుసు. అయితే సరైన క్షణంలో చూసి కింద బెల్ నొక్కే వాడి కోసం టార్చి వేయమని మాత్రమే చెప్పింది—తన స్కీము ప్రకారం. కానీ వాడూ మెరుకు తెలియకుండా ఫోటో కూడా తీశాడు. అత్యాశకు పోయాడు, హతుడయ్యాడు!

నడుచుకుంటూ, కింద బురదనీటిని చిమ్ముకుంటూ, ఇంటి కుడిపక్కకు వెళ్ళాను. కిటికీలన్నీ మూసివున్నాయి. అలాగే ముందుకు వెళ్ళాను. అక్కడాగిపోయి యింటి ముందు ఆగివున్న కారుని చూశాను. అది వైట్ అంబాసిడర్. ఆ కారు బాస్‌ది కాదు.

ఎవరొచ్చారు ఇంటికి?

చిన్నగా ఇంటి ముందువైపు కదిలాను. చీకటిగా

వుంది. వరండాలో లైటు లేదు. తలుపు తెరచి వుంది. హాలులో లైటు వెలుగుతోంది. జాగ్రత్తగా వరండా ఎక్కి తలుపు పక్కన కిటికీని చేరుకున్నాను. లోపలికి చూశాను—

హాలులో వాళ్ళు ముగ్గురు కనిపించారు.

సోఫాల్లో ఎదురెదురుగా సరోజ, నా బాస్ లాయర్ విష్ణుకాంత్ కూర్చుని వున్నారు. ముసలి రాజయ్య కింద వున్నాడు. చిన్నారి జాడలేదు.

సరోజ, ముసలి రాజయ్య ముఖాలు వడలిపోయి వున్నాయి.

వాళ్ళు నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా వింటున్నారు లాయర్ చెప్తూంటే. "....అంతే, సరోజగారూ! నేనేమీ చేయలేను. ఇదంతా చెప్పడం నాకు చాలా బాధగా వుంది. పరిస్థితి ఇలా వుంది. దీన్నెవరు తప్పించగలరు, చెప్పండి? స్వయంగా ఆయనే ఏమీ చేయలేకపోయారు.. లేకపోతే మీకింత అన్యాయం చేసిపోయేవారే కాదు...."

"లాయర్ గారూ, నేనిది నమ్మలేకపోతున్నాను" అంది సరోజ పాలిగా.

"ఇదెవరూ నమ్మలేరు, సరోజగారూ. నాలోనే ఇంతవరకూ రహస్యంగా వుండిపోయింది. ఆయనలా వుంచమన్నాడు. ఆయన స్టాఫ్కి, స్నేహితులకి యెవరికీ తెలియనివ్వద్దన్నారు. ఇలాటివి ఎంత చెరుపు చేస్తాయో మీకు తెలుసు, బిజినెస్‌కి. కానీ ఇప్పుడు తప్పదుగా వెల్లడి చేయక?

"ఇప్పుడు చెప్పండి—ఆయన విల్లు ఏమని వ్రాస్తారు? తన తదనంతరం ఆస్తులన్నీ అమ్మేసి అప్పులు తీర్చమనా? ఇంకేం వ్రాస్తారు? ఆయన బ్రతికివుంటే ఇలాంటి పరిస్థితి

మీకు రాకుండా కృషి చేసేవారు. కంపెనీ స్థితి చెప్పుకో దగ్గంతగా హెల్దీగాలేదు, సరోజగారూ. వచ్చే లాభాల్ని నష్టాలు మింగేస్తున్నాయి. నష్టాల్ని పూడ్చడానికి అప్పులు చేసి బిజినెస్‌ని పెంచుకుంటూ పోయారు. ఏదేం దురదృష్టమోగానీ నష్టాలు పెరుగుతూ పోయాయి. కంపెనీ ఎస్సెట్స్‌తో సమానంగా లయబిలిటీస్ చేరుకునే పరిస్థితి వచ్చింది. బ్యాంకులో నాలుగు లక్షల ఓ.డీ, ఇంకా కొందరు ఫైనాన్సర్స్‌నుంచి పెద్ద మొత్తాల్లో అప్పులూ, ఇవేగాక మా మార్కెట్‌లో క్రెడిటర్స్ పెట్టిన అప్పులూ....

"ఇవన్నీ తీర్చాలంటే మొత్తం కంపెనీని వైండప్ చేసి, ఈ ఇల్లూ మిగిలిన ఆస్తులూ అమ్మివేయక తప్పదు, సరోజ గారూ. ఇవన్నీ మార్ట్‌గేజ్‌లో వున్నాయి. పార్టీలు ఇంకెంతకాలం ఆగరు. అప్పుడే కొందరినుంచి నాకు కాల్స్ వస్తున్నాయి..."

"ఇక మిగిలేదేమీ వుండదంటారు, అంతేనా?" అడిగింది సరోజ క్లుప్తంగా.

లాయర్ తలూపాడు మౌనంగా.

పేలవంగా నవ్వింది సరోజ. "అయితే పోనివ్వండి, లాయర్ గారూ. బాధపడకండి. నాకీ ఆస్తులూ పాస్తులూ ఏవీ అక్కర్లేదు. అంతా అమ్మేసి పంచిపెట్టేయండి. ఆ గొడవంతా మీరే చూసుకోండి. నేనిప్పుడంటే ఇప్పుడు నడిచిపోగలను బయటికి. నాకే బెంగాలేదు. కష్టాల్లోంచి నడిచివచ్చిన దాన్ని. నా గురించి ఏ బాధాలేదు. చిన్నారి గురించే నా విచారమంతా...నాతో పాటు దాన్ని కష్టాలకు గురిచేయటం...అది ఆలోచించలేకపోతున్నాను. అన్యాయం నాకు జరగలేదు, దానికే జరిగింది...ఈ క్షణంవరకూ అదీ యింటికి రాణి...ఇహ ఇప్పట్నించీ

నాతోపాటు నడివీధికి..."

"అయాం సారీ, సరోజగారూ, చిన్నారి గురించి నాకూ బాధగావుంది. ఇప్పుడు మీరేం చేస్తారు? ఎక్కడికి వెళ్తారు?"

"అది మీ కవసరం కాదనుకుంటాను, లాయర్ గారూ! మా బాగోగుల గురించి ఆయన చెప్పి వుంచలేదనుకుంటాను? ఆయన మీకు చెప్పినంతవరకే చేయండి. మాపై సానుభూతి కూడా వద్దు. సానుభూతి ఆయన మీద చూపండి. ఆయన చేసుకున్నదానికి అనుభవించి పోయారు. నాకిప్పుడే తృప్తిగా వుంది. ఈ సర్వనాశనమంతా ఇంటిని వల్లకాడు చేసుకున్న శాపం మూలంగానే..."

"మీరెలా వంటరిగా..."

"ఏం, నేనింతకంటే బాగా బ్రతకలేనా? నేను ఇక్కడేం సుఖపడ్డానని? ఆయన నాకేం ఇవ్వనప్పుడు, మిగిల్చి వెళ్ళనప్పుడు, మరణ శాసనం విధించినప్పుడు, నడివీధిలోకి విసిరినప్పుడు, నా ఇష్టం వచ్చిన నిర్ణయం తీసుకునే స్వేచ్ఛ నాకుంది! కాదనగలరా యెవరైనా?"

కోపంగా అని లేచి పోయింది సరోజ.

ఆమె మళ్ళీ గదిలోంచి రాలేదు.

లాయర్ నిట్టూర్చి లేచాడు. ముసలి రాజయ్య లేచి అతని చేతులు పట్టుకుని, "అమ్మగోరికి పెద్ద అన్నాయం సేసిపోయారు బాబయ్యా, అయ్యగోరూ?" అన్నాడు.

"ఇప్పుడు నువ్వేం చేస్తావ్, రాజయ్యా?"

"ముసిలోడ్ని! యెక్కడికన్నాపోయి సత్తాను బాబయ్యా, నాకేం?"

లాయర్ తల వూపేస్తూ, ఆవేదనగా గొణుక్కుంటూ, గొడుగు పట్టుకుని బయటికొచ్చేశాడు, నేను పక్కకు వెళ్ళిపోయాను తేరుకుంటూ.

నా మెదడు పనిచేయటంలేదు. విన్నదీ కన్నదీ కలా నిజమా అన్పిస్తోంది.

కారు స్టార్టయి వెళ్ళిపోయింది...

అప్పుడే ముసలి రాజయ్య బయటికొచ్చాడు, అతడా వర్షంలో వడివడిగా అడుగులేయసాగాడు అవుట్ హౌస్ వైపు. అతని నడకలో కోపం ఉద్రేకం తెలుస్తూనే వుంది. అతను భళ్ళున తలుపుని తన్ని లోపలికెళ్ళి పోయాడు. చటుక్కున లైటు వెల్గింది. ఆ వెంటనే చప్పుళ్ళు ప్రారంభమయ్యాయి...

నేను గబగబా అటువైపు నడిచాను. తలుపుదగ్గరాగి లోపలికి చూశాను కలవరంగా.

అప్పుడు చూడాలి అతని స్థితి—గదంతా తిరుగుతూ శివతాండవం చేస్తున్నాడు, కోపంతో తిట్టుకుంటూ ఉద్రేకంగా అరుచుకుంటూ! ఏదో అతీతశక్తి ఆవహించి నట్టు వూగిపోతున్నాడు. పెట్టెలోంచీ, బీరువాలోంచీ వస్తువులుతీపి విసిరేస్తున్నాడు...

"దేముడు మనమీద దయనూపలేదెహా... పోనీయ్! పెపంచంలో శానా డబ్బుంది, మరోశోట నూద్దాంలెహా పోనీ...."

నా ఏర్ బ్యాగుని కసిగా చింపుతున్నాడు. టేప్ రికార్డర్ని కాళ్ళకింద తొక్కుతున్నాడు. ఫోటోల్ని ముక్కలుగాచేసి పారేస్తున్నాడు. నెగెటివ్ లని నోటితో చింపి పారేస్తున్నాడు. కెమేరాని ముక్కలయ్యేలా గోడకేసి కొట్టాడు. పిచ్చిగా కింద కూలబడి నవ్వు

కున్నాడు. జుట్టు పీక్కున్నాడు. మరో నవ్వు పగలబడి నవ్వి అరిచాడు.

"పోయిందేహ...పోయింది! అనుకున్నది కాకుండా పోయింది!"

చప్పట్లు కొట్టసాగాడు లయగా.

"డబ్బుకోసమేనా రాజయ్యా, అయ్యగార్ని చంపావు?" అడిగాను నేను, వెనుకనుంచి మెల్లిగా.

# 16

భూమి దద్దరిల్లిపోయేలా దడదడమని గర్జించుకుంటూ పోయింది ఒక మేఘం, గగనతలంలో.

ఫెడేలుమని ఎక్కడో పిడుగుపడింది, దిక్కులు పిక్కటిల్లేలా.

అతడా షాక్‌నుంచి కోలుకోకముందే నేనే అన్నాను మళ్ళీ. "నువ్వు చెడ్డపని చేశావు, రాజయ్యా...నువ్వు చాలా దుర్మార్గుడివి!"

అతను పలకలేదు. అసలు నోరు తెరవలేదు. గుటకలు మింగుతున్నాడు, తప్పిదాన్ని కప్పిపుచ్చుకోలేకపోతున్న కళ్ళతో చూస్తూ, నిస్సహాయమైన చూపులు. ఎప్పుడూ చురుగ్గా, అవిశ్రాంతిగా వుండే అతని చేతులప్పుడు, చచ్చిన పాములా వేలాడుతున్నాయి. ఆ చేతులే బుస కొట్టి నా బాస్ ప్రాణాల్ని బలిగొన్నాయి.

"నువ్వింత చెడ్డవాడివనుకోలేదు, నిన్నసహ్యించుకుంటున్నాను!" అన్నాను కాస్త తీవ్రంగా, అతను తేరుకునేలా.

అప్పుడతను వూహించని వేగంతో లేచాడు కిందనుంచి. ఉరికివచ్చి అరిచాడు నామీద గొంతు చించుకుని.

"ఎవరు...ఎవర్ని సెడ్డవోడంటున్నావు? ఎవరు సెడ్డ

వోరు కారు? యెవరు సేయరు సెడ్డ పనీ? నేనేనా సెడ్డోణ్ణి? నువ్వు సేయడంలేదా సెడ్డ పనీ? నీ దొర సేయ లేదా సెడ్డపని? ఆ సరోజ సేయల్లేదా సెడ్డపనీ? ఎవరు సెడ్డపని సేయరు సెప్పు కుర్రోడా, ఈ పెపంచంలో!"

అతన్ని దూరంగా తోశాను. "డబ్బుకోసం ఈ వయసులో మువ్వు చెడ్డవాడివి కావడం ఆశ్చర్యంగా వుంది..."

"డబ్బుకోసం!" నవ్వాడతను పకపకా, "అవునోయ్, డబ్బుకోసం! డబ్బు యెవరికి అవుసరముండదు సెప్పూ? నీకుండదా? నాకుండదా? డబ్బవుసరంలేని యెదవ సన్నాసి యెవడున్నాడు సెప్పూ పెపంచంలో! డబ్బు మీదే పెపంచం నడుసుద్ది, డబ్బుతోటే పరువూ మర్యాదా నిలుసుద్ది. డబ్బులేని బతుకెందుకెహ...బతికి లాబంలేదెహ..."

"ఏంచేద్దామనుకున్నావు అంత డబ్బుతో?"

క్షణంపాటు అతను నిశ్చలంగా వుండిపోయాడు. తేరుకుని తొడచరచుకున్నాడు, హేళనగా నవ్వుతూ. "నీ పెస్న తగిలెయ్య! రాజసంగా బతకాలనుకున్నానోయ్, రాజసంగా! రాజబోగాలనుబగించడానికే గీవయసులో కూడా నేనింత గట్టిగా వున్నాను, సూడవోయ్! నీలాంటి కుర్రోళ్ళు పదిమందితో పరిగెట్టి పందెం చూలాగ్గా నేనే గెలిచీగలను, తెలుసోయ్?"

"కానీ జైలుకెళ్తావ్ కదా ఇప్పుడు—ఈ సంగతి తెలుసా నీకు?"

అతని ఆవేశమంతా దిగిపోయింది. తల వాలిపోయింది. నిస్సహాయంగా కింద కూలబడి, గోడకానుకుని కూర్చున్నాడు ముడుచుకుని. తల రెండు చేతుల్లో పట్టుకుని

ఆలోచిస్తూండిపోయాడు, నేలకేసి చూస్తూ.

వర్షం ఇంకా ఉధృతమైంది బయట...

"అవును, బాబయ్యా..." పలికాడతను అస్పష్టంగా, "నేను శానా తప్పుసేశా. పొరబడ్డా. లోగొట్టు నాకేం ఎరుక మరి? డబ్బు శానా వుంటాదనుకున్నా, దగా సేసి పోయేడు నీ వొర. ఆరి డబ్బు యవ్వారాలు నాకేం తెలుస్తాయి సెప్పు?..నాకిక సావే మిగిలింది..సావొక్కటే మిగిలింది..."

వెనకనుంచి నాకేదో తగిలింది చల్లగా...

చటుక్కున తిరిగి చూశాను.

నా కళ్ళు కొయ్యబారిపోయింది. తడిబట్టల్లో సరోజ!

నా చెయ్యి పట్టుకొని, నన్నానుకుని, గదిలోకి చూస్తోంది రాజయ్యనీ, కింద పడివున్న వస్తువుల్నీ, భయం నిండిన కళ్ళతో.

అపనమ్మకంగా, ఆందోళనగా, అయోమయంగా చూస్తున్నానామె వంక.

రాజయ్య దగ్గాడు. అతడి కళ్ళు సరోజమీదపడ్డాయి. ముఖ కండరాలు బిగుసుకున్నాయి. పేలవమైన నవ్వు పెదాలమీద నిలిచింది...

"వచ్చేవా అమ్మా...అదిగో బాబయ్యా. నీకు సెప్పి వోడ్ని గురుతున్నదా, మావోడు నన్నొగ్గిసి పోకపోతే నాకు నీఅంత మనవడుండీ వోడని? అదిగో నూడు... మనవడంత లేకున్నా మనవరాలుంది. నా మనవరాలు సరోజమ్మ..."

"నీ మనవరాలు సరోజనా!"

"ఆ నాగిగాడు నా మనవడేను, బాబయ్యా.... పిచ్చోదవ! పిచ్చోదవ! బొచ్చెడు అక్కరకొస్తాడనుకున్నా.

రాత బాగోలేక సంపుకున్నా! ఆడ్నీ, ఆడి పిల్ల దాన్ని రాణీని నే నే సంపించీసి పారీశా, పాపిష్టెదవని!"

"బాబూ, దాన్నేమనకు. దాని తప్పులేదు. వట్టి అమాయకురాలే... రెండేళ్ళక్రితాన, నీ దొరకాడ పనిలో కుదిరినప్పుడు దీన్ని నూసి శానా అబ్బురపడ్డా! ఎప్పుడో పన్నెండేళ్ళక్రితాన, దీనికి పన్నెండేళ్ళప్పుడనుకుంటా బాబయ్యా, నన్నొగ్గీసి పోయేడు మావోడు, నాతో పెంచాయితీ పెట్టుకుని. ఆయేలప్పట్నుంచీ ఆళ్ళ జాడ నాకేమీ తెలవదు. గప్పుడు దాన్నిక్కడే నూసి నేనెంత ఆనందపడ్డానో, బాబయ్యా, దేముడెంత ఇసిత్రంగా కలుపుతాడో కదా మడుసుల్ని!

"నా మనవరాలు నన్ను పోల్సుకుని ఏడ్సింది బాబయ్యా, తన కతంతా సెప్పుకుని. అది ఇని శానా బాదపడ్డా. మావోడంత ఎదవ సన్నాసీ అవుతాడనుకో లేదు, బాబయ్యా. ఆడబిడ్డని అలా నడీదిలో ఒగ్గీసి పోయేడు. ఆడి కొడుకూగంతే అయ్యేడు. ఏమైనా మడుసులం మల్లీ కలుసుకున్నాం. రక్తసంబంధమలాంటిది బాబయ్యా, నుడుసుల్ని కలిపితీరుతది యెప్పటికైనా."

క్షణమాగి, తిరిగి చెప్పసాగాడతను. "గప్పుడు బాబయ్యా, మన సంబంధం ఎవురికీ సెప్పొద్దని అమ్మాయికి సెప్పా గట్టిగా. యెందుకనంటే బాబయ్యా, నేనొక సక్కటి ఆలోచన సేసా. ముప్పై సంవచ్ఛరాలు ఈ ఇంటి కత నూశా. నీ దొర యవ్వారం నూశా. ఇద్దరమ్మల సావుల్ని నూశా. ఏణ్ణర్థం పిల్ల సిన్నారిని సాకడానికి ఇస్వ ప్రయత్నం సేశా. నావల్లగాలేదు. గిదంతా తెలుసుకుంటే దొరమీద సెడ్డ కసి పుట్టేసేది నాకు. గౌరవం, ఇస్వాసం యెంతకాలం నిలుస్తాయి బాబయ్యా, అవతలి

మడిసిలో గ్యానం ఇసుమంతైనా లేకుంటే.

"నిజం సెప్తున్నా, గప్పుడే డబ్బాశ పుట్టింది నాకు. ఇస్వాసం సూపడానికి నీ దొర ఇగ తగడని గప్పుడే తెలుసుకున్నా, ఇద్దరు ఇల్లాల్ని సంపుకున్నాడు! మడిసా! రాచ్చసా! మల్లీ మూడో పెళ్ళికి తయారయ్యేడు శరం లేకుండా! ఏమంటే సిన్నారికి దిక్కునే సాకు! గట్లయితే ఆ వొచ్చే అమ్మకి ఆశీ పీడ తొలగించీసి, సుఖంగా బతికే మార్గం సూపించీసి, నా దారినసీదా పోవాలనుకున్నా, డబ్బుతో."

సరోజ నా చెయ్యి గట్టిగా పట్టుకొని, రెప్పవాల్చకుండా చూస్తోందతన్ని.

"గప్పుడు బాబయ్యా, ఆ కొత్త యిల్లాలి స్తానంలో నా మనవారాలొచ్చిసింది. దానికి నేనే సెప్పి ఒప్పించా. యెంతకాలం యిలా బతుకుతావ్, నీ దొరని బాగా మంచిసేసుకో, లాబాలుంటాయి, మనవాదేశంటే మహారాణివైపోతావే తల్లీ అని. మోసం సేసేను, బాబయ్యా. గది నా సోర్దమే అయినా దాని మంచికోసమే సేశా.

"ఇల్లాలయ్యేకగాని తన కష్టాలు తెలవలేదు దానికి. అయినా సయించింది. దాని బాదలు సూడలీక నేను వేగిరపడ్డా. కాని నా ఆలోశన దానికసలు తెలియనివ్వలే. నా ఆలోశన—ఆశ—అదీ యాతనలు పడులీక ఏ పరాయోడ్నో సూసుకుంటే, ఉపాయంగా అళ్ళిద్దర్ని వాడుకుని దొరని ఖతంసేసి పారీసి, అది అళ్ళే సేసినట్టు నమ్మించి, డబ్బు గుంజుకుని ఎల్లిపోవాలనుకున్నా బెదిరించి—అర్థమైందా, బాబయ్యా?"

"ఏడాదిన్నర ఓపిక పలితంగా సువ్వొచ్చేశావు. అయిదు మాసాలు మిమ్మల్ని సూసీ సూసీ ఆలోశించా.

మీ యవ్వారం ఎవురికీ తెలవదనుకున్నారు మీరు. నేను గనిపెడుతూనే వున్నా. కానీ సమయం, ఒక మంచి మడిసి అవుసరం కూడా ఏర్పడ్డది నాకు...గప్పుడే ఇంకో ఇసిత్రం జరిగింది."

"ఏమిటి?"

"నెలకిందటే—ఆ సాయంకాలం సరోజమ్మ నీకాడికి కారేసుకుని ఎల్లినప్పుడు, ఇంట్లో యెవరూ లేరు, నేనూ సిన్నారీ తప్ప. సిన్నారి హాలులో కూసుని సదూకుంటోంది. నేను తోటలో తిరుగుతున్నా. గప్పుడే గేటులోంచి ఎవరో కుర్రాడు వచ్చాడు. ఆడ్ని చూసి దొంగాడనుకున్నా. ఆడు నాకాడికొచ్చి, ఇక్కడ నా అక్క సరోజ వుండాలి, యెక్కడ? అనడిగేడు.

"బాబయ్యా! ఆడ్ని పరీచ్చగా చూద్దునుగదా, పోలికలు కనిపించాయి. నా మనవడే ఆడు! సంబరంగా ఆడ్ని పట్టీసుకుని, ఓరి నాగిగా తాతనిరా భడవా! అన్నా. ఆడప్పుడు కోపం తెచ్చుకుని బూతులు తిట్టేడు. పేర్లు కూడా సెప్పి, సిన్నప్పటి ఇసయాలు గురుతు సేసీక గాని ఆడు నన్ను పోల్చుకోలేదు, బాబయ్యా."

నా చెయ్యి చుట్టూ పట్టు ఇంకా బిగుసుకుంది. సరోజ కన్నార్పకుండా చూస్తోందలాగే, పాలిపోయిన ముఖంతో. ఆ కళ్ళనిండా దిగ్భ్రాంతి మాత్రమే వుంది.

"అప్పుడు?" అడిగాను రాజయ్యని.

"గుంటడు బలేగా ఎదిగిపోయాడు, బాబయ్యా. ఆడు తెగ సంబరపడిపోయి నన్ను కావలించీసుకున్నాడు. ఆడ్ని నా గదికి—ఈడికి తీసుకొచ్చా. గప్పుడు మేం కూసుని శానా మాట్లాడుకున్నాం. ఆడి గోడంతా సెప్పుకున్నాడు. అక్క మాట ఇనకి పెడిపోయానన్నాడు.

తల్లి తరువాత అక్కే తల్లిలాంటిది రా ఎర్రికూసా అని మందలించా. ఆడిప్పుడు అక్కకాడ డబ్బులడుక్కుని ఏదైనా యాపారం పెడతానన్నాడు. ఇంకా కానా సెప్పేడు. ఈ ఊరుకొచ్చి ఏడాదైనట. అక్క గిక్కడే వుందని ఆయేలే తెలిసిందట...

"బాబయ్యా, ఆడి మాటలన్నీ ఇంటూ నేనాలోశన సేశా. నేను సేయాలనుకుంటున్న పనికి ఈడే నాకు తగ్గ మడిసనిపించింది. ఈడ్ని బాగా నమ్మొచ్చు. నా మనవడే నన్ను మోసం సేయడు. ఆడికి నా ఆలోశన అప్పుడే సెప్పేలేదుగాని, అక్కని గప్పుడే కలవొద్దన్నా. నామాట పెకారం నడసుకుంటే కానా డబ్బొస్తుందన్నా. మర్నాడు ఈ యేలకే వొస్తే అంతా ఇవరించి సెప్తానన్నా. ఆడలాగేనని ఎల్లిపోయి మర్నాడొచ్చేడు......"

చెప్పటం ఆపి అతను లోతుగా ఊపిరి పీల్చాడు.

వర్షం ఇప్పుడు తగ్గిపోతోంది. కానీ ఈదురుగాలి వీస్తూనే వుంది. తలుపు నానుకుని నిలబడ్డ మేమిద్దరం చలి వణుకును అణచుకోలేక పోతున్నాం.

"గప్పుడు బాబయ్యా, నేనాడికి అంతా సంగతి సెప్పేశా!" అన్నాడు రాజయ్య, చలికి వణుకుతూ. "నా మాటలిని ఆడు సంబరపడిపోయాడు. నాతో సేయి కలుపుతానన్నాడు. ఆ వొచ్చే లచ్చలతో నన్ను ఎక్కడికో తీసికెల్లిపోయి, పెద్ద యాపారం పెట్టేసి, పేణంలా సూసుకుంటానన్నాడు. నేనెంతకాలం బతుకుతాను బాబయ్యా, ఇలా ఒంటరిగా? నాకు దిక్కుగా ఆ బగమంతుడే పంపాడనుకున్నా ఈడ్ని, ఈ ఆఖరి దినాల్లో.

"ఇగప్పుడు ప్లానేసుకున్నాం. ఎప్పుడేది సేయాలి

సక్కగా ఆలోశించాం. నీ దొరకి మీ యవ్వారం ఏమీ తెలవదు అప్పటికింకా. ఆరింకా ఈలునామా రాయలేదని తెలుసు నాకు. ఆరు పోతే ఆస్తి మా సరోజమ్మదే. ఆరు పోవాలంటే మేం సంపేయాలి. సంపేసి డబ్బు పొందాలంటే మిమ్మల్ని బెదిరించీయాలి. మీ యవ్వారమంతా ఫోటోలు గుంజి బెదిరించీవొచ్చు...''

రాజయ్య ఊపిరి పీల్చుకున్నాడు. "అంతే బాబయ్యా, మొన్న రేతిరి సరీగ్గా మేమనుకున్నట్టుగా జరిగిపోయింది. మీరింట్లో కలుసుకున్నారు, దొర ఊరు కెల్లిపోయేరనుకుని. అది సూసి మావోడు దొరికి ఫోన్ సేసీడు, ఓటల్ దగ్గర్నుంచే. వెంటనే ఆయన బయటకొచ్చేడు. టాక్సీ కారు కోసం సూస్తూండగా, అది ముందే సిద్దం సేసుకుని ఆడనే వున్న మావోడు ఆరిని ఎక్కించుకు వచ్చేసీడు. సీకట్లో, ఆ తొందర్లో దొర ఆడ్ని సూడలేదు. ఆడు టోపీ పెట్టుకుని వున్నాడు."

సరోజ ఉలిక్కిపడ్డట్టు నన్ను తాకుతున్న ఆమె శరీరం చెప్పింది. కళ్ళు మూసుకుని ఆమె నా భుజం మీద తల వాల్చేసింది.

రాజయ్య అంటున్నాడు. "అలా దొర వేరే కారులో రావటం మంచిది కాదు, బాబయ్యా. ఆ డ్రైవరు సిక్కులు తెస్తాడు. సీకు సిక్కులు వొస్తే మా పని జరగదు. గందుకే మావాడు డ్రైవరు వేసం కట్టేడు...ఇగ దొర ఇంట్లోకి రాగానే, ఆరి ఎనకనే ఆడూ వొచ్చి, నన్ను తలుపుకాడ వుండమని సెప్పి, బ్యాట్రీలైటూ కామ్రా తీసుకుని, నిచ్చినీసుకుని బాల్కనీలో కెక్కేసేడు. గప్పుడేం జరిగిందో మీకు తెలుసు, బాబయ్యా.

"నువ్వు దొరని పడేసి కొట్టగానే ఆడు ఫోటో

గుంజేసి, కింద నాకు బ్యాటరీ ఏశాడు బెల్లు నొక్కమని. నేను నొక్కేశా. మీరిద్దరు కిందికి వొచ్చేసేరు. ఆలోపునే మావోడు దిగి వచ్చేసేడు. కామ్రా నాకిచ్చేసి, దొర కేమైందో సెప్పేడు. నేను నిచ్చినకాడి ఉరికి, బురద కాళ్ళు సుబ్బరంగా తుడుసుకుని, పైకెక్కి బాల్కనీలోకి దిగి కిటికీలోంచి దూకేశా.

"దొర యింకా అలాగే పడివున్నాడు. కొంచెం దూరాన పూలకుండీ పడివుంది. దాన్ని రుమాలుతో పట్టుకుని ఆరి తలమీద రొండు దెబ్బలు కొట్టా. రక్తం వచ్చింది ఎంటనే. ఆరి సచ్చిపోయేవరకూ సూసి, అప్పుడు కిందికి వచ్చేశా. మావోడింకా మీతో మాట్లాడుతూనే ఉన్నాడు, మీ పేను పోటోలతో బెదిరిస్తూ. మిమ్మల్ని కింద ఆపివుంచడానికే ఆడలా నాటకమాడేడు.

"తర్వాత ఆడెల్లిపోయి బయట కాసుకున్నాడు, నా దగ్గర కామ్రా తీసుకుని. లోపలుండి నే సూస్తున్నా మీరేం సేస్తున్నారో. దొర నువ్వు కొట్టిన దెబ్బకే సచ్చిపోయేడనుకున్నారు మీరు. శవాన్ని మీరెక్కడో పాతేత్తారనుకున్నా. కానీ నువ్వు యేరే యిదంగా బెమ్మాండంగా జరిపించీసీవు, సురేష్‌బాబూ. శబాస్ అనుకున్నా.

"శవంతో నువ్వెల్లినప్పుడు పైట ఆడు ఎంటాడి, యింకో పోటో తీసేడు ఓటల్ కాడ. గప్పుడు యింటి కెళ్ళిపోయి బండిని వొదిలించీసుకున్నాడు. అంతే బాబయ్యా, మర్నాడుదయం నిన్ను కలిసి ఆడా కానీ పోటోలు సూపించి నే సెప్పిన పెకారంగా అయిదు లచ్చలకి బేరం పెట్టేడు..."

రాజయ్య ముఖం ఎలాగో అయిపోయింది, లచ్చలనే సరికి. "మీరా డబ్బిత్తారని నమ్మకంగా అనుకున్నా.

మరో దారిలేదు మాకు మరి. కానీ ఇనిస్ట్రంమీద ఇనిస్ట్రం జరిగి—గదేంఖర్మో—బాబయ్యా—అంతా బుగ్గి అయిపో యిందో పో..."

సరోజ తేరుకుంది. ఆమె చాలా బలహీనంగా కనిపిం చింది...అతనీ రెండో రూపాన్ని చూడలేక, రెండు చేతుల్తోనో కళ్ళు మూసుకుని వెనక్కి తిరిగిపోయింది...

"కాదు-"అన్నాన్నేను అతన్ని తీక్షణంగా చూస్తూ "నీకు డబ్బు ఇప్పించాలని నేననుకోలేదు. నీవాడ్ని ఉచ్చులో బిగించి నాదారికి తేవాలనుకున్నాను. ఆ ఫోటోలన్నీ భేషరతుగా స్వాధీనం చేసుకోవాలనుకున్నాను...అందుకే వాడ్నప్పుడు వెంటాడి వాడిపిల్ల దాని ఇల్లు తెలుసుకున్నాను. ఆ రాత్రే ఆమెద్వారా కొన్ని విషయాలు తెలుసుకున్నాను. అయితే నాగేష్ నీకు చెప్పాడన్నమాట నా గురించి—నా చేతిలో ఎలా తన్నులు తిన్నాడో, ఇక ముందు కూడా తినే ప్రమాద ముందో! అందుకని వీడెవడో మొండిఘటంలా వున్నా డనుకుని, నువ్వు నామీద కిరాయి మనుషుల్ని నియమించా వన్నమాట! వాళ్ళతో నే ఆ రాత్రి నామీద దాడి జరి పించి, రాణిని చంపించావన్నమాట!"

"మరేం సేయమంటావు, బాబయ్యా?"

"తర్వాత ఇవ్వాళ ఉదయం — నేనూ సరోజా మాట్లాడుకుంటున్నప్పుడు—టాక్సీ డ్రైవర్ గురించి విని వుంటావు. అది నీ మనమడే గనుక వాడ్ని నేను పట్టు కుంటే నీ కుట్ర బయటపడుతుందని భయపడిపోయావు. అందుకే తిరిగి నామీద మనుషుల్ని పెట్టించి, నేను నాగేష్‌ని అలా పట్టుకుంటే, వాడ్ని చంపి పారేయమని ఆజ్ఞాపించావన్నమాట!"

"అంతే...తప్పలేదు, బాబయ్యా."

"బాగా జరిగింది. నీ కిరాయి మనుషులూ చచ్చారు. ఇక నువ్వు మిగిలావు, నీకూ చావొక్కటే మిగిలింది?"

"నేననుకోలేదు బాబయ్యా. ఇలా అవుతుందని. లాయరుబాబు వొచ్చి ఇలాటి వార్త సెప్తాడని. ఇంత అడియాస అయ్యేక ఇంకెలా బతకగలను? ఆశలన్నీ ఆ డబ్బుమీదే పెట్టుకున్నా. బతికిందే దానికోసం. నా మనవడ్ని సంపుకుందీ దానికోసమే. ఇవా డబ్బూపోయే. జైలుపాలయ్యే బతుకంటే ఎలా బరించగలను? సావే.... సావొక్కటే మిగిలిందిక నాకు..."

"అందుకే చచ్చిపో!" అంది సరోజ గిరుక్కున తిరిగి, "నువ్వెళ్ళిపో ఇక్కడ్నుంచే దయచేసి. నాకు నువ్వు లేవు—నాకెవరూ లేరు! ఇంకొక్క క్షణం కూడా వుండొద్దు నా కళ్ళముందు. నీ కొడుక్కి నువ్వేం తీసి పోలేదు. నీ కొడుకూ నువ్వూ నీ మనవడు కలిసి దగా చేశారు నా జీవితాన్ని. ఇకనైనా నేను సుఖంగా వుండాలనుకుంటే నువ్వు చచ్చిపోవడమే మంచిది, యెక్కడికైనా వెళ్ళిపోయి. నువ్వు చేసిన పాపాలకు నన్ను బలిచేయకు!"

అతను లేచి తూలుతూ వచ్చాడు. "లేదమ్మా, నీకింకా అన్నాయం సేయను. ఈ పాడు యవ్వారమంతా నాతో పాటే కలిసిపోద్ది మట్టిలో... పోలీసోళ్ళకి దొరకను. నిన్నిదిలోకి లాగను. యిప్పుడే పోయి ఏ రోడ్డుమీదనో, పట్టాలమీదనో పడుకుంటా. లేకపోతే యెందులోనో దూకుతా. పేణం తీసుకుంటా. గప్పుడే నాకు శాంతి.... గప్పుడే నాకు శాంతి...ఈ బతుకంతెవా!...సావులోనే సుకముందెవా!..."

తడబడుతూ, తూలుతూ, అడుగులేసుకుంటూ సాగిపోతున్నాడతను బయటికి. మేమలాగే చూస్తున్నాం కదలకుండా. అతడింకా వేగంగా, ఉద్రేకంగా చేతులూపుకుంటూ, ఏదో గొణుక్కుంటూ సాగిపోతున్నాడు చీకట్లోకి... గేటులోంచి కనుమరుగయ్యేవరకూ చూస్తూండిపోయాం నిశ్శబ్దంగా.

"సురేష్...ఓహ్, సురేష్!" హఠాత్తుగా ఆమె నా మెడచుట్టూ చేతులువేసి, ఛాతీపై తలవాల్చి వెక్కివెక్కి ఏడ్వసాగింది.

నా గుండె వేగంగా కొట్టుకుంది. తేరుకున్నాను ఆమె తల నిమురుతూ. "వూరుకో! ఇక అయిపోయింది. మనకేం కాదు. నేను హంతకుడ్ని కాను. నేను హత్య చేయలేదు తెలుసా!"

"ఓహ్, దేవుడెందుకీ పరీక్ష పెట్టాడు, సురేష్!"

"వాడికి సరదా."

నా మనసెలాగో అయిపోయింది. ఈమెనా అనుమానించాను నేను? థాంక్ గాడ్! నా అనుమానాలు బయటపెట్టి న్యూసెన్స్ సృష్టించలేదు నేనింకా! ఎంత అసహ్యించుకుని ఉండేది! డర్టీ ఫెలోని! డబుల్ డర్టీ ఫెలోని! ఎంత తిట్టుకున్నా నేను చేసిందానికి నిష్కృతి లేదు—

తలుపు మూసి, ఆమెని పట్టుకొని నడిపించుకుంటూ ఇంటివైపు సాగాను...

"సురేష్, ఇక యిక్కడేదీ మనది కాదు. ఈ క్షణం నుంచీ ఇక్కడ మనం అతిథిమాత్రులం. నాకేంకాలేదు. ఆ చిన్నారికే అన్యాయంచేసి పోయాడు తండ్రి..."

"నాన్సెన్స్—" ఆమె భుజంపట్టి వూపాను,

"చిన్నారికి దేనికవసరం డబ్బు? డబ్బా, డబ్బా! అదొక్కటేనా మనిషికి? దానికి ప్రేమ కావాలి, ఆదరణ కావాలి. అవి ఇవ్వలేనప్పుడు ఇంకేదీ ఆశించదు తండ్రి నుంచి."

"దాన్ని మన స్వంత బిడ్డలా చూసుకుందాం, సురేష్."

"అలాగే" అన్నాను. ఆమెని లేపి భుజాన వేసుకుని పరుగుతీశాను ఇంట్లోకి....

—:ఐ పో యి ం ది:—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

# రక్తపుటేర్లు

## వసుంధర

(గత సంచిక తరువాయి)

రామకృష్ణ కొనసాగిస్తున్నాడు.

మధుసూదనరావు, విజయబాబు దొంగనోట్ల తయారీలో భాగస్వాములు. కానీ కొంతకాలంగా వారికి పరస్పర విశ్వాసం నశించింది. ఒకరినొకరు దెబ్బతీయాలని ఎదురు చూస్తున్నారు.

మధురిమ దగ్గర్నుంచి ఆ కాగితాలు సంపాదించి విజయబాబును అల్లరిపెట్టాలని మధుసూదనరావు ప్రయత్నిస్తున్నాడు. వీలు చూసుకుని నాట్యం జరగాల్సిన రోజున ఆమెను డేంజర్ ద్వారా కిడ్నాప్ చేయించాడు. ఆయనక్కావలసింది దొరకలేదు. అయిదులక్షలు రాన్సమ్ అడిగాడు. విజయబాబు దొంగనోట్లు పంపాడు. మధుసూదనరావు మధురిమను వదలలేదు. అయినప్పటికీ మధురిమ నృత్యం ఆగిపోలేదు.

మధురిమను యెవరు కిడ్నాప్ చేశారో విజయబాబుకు తెలియలేదు. కానీ అందులో డేంజర్ పాత్ర ఉన్నదని అతడికి తెలిసింది. రామకృష్ణలాగే అతడూ డేంజర్ వెంటపడి నిన్న మధుసూదనరావును కలుసుకున్నాడు. వాళ్ళ సంభాషణలో ఇద్దరి నేరాల ప్రసక్తి వచ్చింది. యెన్నో కొత్త విశేషాలు తెలిశాయి.

విజయబాబు ఆవేశపడి — "మధురిమకు పట్టిన గతే నీకూ పడుతుంది — జాగ్రత్త—" అంటూ హెచ్చరించాడు.

వారి మొత్తం సంభాషణను టేపుచేశాడు రామకృష్ణ. మరో గంటలో విజయబాబు, మధుసూదనరావు, డేంజర్ అరెస్టయ్యారు. వారిచేత ఆ సమాచారం డీకోడ్ చేయించే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మధురిమకు సంరక్షకుడిగా ఉన్న భీమసేనుడికి కండ బలం తప్ప మరేదీ లేనట్లు బుజువయింది. అతడినుంచి పనికివచ్చే సమాచారమేదీ లభించలేదు.

అయితే మధురిమకు అన్నివిధాలా చేదోడువాదోడుగా ఉండే మంగళ అనే నల్లటి యువతి కనిపించడంలేదు. ఆమె విజయబాబుకు భయపడి పారిపోయిందని అంచనా. ఆమె దొరికితే ఇంకా చాలా సమాచారం లభిస్తుందని ఆశ. ఆమె విజయబాబుకు బందీగా ఉన్నదేమో అని కొంతకాలం అనుమానించటం జరిగింది. ఇప్పుడు విజయబాబు వ్యవహారం బయటపడటంతో మంగళ గురించి ఏమీ తెలియటంలేదు.

"మంగళ మా ఇంట్లో ఉంటోంది-" అప్రయత్నంగా అన్నాడు ప్రతాప్.

రామకృష్ణ తెల్లబోయి-"ఏమన్నారూ?" అన్నాడు.

కొంత నిజమూ, కొంత అబద్ధమూ జోడించి ప్రతాప్ మంగళ గురించి రామకృష్ణకు చెప్పాడు. ఆపదలో ఉన్న అబల అయిన కారణంగా తనామెకు ఆశ్రయమిచ్చినట్లు చెప్పాడు.

సరిగ్గా అప్పుడే జాహ్నవి అక్కడకు వచ్చింది. ఆమె జరిగినదంతా విన్నట్లుంది—"అదేంకాదు—మంగళను బావ

ప్రేమిస్తున్నాడని నా అనుమానం. అసలు విషయం దాస్తున్నాడు ...." అంది.

రామకృష్ణ నవ్వి—"మంగళ అసలు రూపాన్ని మీరు చూసి వుండరు. చూసి వుంటే ఈ మాట అనేవారు కాదు—" అన్నాడు.

అతను తక్షణం ప్రతాప్ యింటికి బయల్దేరాడు. ప్రతాప్ తనకు వేరే పని వుందనీ—రాలేననీ అన్నాడు. రామకృష్ణతోపాటు జాహ్నవి కూడా ప్రతాప్ ఇంటికి వెళ్ళింది. రామకృష్ణ తన అదృష్టానికి తనే పొంగి పోయాడు.

అనుకోని ఈ విశేషానికి మంగళ యిబ్బంది పడింది. ఆమె రామకృష్ణతో తను మంగళను కానని అన్నది.

"నీ రూపం చూసి కానీ నేను వెళ్ళను...." అన్నాడు రామకృష్ణ.

సీతాపతి, లక్ష్మమ్మ, జాహ్నవి-అంతా ఆమె రూపం చూడాలని కుతూహలపడుతున్నారు. రామకృష్ణ బల ప్రయోగం చేస్తానని బెదిరించవలసి వచ్చింది. అక్కడ మంగళకు అనుకూలంగా మాట్లాడే వారెవ్వరూ లేరు.

మంగళ బురఖాలోంచి బయటపడింది.

ఆమె రూపం చూసి సీతాపతి దంగైపోయాడు. జాహ్నవి ఆశ్చర్యపడింది. రామకృష్ణ తెల్లబోయాడు.

"మధురిమ!" అన్నమాట అప్రయత్నంగా అతని నోటివెంట వచ్చింది.

"నా పేరు మధురిమ కాదు...." అందామె.

"నువ్వు మధురిమవే....—కానీ ఇదెలా సాధ్యం?" అన్నాడు రామకృష్ణ. చనిపోయిన మధురిమ సజీవంగా తనముందు నిలబడిన నిజం జీర్ణించుకుందుకు—అతడికి

చాలా కష్టంగా వుంది.

"రామకృష్ణా! అన్నీ చెబుతాను....నీతో మీ ఇంటికి వస్తాను....బురఖాలోనే!" అందా యువతి.

"చాలామంది నన్ను అందగత్తె అంటారు. కానీ నీ అందం నన్నాశ్చర్యపరుస్తోంది...." అంది జాహ్నవి.

"నీ అందానికీ నా అందానికీ చాలా తేడా వుంది. నేను నీ కాలిగోటికి పోలను...." అంది మంగళగా నటిస్తున్న యువతి.

"ఆ అందం స్మగ్లర్ గ్యాంగులకుపయోగపడేది—ఈ అందం ప్రతి యింటినీ ఒక ఆలయంగా మార్చేది!" అన్నాడు రామకృష్ణ.

"ఎవర్నువ్వు? మావాడినెలా వలలో వేసుకున్నావు!" అనడిగింది లక్ష్మమ్మ.

"నేను మీవాడిని వలలో వేసుకోలేదు. మీ అబ్బాయి నేను నల్లపిల్ల మంగళ అనుకునే మీ ఇంట ఉండనిచ్చాడు. నా అసలు రూపం అతను చూడలేదు. చూస్తే ఆశ్రయ మిచ్చేవాడు కాదేమో—" అందా యువతి.

రామకృష్ణ, జాహ్నవి, ఆ యువతి రఘురాం ఇంటికి వెళ్ళారు.

కా సే ప టి కి ప్రతాప్ ఇల్లు చేరాడు. సీతాపతి, లక్ష్మమ్మ—కొడుకుతో మంగళ గురించి చెప్పాలని తాప త్రయపడ్డారు.

ప్రతాప్ వారితో మాట్లాడడానికికూడా ఇష్టపడలేదు.

"అమ్మా! ఒక్క పది రోజులు .... నన్నొక్కడినీ ఒంటరిగా వదిలిపెట్టండి. నాతో ఏమీ మాట్లాడ్డానికి ప్రయత్నించకండి. ఆ తర్వాత అన్నీ మీరు చెప్పినట్లు వింటాను...." అన్నాడతను.

తలిదండ్రులు చెప్పినమాట విని మంగళ గురించి అన్ని విశేషాలూ తెలుసుకుని ఉంటే అతడి జీవన పథం మారి పోయేదేమో! ఒక్కోసారి నిజం పక్కనే ఉంటుంది. అప్పుడు కళ్ళు మూసుకోవాలనిపిస్తుంది. ఒక్కోసారి నిజం మారతీరాల ఉంటుంది. అప్పుడు అన్వేషించాలనిపిస్తుంది.

• • •

కోమలి కోరిన అంక రెండు. ఎంతో సంతోషంతో ప్రతాప్ కోరికను అంగీకరించింది. ఆమె కాలేజీకి సెలవు రాసిచ్చింది-పదిరోజులపాటు తను రానని! ఈ విషయమై ప్రతాప్ చాలా శ్రద్ధ తీసుకున్నాడు.

రోజుకొక యువతి చొప్పున నగరంలో మాయమై పోతూంటే ఊరంతా నాలుగు రోజుల్లో గగ్గోలెత్తి పోతుంది. పోలీసులు రంగంలోకి దిగుతారు. ఇంతవరకూ వచ్చి బేతాళపూజ ఈ దశలో విఘ్నమవుతుంది.

ఇప్పుడు మాయమయ్యే యువతులు ఎవరికీ అనుమానం రాని విధంగా మాయమవుతారు. ఒక పద్ధతిలో ఈ విషయం తెలుసుకోవడం కష్టం కూడా అవుతుంది.

కోమలి చాలా ఉత్సాహంగా ఉంది. తనకు జీవితంపై కొత్త ఉత్సాహం పుట్టుకు వస్తున్నదని అన్నదామె. ప్రతాప్ ఆమె ముఖ భావాలు చూడలేదు. మనసునిండా జాహ్నవిని నింపుకుని — "జాహ్నవీ! నేను ప్రవహింప జేస్తున్న ఈ రక్తపుటేర్లు నీకోసం—నాకోసం కాదు" అనుకున్నాడు.

రాత్రి అతను అతి రహస్యంగా పాడుబడ్డ శివాలయం చేరుకున్నాడు. బాబా అక్కడ అతడికి తటపడ్డాడు.

"బేతాళుడు నాకు కలలో కనిపించాడు. తానెంతో ప్రీతిచెందినట్లు చెప్పాడు. నీ కోరిక తప్పక నెరవేరు

తుందట. పూజా విధానం ఇదే పద్ధతిలో కొనసాగా లన్నాడు. నీలోని ఆవేశం పూజ పూర్తి అయేవరకూ తగ్గకూడదన్నాడు...."

"అంటే?"

"నువ్వు మనిషివి కాదు. మృగానివి. ఈ విషయం గుర్తుంచుకోవాలి. పదేపదే నీలో మననం చేసుకోవాలి" అన్నాడు బాబా.

"అవసరంలేదు. నేనిప్పుడు నిజంగానే పశువునే!" అన్నాడు ప్రతాప్. ఈ మాటలంటున్నప్పుడు అతడి గొంతులో దిగులు, వేదన, అసంతృప్తిలేవు.

ప్రతాప్ చుట్టూ చూశాడు.

మొత్తం తొమ్మిదే గోతులున్నాయక్కడ. ఒక గోయి యెక్కడున్నదో కూడా గుర్తు తెలియని విధంగా మాయమైపోయింది.

అప్రయత్నంగా ప్రతాప్‌కు దమయంతి గుర్తుకు వచ్చింది.

"అదుగో — ఆమె వస్తోంది...." బాబా హెచ్చరించాడు.

ప్రతాప్ చూశాడు. దూరాన్నుంచే ఆమె నడకను బట్టి కోమలిగా ఊహించాడు. బాబా అక్కణ్నించి తప్పుకుంటూ— "గుర్తుంచుకో—నువ్వు మనిషివి కాదు. మృగానివి...." అన్నాడు.

ప్రతాప్ అదేమాట అనుకుంటూ కోమలికి యెదురు వెళ్ళాడు.

"హాయ్—ప్రతాప్!" అంటూ అతడిని వాటేసుకుందామె. ప్రతాప్ ఆమెను బలంగా కౌగలించుకున్నాడు.

"కోమలీ— నేను మనిషిని కా దు— పశువుని—"

అన్నాడతను.

"నువ్వే పశువైతే నేను ప్రేమించేది పశువులను మాత్రమే!" అందామె.

గొర్రె కసాయివాడినే నమ్ముతుంది. కోమలి ప్రతాప్‌ని నమ్మింది.

మర్నాడుదయం అక్కడ ప్రతాప్ లేడు, బాబా లేడు. గోతులు మాత్రం ఎనిమిది ఉన్నాయి.

* * *

మంగళగా నటించిన యువతి రామకృష్ణకు తన కథ చెబుతూంటే జాహ్నవి కూడా వింటోంది.

మధురిమ, మంగళ కవలపిల్లలు. ఇద్దరిదీ ఒకేరూపు, ఒకే ఎత్తు, ఒకే మాట. చిన్నతనంలోనే తలిదండ్రులకు దూరమైతే వీళ్ళ అందచందాలు పనికివస్తాయన్న దూర దృష్టితో ఒకడు వీళ్ళను పెంచి పెద్దచేశాడు. అన్ని రకాల ఆటపాటలు, మగాళ్ళ నాకర్షించే జిత్తులు నేర్పాడు. వాళ్ళకు పదహారేళ్ళ వయసువచ్చేక ఊర్మించి మతాం మార్చేశాడు. వీళ్ళ అందంతో జనాలనూరించాలి తప్పితే—వీరిని శారీరకంగా పాడుచేసే ఉద్దేశ్యమతడికి లేదు. అందుకే ఇద్దరిలో ఒకరిని మేకప్ మార్చి అనాకారిని చేశాడు.

ఈ బృందం ఒక స్మగ్లర్ గ్యాంగుని ఆకర్షించింది. ఓ ఇంటర్నేషనల్ స్మగ్లర్ మధురిమ క్యాబరే నృత్యాలను స్మగ్లింగ్‌కుపయోగించే ప్రయోగం చేశాడు. అది విజయవంతమయింది. కేవలం మధురిమ వంపుసొంపులను దర్శించడం కోసం, ఆమె నర్తించే విధానం చూడ్డం కోసం—ఎందరో ఈ స్మగ్లింగ్ గ్యాంగుకు సాయపడసాగారు. ఈలోగా మధురిమ అందం ఆమెకు శాపంగా

పరిణమించింది. ఫలితంగా భీమసేనుడి రక్షణ ఏర్పాటు చేయడం జరిగింది. అది చాలా పటిష్టమైన రక్షణ ఏర్పాటు.

అయితే ఆరుమాసాల క్రితం వీరి పెంపుడు తండ్రి పోయాడు. పెంపుడు తండ్రి పోయినాక మధురిమ చేసిన మొదటి నృత్యం-హోటల్ స్వప్నాలో. ఇక్కడ మంగళ అపహరించబడింది.

నల్లని మనిషిగా మేకప్‌లో ఎక్కువరోజులుండడం కష్టం. అందువల్ల ఒకోసారి మధురిమ, ఒకోసారి మంగళ ఆ మేకప్‌లో ఉంటూండేవారు. హోటల్ స్వప్నాలో మధురిమ మంగళగానూ, మంగళ మధురిమగానూ ఉన్న సమయంలో ప్రతాప్ మధురిమ అనాకారితనానికి చలించకుండా తనకామె కావాలనడం జరిగింది. అతడు అందాల మంగళను తీసిపారేయడమూ, తిరస్కరించడమూ జరిగింది.

అతడికి తమ రహస్యం తెలిసిపోయి ఉండాలని అక్కాచెల్లెళ్ళు అనుమానించి భీమసేనుడినతడిమీదకు పురిగొల్పారు. కానీ ప్రతాప్ అదృష్టం బాగుంది. ఈలోగా డేంజర్ వచ్చి మంగళను అపహరించుకు వెళ్ళిపోయాడు. అప్పుడు చివరి క్షణాల్లో మధురిమ వేషం మార్చుకుని వెళ్ళి నృత్యం చేసింది. ఆమెను అపహరించాననుకుంటున్న మధుసూదనరావు చాలా తికమకపడ్డాడు. మంగళ అతడితో ఆట ఆడించింది. అయితే మధురిమ, మంగళ అనబడే కవలలున్నారన్న అనుమానం అతడి మెదడులో ప్రవేశించకుండా ఉండడంకోసం ఆమె మూడంతస్తుల మేడ మీదనుంచి రెండు అంచెల్లో దూకి రోడ్డుమీదికి చేరి పారిపోయింది. ఈ విద్యలా అక్కాచెల్లెళ్ళిద్దరూ చిన్నతనం నుండీ అభ్యసించినవే! (ఇంకా వుంది)

